

పెచ్చు తీసే పనిలేదు.
ముక్కలు తరగక్కర్లేదు.
శుభ్రం చేసే శ్రమలేదు.
నూరుకునే భారంలేదు.
ఒక్కక్షణం కూడా వృథాకాదు!
ఏ వేళనైనా - ఏ వంటకానికైనా
మీకోసం సంసిద్ధం.
స్వచ్ఛమైన - శుద్ధమైన
ప్రియ అల్లం వెల్లుల్లి
మిశ్రమం.
priya
GINGER & GARLIC PASTE
తిరుగులేని నాణ్యత కోసం
తాజా పరిమళపు ఘుమ ఘుమలకోసం
'ప్రియ' అల్లం వెల్లుల్లి మిశ్రమం.
ఏవిధ కృత్రిమ పదార్థాలు మచ్చుకైనా లేవు. నూటికి నూరుపాళ్ళు ప్రకృతి సిద్ధంగా తయారైన సహజ మిశ్రమం.
priya
దయా ఎంటర్‌ప్రైజస్ లిమిటెడ్,
ాఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాదు - 500 482
Sista's-UEL-609/93 TEL

# చమత్కార కథలు

## అసలు సంగతి!

బస్సు బయల్దేరింది.

కండక్టర్ టిక్కెట్లు కొట్టుకుంటూ వస్తున్నాడు.

రామం దగ్గరికొచ్చి "ఎక్కడికో చెప్పండి"



అనడిగాడు కండక్టర్.

"గొల్లపూడికి ఓ టిక్కెట్టివ్వండి" అంటూ జేబులోంచి పదినోటు తీసి కండక్టరికిచ్చాడు రామం.

కండక్టర్ టిక్కెట్టుతోపాటు రావలసిన చిల్లర రామం చేతిలో పెట్టి ముందుకు కదిలాడు. తనకిచ్చిన చిల్లరను ఒకటికి రెండుసార్లు లెక్కేసుకు చూసుకొని కెవ్వుమని అరచి సీట్లోంచి ధబేల్‌మని కిందపడి మూర్ఛపోయాడు రామం.

డ్రైవర్ బస్సునాపేశాడు.

ప్రయాణీకులంతా రామంకేసి వింతగా చూడసాగారు.

"పాపం మూర్ఛరోగం ఉందేమో" అన్నదో స్త్రీ జాలిగా.

"నరాల బలహీనతయ్యింటుంది" అన్నాడు మరోవ్యక్తి.

"బస్సెక్కేముందు పాముగానీ కరచిందేమో" అన్నాడో వృద్ధుడు.

ఇలా ఎవరికి తోచినవిధంగా వారు మాట్లాడసాగారు.

ఇంతలో ఓ యువకుడు నీళ్లు తెచ్చి రామం మొఖమ్మీద చల్లాడు. కొంచెంసేపటికి రామం తెప్పరిల్లి లేచి తన సీట్లో కూర్చున్నాడు. ప్రయాణీకులంతా తమ తమ సీట్లలో సర్దుకుని కూర్చున్నాక బస్సు బయల్దేరింది మళ్లీ.

"మీ జబ్బు బాగా ముదిరిపోయిందనుకుంటా. మంచి డాక్టర్‌కు చూపించుకోండి" అని రామానికి సలహా ఇచ్చాడు నీళ్లు తెచ్చి చల్లిన యువకుడు.

"మీరు భలేవారే నాకే జబ్బూలేదు" అన్నా

ముఖపత్రచిత్రం: జగ్‌మోహన్

డు రామం.

"ఏ జబ్బూ లేకపోతే మరెందుకలా మూర్ఛపోయారు?" ప్రశ్నించాడా యువకుడు ఆశ్చర్యంతో.

"అదా! నేను ఏనాడూ కనీవినీ ఎరుగని వింత జరిగిందీనాడు. మన కండక్టర్‌గారు పైసా కూడా మిగుల్చుకోకుండా నా టికెట్‌తోపాటు చిల్లర ఇచ్చేశాడు. ఆ ఆనందం పట్టలేక ఆశ్చర్యంతో అలా అరచి కిందపడి మూర్ఛపోయాను అద్దదీ సంగతి" అని అసలు సంగతి చెప్పాడు రామం.

-కొత్తపల్లి సాంబశివరావు

---

## ఆపద

రాత్రి తొమ్మిదిగంటలు.

తిరుమలగిరి బస్టాపులో బస్ దిగింది శారద. అక్కడ్నుంచి పదిహేన్నిముషాలు నడిస్తే గాని, ఇల్లు చేరుకోదు.

ఈదురుగాలులు, ఉరుములు, మెరుపులతో వాతావరణం అల్లకల్లోలంగా ఉంది.

శారద మనసులో అలజడిగా ఉంది. భయంగా ఉంది. నిర్మానుష్యంగా ఉండే దారిలోంచి, ఈ రాత్రిపూట నడిచివెళ్లి క్షేమంగా ఇల్లు చేరగలదా తను? వీధిలైట్లు కూడా సరిగా ఉండిచావవు.

తన కొలీగ్ సుమిత్ర బలవంతం చేయబట్టి బజారుపని అవగానే మొదటిసారిగా ఇవ్వాళ మొదటాట సినిమాకి పోవలిసొచ్చింది. ఏం జరుగుతుందో, ఏమో? భగవంతుడా! రక్షించు. క్షేమంగా ఇంటికి చేర్చు. ఎందుకో, వెనుదిరిగి చూసిన ఆమెకి- తన వెనుకే, తనని అనుసరించి వస్తున్న అతడు కన్పించేసరికి- ఒక్కసారిగా గుండె ఝల్లుమంది.

బస్సులో కూడా తన వెనుకే నిలబడ్డాడు. దృష్టంతా తనపైనే. ఎత్తుగా, బలిష్టంగా ఉంటాడు. ఎర్రనికళ్లు, గుబురుమీసాలు, పెరిగిన గడ్డం. కొట్టొచ్చినట్టు కన్పించే మొరటుతనం- చాలా భయంకరంగా ఉన్నాడు.

పేపర్లలో చదివే 'మానభంగాల' వార్తలు కళ్లముందు మెదిలాయి.

శారదకి నెలక్రితమే పెళ్ళయింది. ముహూర్తాలు అనువుగా లేవని ఇంకా శోభనం కూడా కాలేదు పాపం.




ఎంతో అపురూపంగా దాచుకున్న యవ్వన సంపదని- ఈ దుర్మార్గుడు కొల్లకొట్టి...

శారద నడకవేగం పెంచింది.

అతనూ అదేపని చేశాడు.

ఆమె దారికడ్డుగా వచ్చి నిలబడ్డాడు.

తనని రక్షించేవారు కూడా ఎవరూ లేరు-చుట్టుపక్కల.

''మేడమ్! నాకో గొప్ప ఆపద ఎదురైంది. మీరే రక్షించి, పుణ్యం కట్టుకోవాలి...'' అతని మాటలకు వింతగా, విస్మయంగా చూసింది శారద.

''రేపు మా ఆవిడ బర్త్‌డే. 'విమల్' చీర కొనుక్కొస్తానని చెప్పాను. కానీ ఆఫీసులో పనివత్తిడి మూలంగా కొనడం సాధ్యపడలేదు. ఉత్త చేతుల్తో ఇంటికి వెళ్తే మా బ్రహ్మరాక్షసి ఊరుకోదు. ఏం చెయ్యాల్రా భగవంతుడా? అని ఇందాకట్నుంచీ ఒకటే గింజుకుచస్తున్నాను. బస్సులో మీ చేతిలో ఉన్న 'విమల్' బ్యాగూ, అందులోని చీర రంగూ చూడగానే నా ప్రాణం లేచొచ్చింది. మా రాక్షసి అడిగింది కూడా అదేరకం.

సిస్టర్! నామీద దయదలిచి మీరు కొనుక్కున్న ఆ కొత్తచీర నాకివ్వండి. ఐ విల్ పే ద అమౌంట్. కొంత ఎక్స్‌ట్రా ఇమ్మన్నా ఇస్తాను...! మీరు రేపు కొనుక్కోవచ్చు. ఫర్వాలేదుగా''' దీనంగా బ్రతిమాలుతున్నాడు. జేబులోంచి పర్సుతీస్తూ.

-అవధానుల సుధాకరరావు

---

## వాయిదాపద్ధతి

**బం**గారమ్మగారికి అన్నీ వాయిదాలపద్ధతిలో కొనడం అలవాటు. అక్కడికీ భర్త ఎప్పటికప్పుడు చెబుతూనే ఉంటాడు.



''చూడు బంగారం! మనకేం లేనట్లు ఈ వాయిదాల ఖర్మేందుకూ? పైగా దానివల్ల నష్టమేగానీ లాభమేమాత్రం వుండదు. నీకేం కావాలో చెప్పు. నేను తెచ్చి పెడతాను'' అని ఎంత అనునయంగా చెప్పినా ఆవిడ పద్ధతి అంతే!

పైగా ''ఈయనకేమైనా పిచ్చా, వెర్రా? మొత్తం డబ్బంతా ఒక్కసారే వస్తువు మొహాన పోస్తానంటారు. ఆనకేదైనా డబ్బు అవసరమైతే ఎక్కడినుంచొస్తుందీ. నెలకో ఇంత వాడి మొహాన పారెయ్యడానికీ, వందలూ, వేలూ ఒకేసారి గుమ్మరించడానికీ తేడా లేదూ'' అని అప్పుడప్పుడు గింజుకుంటూ వుండేది.

''మొన్నామధ్య ఆయన మేనకోడలు పెళ్ళికెళ్లి రెండు వేల రూపాయల పట్టుచీర కట్టు

కుని దర్జాగా తిరిగానంటే వాయిదాలమహ త్యం కాదూ. రెండు వందలు కట్టగానే చీర ముందుగా చేతికి రాలేదూ'' అనుకుని ఎప్పటి కప్పుడు వాయిదాల పద్ధతిపై తనకున్న నమ్మ కాన్ని, అభిమానాన్ని రెన్యూ చేసుకుంటూ వుంటుందామె.

ఎంత చెప్పినా భార్య ధోరణి మారదనీ, ఆవిడ పట్టిన కుందేటికి మూడేకాళ్లంటుందనీ పెళ్ళిలోనే అనుభవమయిన ఆవిడ భర్త ఆవి డని మార్చడానికి ఏమాత్రం ప్రయత్నించడు.

ఈ వాయిదాల పద్ధతిద్వారా బంగారమ్మ కొన్న వస్తువులు అన్నీ ఇన్నీ కావు. పైగా ఓ మంచి ముహూర్తం చూసి ఇంట్లోనే చీరల వ్యాపారం పెట్టి వాయిదాల పద్ధతిమీద బట్టల మ్మడం ప్రారంభించింది. భర్త కూడా ఇష్టంలేక పోయినా అది ఆగే పని కాదని తప్పనిసరిగా ఒప్పుకున్నాడు.

ఓరోజు ఆఫీసులో సీరియస్‌గా పనిచేసు కుంటున్న బంగారమ్మ భర్తకి ఫోనొచ్చింది.

'కొత్త బట్టలు తేవడానికి హోల్‌సేల్ షాపు కెళ్ళిన బంగారమ్మగారు అక్కడే పడిపోయా రని, హాస్పిటల్‌లో చేర్చాము అర్జంటుగా రమ్మంటూ' తాయారమ్మకి తోడెళ్లిన పక్కింటి పిన్నిగారినుంచి వచ్చిందా ఫోను.

ఆదరా బాదరా పరిగెత్తుకుంటూ హాస్పిటల్ కెళ్తే డాక్టరు చెప్పాడు.

''చూడండి! ఈవిడకి అర్జంటుగా గుండెకి సంబంధించిన పరీక్షలన్నీ చెయ్యా ల్సుంటుంది. నా అనుమానం కరెక్టయితే ఓ మూడు నాలుగు రోజుల్లో గుండెకి ఓ చిన్న ఆపరేషన్ కూడా చెయ్యాల్సివుంటుంది. ఓ అరవై వేలు దాకా ఖర్చవుతుంది'' అంటూ.

అది వినగానే స్పృహ తప్పిందీయనకు.

కానీ...

''వాయిదాల పద్ధతిలో డబ్బు కట్టు కుంటాంగానీ ఆపరేషన్ చేసెయ్యండి'' అంటూ లేచి కూర్చుంది అప్పుడే స్పృహలోకొ చ్చిన బంగారమ్మ.

-రాధాశివమోహన్

## సీక్రెట్

'దేవుడు లేడని వాదించే ఫలానా... ఐంద్రజా లికుడుగారు సకుటుంబసమేతంగా ఫలానా 'స్వామీజీ'ని దర్శించి, కానుకలు సమర్పించి, తీర్థప్రసాదాలు స్వీకరించి వచ్చారన్న వార్త ఆనాటి పేపర్‌లో చూడడంతోటే ఖంగుతిన్నా ను నేను.

జనాన్ని ఫూల్సు చేయడానికి ఇవ్వాళేం ఏప్రిల్ ఫస్టుకాదే! ఈ పేపర్‌వాళ్లు ఇలా ఎందుకు రాశారబ్బా? అని నాలో నేను ఆలో చించుకుంటున్నంతలోనే నాలుగు దిక్కుల నుంచి తలో న్యూస్‌పేపర్ పుచ్చుకుని బిల బిలా వచ్చేశారు మా మిత్రబృందం.

సుధాకరంగాడైతే అగ్గిమీద గుగ్గిలమైపోతు న్నాడు-



"వీడికిదేం పోయేకాలంరా? నిన్నటిదాకా పే...ద్ద నాస్తికుడిలా పోజులు గొట్టి ఇవ్వాళ వెళ్ళి ఆ స్వామిజీ కాళ్లు పుచ్చుకుంటాడూ? పదండ్రా! ఏం చేస్తాడో వెళ్లి వాడినే అడుగుదాం'' అంటున్నాడు వాడు.

"...ఇలాంటి ప్లేట్ ఫిరాయింపులగాళ్ళవల్లే మన నాస్తికోద్యమం తరచూ వెన్నుపోటుకి గురౌతోంది'' రమేష్ కంఠంలో ఆవేదన తొణికిసలాడింది. ఆ తర్వాత మా వాళ్ళంతా తలోరకంగా పరశురాంగార్ని గురించి విమర్శించడం మొదలెట్టారు.

నిజానికి పరశురాం మంచి మెజీషియన్. ఆయన ప్రదర్శనలు చూసి, ఉపన్యాసాలు విని, రాసిన పుస్తకాలు చదివి మేమందరం నాస్తికులమయ్యాం అంటే అతిశయోక్తంలేదు.

ప్రతి ప్రదర్శనకూ చివరిలో ఆయన అతివినయంగా, "అయ్యా నా దగ్గర ఎలాంటి మాయలు, మంత్రాలూ లేవు. అతీంద్రియ శక్తులంతకంటే లేవు. ఈ మేజిక్ మొత్తం హస్తలాఘవంమీద ఆధారపడే విద్య. మీరు గమనించకుండా ఏ వేలి సందులోనో, కోటుమడతలోనో వస్తువుని దాచేసి మాయంచేసినట్లు నటిస్తాం. అలాగే వాటిని అలాంటి ప్రదేశాల నుంచే చాకచక్యంగా బయటకుతీసి సృష్టించినట్లు 'పోజు'పెడ్తాం. నిజం చెప్పాలంటే శూన్యంనుంచి ఎవ్వరూ ఏ వస్తువునీ సృష్టించలేరు. దేవుడు, దయ్యం పేరుతో ఎవరైనా అలా చెప్పినా మీరు నమ్మాల్సిన పనిలేదు...''అంటూ తను ప్రదర్శించిన కొన్ని అంశాల వెనుకనున్న సీక్రెట్స్ ఏమిటో వివరించి చెప్పేసేవాడు. సీక్రెట్స్ బయటపెట్టేసుకోవడంవల్ల అతనికెలాంటి నష్టమూ ఉండేది కాదు. ఎందుకంటే సమర్థుడవడంవల్ల ఎప్పటికప్పుడు సరికొత్త అంశాల్ని రూపొందించుకొని ప్రతి ప్రదర్శననీ రక్తికట్టించగల సత్తా అతనికుంది. మరి అంతటి మేధావి ఇప్పుడీ పాడుపని ఎందుకు చేసినట్లు?

కారణమేమిటో ఆయన్నే అడిగి తెలుసుకుందామని అందరం కలిసి ఆయనింటికే దారితీశాం.

"చూడండి... మీ ప్రదర్శనలవల్ల, ఉపన్యాసాలవల్ల ప్రభావితమై మేము నాస్తికత్వంపట్ల ఓ అవగాహనను ఏర్పరచుకుని నాస్తికోద్యమానికి నడుంకట్టాం...'' సుధాకరంగాడి మాట పూర్తికాకుండానే-

"అలాగా? వెరీగుడ్ కీపిటప్'' అన్నారు పరశురాంగారు.

"ఊర్కోండి సార్! ఓ పక్క దేవుడు లేడు అంటూ స్టేజీలమీద ఉపన్యాసాలు దంచుతూ మరోపక్క మీరు ఆ స్వామీజీ కాళ్లూ ఈ బాబా పాదాలు పట్టుకోవడం ఏంటి సార్?'' తనను తాను నిగ్రహించుకోలేక గట్టిగా అడిగేశాడు రమేష్.

పరశురాంగారు కోపం తెచ్చుకోలేదు. పైగా ప్రసన్నంగా చిరునవ్వులు చిందిస్తూ-

"నేను దేవుడు లేడు అన్నానేగానీ స్వామీజీ లేరు అనలేదుగదయ్యా'' అన్నారు.

"జోకులెయ్యకండి సార్! విభూదివళ్లు, వాచీలు సృష్టించడం మేజిక్కే తప్ప మహిమేం కాదు. అలాంటి స్వామీజీల్ని నమ్మకండి'' అనే మీరు అదే స్వామీజీని దర్శించి పాదపూజ చేయడంలో అర్థం ఏంటి? ప్రజలంటే పిచ్చివెధవలనా మీ ఉద్దేశం'' రెచ్చిపోయాడు రాజారావు.

పరశురాం ముఖాన నవ్వు మాయమైంది.

కొన్ని క్షణాలు మౌనం వహించి ఆ తర్వాత మెల్లగా- "అయితే నా జీవితంలోని అసలు సీక్రెట్ మీకు చెప్పకతప్పదు. నేను స్వామీజీని దర్శించి, పాదపూజలు చేసినమాట నిజమే. అయితే దేవుడనికాక కేవలం గురువుగానే ఆయన్ని నేను పూజించాను. ఎందుకంటే ఈ మేజిక్కులు, ట్రిక్కులూ అన్నీ ఆయన దగ్గరే నేను నేర్చుకున్నాను. మేజిక్కులన్నీ పూర్తిగా వంటపట్టించుకుని వచ్చేస్తుంటే, 'ఏరా నువ్వు ఓ స్వామిజీవై నాకు పోటీవస్తావా?' అన్నారు స్వామీజీ. 'రాను స్వామీ కేవలం 'ఇంద్రజాలికుడు'గానే మిగిలిపోతాను' అని మాట ఇచ్చాను. ఇక రేపో మాపో ఈ ఫీల్డునుంచి రిటైరైపోదామనుకుంటున్నాను. అంచేత నాకెన్నో విద్యలు నేర్పి నన్నింతవాణ్ణి చేసిన మా గురువుగార్ని సందర్శించి ఆయన ఆశీస్సులు తీసుకున్నాను. నేచేసింది తప్పంటారా?'' అంటూ ముగించారాయన.

మాకేం మాట్లాడాలో తోచక ముఖముఖాలు చూసుకుంటూ నిల్చుండిపోయాం.

-ప్రతాపచంద్ర

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర' లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో గల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. ''చతుర''లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ **ఈ లెక్క ప్రకారం ''చతుర'' కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.**

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడుతుంది.

ఎడిటర్ **చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482



# చతుర

సంపుటి: 16  సంచిక: 6  జూలై: 1993

తన ఫ్యాక్టరీ బాగోగులు స్వయంగా చూసుకుందామని, పుట్టి పెరిగిన ఊరికి వచ్చాడా పారిశ్రామికవేత్త! అక్కడే వున్న బాల్యమిత్రురాలి సమక్షంలో కొద్దిరోజులు వుండవచ్చునని కూడా ఆశించాడతను.

మరి, అత్యుత్సాహంతో ఆ ఊళ్ళో అడుగిడిన అతణ్ణి విస్మయ పరచి, నిశ్చేష్టుడిని చేసిన అక్కడి పరిస్థితులు ఏలాంటివి?

స్నేహితురాలి సమక్షంలో ఊహించుకున్న మధురక్షణాలు మరువలేని పీడకలగా మారడానికి కారణాలేమిటి?

రాజకీయంగా అత్యంత ప్రాధాన్యత సంతరించుకున్న ఈనాటి 'బంద్'లలో కొన్నింటి వికృత తత్వం, నగ్నస్వరూపం ఎలాంటివి? వాటిమూలంగా అతనెదుర్కొన్న దయనీయ స్థితి ఏమిటి?

ఉత్కంఠతో చదివించే జె.వి.బాబు రచన 'బంద్' ఈ నెల 'చతుర' సమగ్రనవల.

# బంద్

## జె.వి.బాబు

"హలో"

"హలో! చతుర్వేదీ స్పీకింగ్"

"మిస్టర్. చతుర్వేది! నేనూ... సోమనాథ్‌ని మాట్లాడుతున్నాను"

"గుడ్‌మార్నింగ్ సర్...! ఏమిటి ఉదయాన్నే ఫోన్ చేశారు?"

"గుడ్‌మార్నింగ్... హైదరాబాద్ నుండి జె.యస్. ఫోన్ చేశాడు. రేపుదయం పదిగంటలకు ఆయన ఫ్యాక్టరీకి వస్తున్నాడట..." చెప్పటం పూర్తికాలేదు.

"జె... జె.యస్. ఫ్యాక్టరీకి వస్తున్నాడా?" చతుర్వేది కంఠం కొద్దిగా వణికింది.

"...యస్! ఆ విషయం తెలిపేందుకే ఫోన్ చేశాను. అలర్ట్‌గా ఉండు. జె.యస్. చిన్న తప్పు కూడా సహించడు. ముఖ్యంగా అడ్మినిస్ట్రేషన్ విషయంలో..."

చతుర్వేది నుదుటన పట్టిన స్వేదాన్ని తుడుచుకున్నాడు. "యస్. సర్! ఐకెన్ డూ మై బెస్ట్"

"చాలా జాగ్రత్తగా ఉండు" అవతలివైపు ఫోన్ పెట్టేసిన శబ్దం తనూ రిసీవర్ హుక్‌మీద ఉంచి, ఛెయిర్‌లో వెనక్కువాలాడు.

ఫ్యాక్టరీకి వందమీటర్ల దూరంలో ఉన్న ఆఫీస్ బిల్డింగ్ అది. సెకండ్‌ఫ్లోర్‌లో ఉన్న ఆ గదిముందు 'వి.కె. చతుర్వేది, పర్సనల్ ఆఫీసర్' అని వ్రాసివుంది.

చతుర్వేది పావుగంటక్రితమే ఆఫీసుకు వచ్చి తన సీట్లో కూర్చున్నాడు. అంతలోనే జె.యస్. వస్తున్నాడని జి.యమ్. సోమనాథ్ నుండి ఫోన్...

జె.యస్!

అయిదుకోట్ల రూపాయల ఆ పేపర్‌మిల్‌కు యజమాని!

ఎప్పుడో అరుదుగా మాత్రమే ఆయన తన ఫ్యాక్టరీ చూసేందుకు వస్తుంటాడు. ఒకప్పుడు ఆయన పుట్టి, పెరిగిన ఊరు అది. ప్రస్తుతం మాత్రం ఆయన నివాసం హైదరాబాద్‌లోనే!

చతుర్వేది ఛెయిర్‌లోనుండి లేచి కిటికీ దగ్గరగా నడిచాడు. విండో కర్టెను పక్కకు లాగాడు.

అక్కడ నిలబడితే ఫ్యాక్టరీ ఆవరణ మొత్తం కనిపిస్తుంది. పదమూడెకరాల ఆవరణలో ఒక వైపు మాత్రమే ఇటుకలగోడ కట్టబడివుంది. మిగిలిన మూడువైపులా ఫెన్సింగ్! పదమూడెకరాలలో సగభాగం 'పేపర్ పల్ప్'గా ఉపయోగపడే చెట్లు నిండుగా వున్నాయి. ఫెన్సింగ్ పక్కనే కూడా ఎత్తయిన వృక్షాలు! వాతావరణ కాలుష్యం అరికట్టేందుకు కూడా వృక్షాలు పెంచడం తప్పనిసరి...

ఫ్యాక్టరీ బాయిలర్‌లోనుండి పొగ పైకి వెళ్లి మబ్బులలో కలిసిపోతోంది. మురుగుతున్న 'పల్ప్'వలన భయంకరమయిన దుర్వాసన ముక్కుపుటాలను తాకుతోంది. మరోవైపు యంత్రాలరొద కర్ణకఠోరంగా వుంది.

కర్టెన్ లాగేసి వచ్చి తన సీట్లో కూర్చున్నాడు చతుర్వేది. ఇంటర్‌కమ్ బటన్ నొక్కాడు. ఒక నిముషం తర్వాత ఆఫీసుబాయ్ వచ్చి ఎదురుగా నిలబడ్డాడు, "ఏం కావాలి సార్?"

"సూపర్‌వైజర్ శివరామ్‌ని నేను పిలుస్తున్నానని చెప్పు"

"అలాగే సర్" బాయ్ వెళ్లిపోయాడు.

"తమకు అగ్రిమెంట్ జరిగి మూడేళ్ళయిందని, వెంటనే తమతో కొత్త అగ్రిమెంట్ కుదుర్చుకోవాలని" యూనియన్‌లీడర్ రాజశేఖర్ తమ యూనియన్ తరపున ఇచ్చిన నోటీసును చదువుతూ కూర్చున్నాడు చతుర్వేది... పదినిమిషాలు గడిచాయి.

"మే ఐ కమిన్ సర్?"

"పిలుపు వినపడి పేపర్‌లోనుండి తలెత్తి చూశాడు చతుర్వేది. శివరామ్ తలవంచి విష్ చేశాడు.

"హలో శివరామ్! కమిన్ టేక్ యువర్ సీట్" అన్నాడు చతుర్వేది.

శివరామ్ టేబుల్ ఎదురుగా ఉన్న సీట్లో కూర్చున్నాడు.

"రేపు జె.యస్. ఫ్యాక్టరీకి వస్తున్నాడు టోయ్"

కనుబొమలు ముడిచాడు శివరామ్, "నిజమా సార్?"

''అవునోయ్'' అని ఆగి, ''రేపు నీది డే డ్యూటీనేకదూ?'' ప్రశ్నించాడు చతుర్వేది.

''యస్ సార్'' జవాబిచ్చాడు.

''సో! నువ్వో పని చేయాలోయ్''

''చెప్పండి సార్'' నమ్రతగా పలికాడు శివ రామ్.

''రేపు నువ్వొచ్చేసరికి 'బి'షిఫ్ట్‌వాళ్ళు డ్యూటీలోనికి వచ్చి ఉంటారుకదూ! వారందరికీ కాస్త జాగ్రత్తగా పనిచేయమని చెప్పు. మిషన్స్ వదిలేసి పక్కవాళ్ళతో బాతాఖానీ కొట్టవద్దను... పోతే స్వీపర్స్‌కి చెప్పి రోడ్స్ క్లీన్‌గా ఉంచమను''

''అలాగే సర్''

చతుర్వేది తన పక్కనే ఉన్న కాఫీ రెండు కప్పులలోనికి వంచాడు. ఒక కప్పు శివరామ్ ముందుంచాడు.

శివరామ్ కాఫీ సిప్ చేస్తూ చతుర్వేది వంక చూశాడు. చతుర్వేది బెంగాలీ అయినా ఆంధ్రాలో స్థిరపడిపోయాడు. యం.బి.ఏ. కంప్లీట్ చేశాక రెండు మూడు కంపెనీలలో పనిచేసి, చివరకి పేపర్‌మిల్‌లో పి.ఓ.గా జాయిన్ అయ్యాడు. గత నాలుగేళ్లుగా ఆ పోస్ట్‌లోనే ఉన్నాడు.

కాఫీ తాగటం పూర్తయ్యాక శివరామ్ లేచి ''వస్తాను సార్'' అన్నాడు.

తలూపాడు చతుర్వేది.

మెట్లుదిగి కిందికి వచ్చాడు శివరామ్. ప్యాంట్ జేబులలో చేతులు పెట్టుకుని ఈల వేసుకుంటూ మెషిన్స్‌వైపు నడిచాడు.

పేపర్ రోల్స్‌గా వస్తోంది. ఆపరేటర్స్ చేతులు వేగంగా పనిచేస్తున్నాయి. మరోపక్క పేపర్ కౌంటింగ్ జరుగుతూ ఉంది. ఇంకోవైపు బండిల్స్‌గా కడుతున్నారు.

అటువైపు చూసిన శివరామ్ కన్నులు పెద్దవయ్యాయి. పేపర్ బండిల్స్‌గా కట్టే రమేష్ గోడకు ఒరిగి నిద్రపోతున్నాడు. శివరామ్‌కి కోపం వచ్చింది. అతడు వేగంగా అటు నడిచాడు. ''ఏయ్ రమేష్'' అరిచాడు.

ఉలికిపడి కళ్లు తెరిచాడు రమేష్. ఎదురుగా నరసింహావతారంలో ఉన్న శివరామ్‌ని చూసి ఖంగుతిన్నాడు.

''ఏమిటోయ్ ఇంత ఉదయాన్నే నిద్రపోతున్నావు?''

''సార్... రాత్రి షిఫ్ట్ కూడా వర్క్ చేశాను సర్! రిలీవర్ రాలేదు. ఇది రెండో షిఫ్ట్... రాత్రంతా నిద్రలేకపోవడంతో...'' తల గోక్కున్నాడు.

జె.యస్. ఫ్యాక్టరీకి వస్తున్నాడన్న న్యూస్ తాలూకూ టెన్షన్‌లో ఉన్నాడు శివరామ్ 'రేపు జె.యస్. వచ్చాక ఇలాంటి సన్నివేశం ఎదురయితే...?' అందుకే శివరామ్ ఆ చిన్న విషయాన్ని కాస్త సీరియస్‌గా తీసుకున్నాడు.

''డ్యూటీలో ఉన్నప్పుడు నిద్రపోవటం చాలా తప్పు. ఇంకెప్పుడూ ఇలాంటి తప్పు చేయనని ఎక్స్‌ప్లనేషన్ వ్రాసివ్వు''

రమేష్‌కి చిరాకేసింది ''సర్! రాత్రి డ్యూటీ చేసి, ఇప్పుడు ఓవర్‌డ్యూటీ చేయనంటే మీరే బ్రతిమాలారు. ఏదో పొరపాటున అలా మాగన్నుగా నిద్రపట్టింది. అంతమాత్రానికే మీరు ఫైరయిపోవటం బాగాలేదు''

శివరామ్ రీజన్ ఆలోచించలేదు. మొండిగా ''నాకివన్నీ తెలియదు. ముందు ఎక్స్‌ప్లనేషన్ వ్రాసివ్వు. లేకపోతే సస్పెండ్ చేయవలసివస్తుంది'' అన్నాడు.

అప్పుడే ఒకరిద్దరు వర్కర్స్ వారి పక్కన చేరి చోద్యం చూడసాగారు.

రమేష్ భయపడలేదు. ''మీకు చేతనయింది మీరు చేసుకోండి. ఇందులో నా తప్పు ఎంతో సాటి వర్కర్స్‌ని ఎవరినడిగినా చెపుతారు'' పక్కనున్నవారికి చూపించాడతడు.

''వర్కర్స్ మొత్తం ఒక్కటేకదా! వాళ్ళంతా నీవైపే మాట్లాడుతారు... నా దృష్టిలో జరిగింది తప్పు. కాబట్టి కాగితంవ్రాసిస్తావో లేదా మమ్మల్నే, సస్పెండ్ చేయమంటావో తేల్చుకో''

కార్మికులు మరికొంతమంది వారిచుట్టూ గుమిగూడారు. రమేష్‌కి మరికాస్త ధైర్యం వచ్చింది.

అంతమంది వర్కర్స్ ముందు తనమాట నెగ్గకపోతే రేపు వాళ్ళెవరూ తనను కేర్ చేయరు. అందుకే శివరామ్ గట్టిగా పట్టుబట్టాడు.

చాలాసేపు వాదోపవాదాలు జరిగాయి. వర్కర్స్ కొంతమంది శివరామ్‌కి సర్దిచెప్పాలని ప్రయత్నించారు. అతను వినలేదు.

కొన్ని సమయాలలో మనిషి ఎందుకంత పట్టుపడతాడో తెలియదు. జె.యస్. వస్తున్నాడన్న టెన్షనా? లేక పి.ఓ.ను కొద్దినిమిషాల క్రితమే కలసిరావడంవలన వచ్చిన ఉత్తేజమా...? శివరామ్ రమేష్‌నుండి లెటర్ కోరుతూ పట్టుబట్టాడు.

రమేష్ సిన్సియర్ వర్కర్. మరి పొరపాటు ఎవరికయినా సహజమే! పొరపాటు జరిగిందని క్షమాపణ కోరితే...? తొలితప్పు, మలితప్పు అని ఉంటుందికదా!

"ఓయ్! నేను ఎలాంటి లెటర్ వ్రాసివ్వను. ఏం చేసుకుంటావో చేసుకోపో" చివరికి చిర్రెత్తుకొచ్చి చెప్పేశాడు రమేష్.

ఆ మాటతో శివరామ్ 'అహం' దెబ్బతింది. అతడు తిన్నగా చతుర్వేది దగ్గరకు వెళ్ళాడు. జరిగిన సంఘటనకు మరింత రంగుపులిమి చెప్పాడు. తన పరువు కాపాడకపోతే, మర్నాటి నుండి వర్కర్స్ ముందు చీప్ అవుతానని, అడ్మినిస్ట్రేషన్ దెబ్బతింటుందని చెప్పాడు. దాంతో చతుర్వేది ఆలోచనల్లో పడ్డాడు.

జె.యస్. రాబోతున్నాడు. ఇలాంటి సమయంలో వర్కర్స్‌ని అదుపులో పెట్టకపోతే... ఊహు! దీన్ని అలుసుగా తీసుకుని వర్కర్స్ జె.యస్.ముందు కూడా నిర్లక్ష్యంగా ప్రవర్తించవచ్చు.

అందుకే అతడు ఓ నిర్ణయానికి వచ్చాడు... రమేష్‌ని నెలరోజులపాటు సస్పెండ్ చేయాలనుకున్నాడు.

చతుర్వేది బిజినెస్ అడ్మినిస్ట్రేషన్ సర్టిఫికేట్ సంపాదించాడేగానీ, వర్కర్స్ సైకాలజీ చదవలేకపోయాడు. 'హౌటు డీల్ విత్ ది లేబర్' అన్నది అతడికి తెలియదు.

అతడు టైపిస్ట్‌ని పిలిచి లెటర్ డిక్టేట్ చేశాడు.

రమేష్ సస్పెన్షన్ ఆర్డర్ తయారయింది. ఆ మధ్యాహ్నం అది ఆ వ్యక్తికి అందచేయబడింది.

తన సస్పెన్షన్ ఆర్డర్ చూసి రమేష్ ఆశ్చర్యపోయాడు. తను చేసిన చిన్న తప్పుకి అంత పెద్ద శిక్ష విధింపబడుతుందని అతడు ఊహించలేదు. అతడి ఆశ్చర్యం మెల్లగా కోపంగా మారింది. అతడు శివరామ్ మీదికి కొట్లాటకు వెళ్ళబోయాడు. కాని మిత్రులు సర్దిచెప్పడంతో ఆగిపోయాడు. అయితే వారి సలహా మీదనే అతడు తమ యూనియన్ లీడర్ రాజశేఖరాన్ని కలుసుకున్నాడు.

సుమారుగా వెయ్యిమంది కార్మికులు ఆ పేపర్‌మిల్‌లో పనిచేస్తున్నారు. మూడు యూనియన్‌లున్నాయి. అందులో ఒక యూనియన్ నాయకుడు రాజశేఖరం.

రమేష్ చెప్పినదంతా శ్రద్ధగా విన్నాడు రాజశేఖరం.

"...నేను వాడినేమీ అనలేదన్నా! వాడే వెళ్లి పి.ఓ.తో ఏం చెప్పాడో ఏమో! పి.ఓ. నన్ను సస్పెండ్ చేశాడు"

రాజశేఖరం తలూపాడు. అతడి చూపులు ఎదురుగా కూర్చుని ఉన్న రమేష్‌మీదే ఉన్నాయిగానీ, మనసు మాత్రం ఎక్కడో ఉంది.

అప్పటికే రాజశేఖరానికి ఇన్‌ఫర్మేషన్ వచ్చేసింది- మర్నాటి ఉదయమే జె.యస్. ఫ్యాక్టరీకి రాబోతున్నాడు. ఈరోజు చతుర్వేది రమేష్‌ని సస్పెండ్ చేశాడు. దీనికి తాము వెంటనే రియాక్షన్ తీసుకుంటే ఏమవుతుంది?!... జె.యస్.కి ఈ విషయం తెలిస్తే ఆయన ఎలాంటి చర్య తీసుకుంటాడో?! పట్టుదలకు వెళ్తే జె.యస్. ఫ్యాక్టరీ అయినా మూసుకుంటాడుగానీ, అడ్మినిస్ట్రేషన్ దెబ్బతింటే మాత్రం ఒప్పుకోడట... జె.యస్. గురించి తాను చాలా విన్నాడు.

జె.యస్. అంటే జె.శ్రీనివాస్. వ్యాపారవర్గాలలో అతడి పేరు జె.యస్. అయింది.

అతడి మిత్రులంతా అతడి గురించి చాలా రకాలుగా చెపుతుంటారు. శ్రీనివాస్ జె.యస్. కాక మునుపు చాలా అమాయకంగా ఉండేవాడట. మిత్రులను వెంటేసుకుని జేబులో డబ్బు ఖర్చు చేసేవాడు. జీవితానికి ఓ లక్ష్యం అంటూ లేదు.

ఏం జరిగిందో తెలియదు- అతడిలో ఒక్క

సారిగా మార్పు వచ్చేసింది. మనీ మేకింగ్‌లో పడ్డాడు. డబ్బు ఎలా సంపాదిచడమా అని ఆలోచించసాగాక, శారీరకంగా, మానసికంగా చాలా శ్రమపడ్డాడు. డబ్బు ఎక్కడ- ఎలా ప్రవహిస్తుందో బాగా స్టడీ చేశాడు. సహజంగానే అతడిలో విపరీతమయిన తెలివితేటలున్నాయి. కాని మంచితనం సున్నిత మనస్తత్వం కారణంగా అనామకంగా ఉండిపోయాడు. డబ్బు సంపాదన మార్గంలో అతడు స్టాక్ ఎక్స్ఛేంజిలలో ఎంటర్ అయ్యాడు. షేర్స్ అమ్మడం, కొనడంలో జె.యస్. బాగా సంపాదించాడు. ఆ డబ్బుతో ఫ్యాక్టరీలు కట్టించాడు. అతడికున్న మూడు ఫ్యాక్టరీలలో పేపర్‌మిల్ ఒకటి!

''చెప్పన్నా! రేపటినుండి మన యూనియన్ వాళ్ళందరం స్ట్రయిక్ చేద్దాం... ఏమంటావు?'' రాజశేఖరం మౌనంగా ఉండడం చూసి అడిగాడు.

రాజశేఖరం పెదవి విప్పాడు. ''రేపు జె.యస్. మిల్ చూసేందుకు వస్తున్నాడట''

''అయితే?'' రమేష్ కనుబొమలు ముడిచాడు.

''జె.యస్. వెళ్లాక స్ట్రయిక్ చేయటం బాగుంటుందేమోనని ఆలోచిస్తున్నాను''

''అదేంటన్నా?'' ఆశ్చర్యపోయాడు రమేష్.

''జె.యస్. గురించి మీరు కొద్దిగానే విన్నారు. నేను చాలా విన్నాను... అందుకే ఆలోచించి చెపుతున్నాను. రేపు చతుర్వేదికి సమ్మె నోటీసు ఇద్దాం. అతడు సస్పెన్షన్ ఆర్డర్ వెనక్కు తీసుకోకపోతే అప్పుడు నెక్స్ట్ స్టెప్ వేద్దాం... సమ్మె చేద్దాం...''

అక్కడ సమావేశమయిన కార్మికులంతా రాజశేఖరం నిర్ణయానికి తలలూపారు. రమేష్‌కి మాత్రం చాలా ఆవేశంగా ఉంది. వెంటనే సమ్మెలోనికి దిగాలనిపిస్తుంది. కాని అంతమంది కార్మికులు తలలూపాక, ఒక యూనియన్ లీడర్ డిసైడ్ చేసి చెప్పాక మరీ రెట్టించడం బాగుండదనుకున్నాడు. అందుకే అయిష్టంగానయినా తనూ తలాడించాడు.

''రేపు ఆ రెండు యూనియన్‌ల లీడర్లతో మాట్లాడుతాను. వారిని కూడా మన సమ్మెలో పాల్గొనమని చెపుతాను'' రాజశేఖరం చెప్పాడు.

''అది మంచిపని... ఆ యూనియన్‌లు కూడా మనకు సపోర్ట్ చేస్తే, పి.వో. వెంటనే దిగి వచ్చేస్తాడు'' అన్నాడో కార్మికుడు.

అప్పుడు సమయం రాత్రి పదిగంటలయింది. సుమారుగా యాభైమంది కార్మికులు ఆ పార్టీ ఆఫీసులో సమావేశమయి ఉన్నారు.

చాలామంది రాజశేఖరం ఆలోచననే సమర్థించారు. కాసేపు తర్జన భర్జన జరిగాక ఒక నిర్ణయానికి వచ్చారు. ఆ తర్వాత రాజశేఖరం మర్నాడు పి.ఓ.కి ఇవ్వబోయే సమ్మె నోటీసు తయారుచేసి చదివి వినిపించాడు వారందరికీ!

''తమ యూనియన్‌లో మెంబరయిన రమేష్ అనే కార్మికుడిని మేనేజ్‌మెంట్ అన్యాయంగా సస్పెండ్ చేసింది. కాబట్టి ఆ సస్పెన్షన్ ఉపసంహరించుకోకపోతే తమ యూనియన్ రెండోరోజునుండి సమ్మె చేస్తుంది...''

క్లుప్తంగా సమ్మె నోటీసులోని మేటర్ అది. ముఖ్యులు కొందరు దానిమీద సంతకాలు చేశారు.

సమావేశం ముగిసింది.

అంతా బయటకు నడుస్తుంటే రాజశేఖరం, రమేష్ పక్కనే నడుస్తూ చెప్పాడు. ''ఈ సమ్మె నోటీసు జె.యస్. వచ్చి వెళ్ళాక చతుర్వేదికి ఇస్తాను... ఏమంటావ్?''

''అలాగే'' తలూపాడు రమేష్.

కార్మికులంతా తలో దిక్కు వెళ్లిపోయారు. రాజశేఖరం, రమేష్ సెంటర్‌లో ఉన్న టీకొట్టు వైపు నడవసాగారు.

రమేష్‌కి అప్పుడే గుర్తుకు వచ్చినట్టుంది ''అన్నా! రేపు ప్రతిపక్షాలు 'బంద్' చేస్తున్నాయి కదా! జె.యస్. ఫ్యాక్టరీకి ఎలా రాగలడు?''

''బంద్ మొదలయ్యేది పదిగంటల తర్వాతకదా?!... జె.యస్. ఉదయాన్నే ఫ్యాక్టరీకి వచ్చి పదిగంటలలోపు గెస్ట్‌హౌస్‌కి వెళ్లిపోతాడు...''

''ఈ బంద్ ప్రభావం మన మిల్‌మీద ఏమీ ఉండదా?''

''టౌన్‌కి పాతిక కిలోమీటర్ల దూరంలో ఉండే

మన మిల్ దగ్గరకు ఎవరు వచ్చి 'బంద్' చేయమని అడుగుతారు? అది జరిగేపనికాదు. మన మిల్ రన్ అవుతుంది. అనుమానంలేదు''

సెంటర్‌లో టీ తాగాక ఇద్దరూ కొద్దిదూరం నడిచారు. ఒక వీధిమలుపు దగ్గర నిలబడి రమేష్ ''ఉంటానన్నా'' అన్నాడు.

''గుడ్‌బై'' చెప్పి ముందుకు సాగిపోయాడు రాజశేఖరం, 'వెళ్లి త్వరగా నిద్రపోవాలి. రేపు 'బి' షిఫ్ట్‌లో డ్యూటీ ఉంది' అనుకున్నాడతడు.

★ ★ ★

శ్రీనివాస బట్టలు సర్దుకున్నాక తల్లితో చెప్పాడు, ''అమ్మా! నేను మన మిల్ చూసేందుకు వెళుతున్నాను... మరో వారంరోజులు అక్కడే ఉండొచ్చు''

''వారంరోజులు అక్కడే ఎందుకు?'' ఆశ్చర్యంగా అడిగింది రాధమ్మ.

''ఈమధ్య బిజినెస్‌పనుల వత్తిడిలో బాగా విసిగిపోయాను. హైదరాబాద్‌లో ఉంటే ఆ వ్యాపకాన్ని తప్పించుకోలేను. అందుకే వారంరోజులపాటు నేను పెరిగిన ఆ ఊరిలో...''

రాధమ్మకు కొద్దిగా అర్థమయింది. క్షణం ఆగాక అడిగిందామె, ''నెల్లూరు వెళితే లక్ష్మిని కలుస్తావా?''

అతడు భుజాలు ఎగరేశాడు, ''బహుశా కలుస్తానేమో... అయినా నాకు అక్కడ ఏం తోస్తుంది...? అందుకే కలుస్తాను''

''అసలు అతడు వారంగోజులు ఆచోట ఉండబోయేది ఆమెతో గడిపేందుకేనని ఆ తల్లికి తెలుసు. కాని రెట్టించలేదామె!

''నాకూ... నాకూ లక్ష్మిని చూడాలని ఉందిరా'' అందామె.

''అయితే బయలుదేరమ్మా...! నాతోపాటే నాలుగయిదురోజులు ఉండి వచ్చేద్దువు'' వెంటనే అన్నాడతడు.

''ఇప్పుడా?'' అని ఆగి, అరనిమిషం తర్వాత చెప్పిందామె, ''ఇప్పుడు వద్దులేరా... రెండురోజుల తర్వాత బయలుదేరి వస్తాను. నన్ను స్టేషన్‌లో రిసీవ్ చేసుకో. తర్వాత ఇద్దరం కలిసి హైదరాబాద్ వచ్చేద్దాం''

''అలాగేనమ్మా''

''నువ్వు జాగ్రత్త... రేపు 'ఆంధ్రా బంద్' అని పేపర్‌లో వచ్చింది. బంద్ సమయంలో కారులో అటు ఇటు తిరగకు. అసలే రోజులు బాగాలేవు''

నవ్వి ఊరుకున్నాడు అతడు.

సూట్‌కేస్ పట్టుకుని కారిడార్‌లోనికి వచ్చాడు. రాధమ్మ వెనకనే వచ్చింది. అతడు రావడం చూసి డ్రైవర్ కారు తీసుకుని ముందుకు వచ్చాడు. శ్రీనివాస్ కారెక్కి కూర్చుని డ్రైవర్‌తో చెప్పాడు ''రైల్వేస్టేషన్‌కి పోనివ్వు''

రాధమ్మ చెయ్యి ఊపింది. అతడు తల్లి వంక తిరిగి చెయ్యి ఊపాడు. కారు ముందుకు కదిలింది.

హైదరాబాద్ సిటీ రోడ్లు రద్దీగా ఉన్నాయి. అప్పుడప్పుడే కనుచీకటి పడుతూ ఉంది.

కారు టేంక్‌బండ్ దాటి సికింద్రాబాద్ స్టేషన్‌వైపు పరుగెత్తసాగింది.

అతడు సీట్‌లో వెనక్కువాలి కళ్లు మూసుకున్నాడు. అతడి కనురెప్పల పరదాల వెనుక లక్ష్మిరూపం ప్రత్యక్షమయింది. అతడి పెదాల మీద చిరునవ్వు కదలాడింది. ''వస్తున్నాను లక్ష్మీ... నిన్ను చూసేందుకే వస్తున్నాను. నీ సన్నిధిలో కొద్దిరోజులు ప్రశాంతత అనుభవించేందుకు వస్తున్నాను...' మనసులోనే అనుకున్నాడు అతడు.

కారు సికింద్రాబాద్ స్టేషన్‌ముందు ఆగింది. డ్రైవర్ సూట్‌కేస్ తీసుకుని అప్పటికే ప్లాట్‌పారంమీద ఆగివున్న రైలు కంపార్ట్‌మెంట్‌లో పెట్టాడు. శ్రీనివాస్ ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌లోని తన సీట్లో కూర్చుని వెంటతెచ్చుకున్న పేపర్ తెరిచాడు.

''రేపే ప్రతిపక్షాల ఆధ్వర్యంలో ఆంధ్రా బంద్''

పెద్ద అక్షరాలతో హెడ్డింగ్ కనుపించింది. 'ఛిట్' పేపర్‌ను పక్కన విసిరికొట్టాడు అతడు. ''ఈ రాజకీయ పార్టీలు ఎందుకు 'బంద్' చేస్తాయో అర్థం కాదు. ఈమధ్యకాలంలో ప్రతి చిన్న కారణానికి 'బంద్' చేయడం, ప్రజల జీవితాన్ని స్తంభింపచేయడం మామూలయిపోయింది. ఏదో పెద్ద కారణంతో 'బంద్

చేస్తే ఫర్వాలేదు. ఒక మంత్రి మరో ప్రతిపక్షనాయకుడిని తిట్టినా 'బంద్', ఒక గూండాను పోలీసులు అరెస్ట్ చేసినా బంద్... బంద్... బంద్... నలుగురు జనాలను పోగుచేయగలిగిన ప్రతి ఒక్కడూ బలవంతంగా దుకాణాలు మూయించడం, జనజీవితాన్ని స్థంభింపచేయడం... బంద్ అంటే చాలా మామూలు విషయమయిపోయిందీ నాయకులకు...

కొద్దినిమిషాలు ఆలోచనలతో గడిపాక అతడు ప్రశాంతంగా నిద్రపోయాడు.

వేకువజామున రైలు అతడు దిగవలసిన స్టేషన్‌లో ఆగింది. అప్పటికి పావుగంటక్రితమే లేచి ఉన్నాడు శ్రీనివాస్.

రైలు ఆగిన వెంటనే కంపార్ట్‌మెంట్ వెతుక్కుంటూ జి.యమ్. సోమనాథ్ మరో ఉద్యోగి వచ్చారు. అతడి చేతిలోని సూట్‌కేస్ అందుకున్నారు.

బయట ఫ్యాక్టరీ కారు ఉంది. అతడు కారు ఎక్కాక అది గెస్ట్‌హౌస్‌వైపు సాగిపోయింది.



ఉదయం ఎనిమిది గంటలయింది.

మారుతికారు గేటు ముందుకు వచ్చి హారన్ కొట్టడంతోనే సెక్యూరిటీగార్డ్ గేటుతీసి సెల్యూట్ కొట్టాడు. కారు తిన్నగా వెళ్లి ఆఫీస్ బిల్డింగ్‌ముందు ఆగింది.

జె.యస్. కారు డోర్ తీసుకుని కిందికి దిగాడు.

అయిదున్నర అడుగుల ఎత్తుంటాడు అతడు. ముప్పయ్‌మూడేళ్ల వయసు ఉండొచ్చేమో! ఇతరులతో అతడు చాలా తక్కువగా మాట్లాడుతాడు. అతడు మనసువిప్పి మాట్లాడేది తన తల్లితో, మరొకరితో మాత్రమే!

జె.యస్. రెండడుగులు వేశాడు. ఆఫీస్ స్టాఫ్ ఒక్కొక్కరే వచ్చి విష్‌చేసి తప్పుకున్నారు. అతడు తిన్నగా ఆఫీస్‌రూమ్‌లోకెళ్లి కూర్చున్నాడు. సోమనాథ్, చతుర్వేది అతడికి ఎదురుగా నిలబడ్డారు.

''ఫ్యాక్టరీ పొజిషన్ ఎలా ఉంది?''

''చాలా బాగుంది సార్'' జి.యమ్. జవాబు అది.

''ఏవయినా ప్రాబ్లమ్స్ ఉన్నాయా?''

''లేవు సార్'' బదులిచ్చాడు చతుర్వేది.

జె.యస్. పైకిలేచి బయటకు నడిచాడు. సోమనాథ్, చతుర్వేది అతని పక్కనే నడువసాగారు. మిల్ మొత్తం తిరుగసాగాడు అతడు.

బాయిలర్ దగ్గర రెండు నిమిషాలు నిలబడ్డాడు. ఎర్రని నిప్పుకణికలు... పది అడుగుల దూరానికి సెగ తాకుతోంది. కార్మికుడొకడు లోపల బొగ్గు వేస్తున్నాడు.

అతడు ముందుకు నడిచాడు. వర్కర్స్ తమ పనిచేస్తూనే ఓరగా యజమాని వంక చూస్తున్నారు. అతడు మిల్ మొత్తం పరీక్షగా చూస్తున్నాడు.

అదే సమయంలో- రాజశేఖరం ఓ మూలగా పిట్‌వాల్ ఎక్కి వాటర్‌పైప్ వాల్వ్‌ని బిగిస్తున్నాడు. ఆ వాటర్‌పైప్‌లలోనుండి నీరు 'పల్ప్'కి వెళుతుంది. అక్కడ జాయింట్ లూజ్‌గా ఉండడంతో వాటర్‌లీక్ అవుతోంది.

జె.యస్. నలువైపులా చూసుకుంటూ అటుగా వచ్చాడు. తల పైకెత్తి రాజశేఖరం చేస్తున్నపని చూశాడు.

మనిషి జీవితంలో ఊహించని సంఘటనలే ఎక్కువగా జరుగుతాయి. అలా జరుగుతుందని రాజశేఖరం కూడా ఊహించలేదు.

రాజశేఖరం స్పానర్‌తో జాయింట్‌ని గట్టిగా తిప్పాడు. ఒక చుట్టు ఎక్కువగా తిరిగింది. గ్రిప్ జారిపోయింది. జాయింట్‌గా ఉన్న పైపు పక్కకు జరిగింది.

మరుక్షణం- రెండంగుళాల వెడల్పున్న ఆ

## సచిత్ర విచిత్రం

# శ్మశానంలో పెళ్ళి సందడి!



'ధర్మేచ, అర్థేచ... నాతిచరామి' అన్న మన వేదసూత్రాన్ని కాలిఫోర్నియాలో మరోపద్ధతిలో ఆచరిస్తున్నారు వధూవరులు. 'ఒక్క మృత్యువు తప్ప మనల్ని ఏదీ విడదీయలేదు' అంటూ రెండు శవపేటికల్లో వధూవరులిద్దరూ కూర్చుని, ఉంగరాలు మార్చుకుని వివాహం చేసుకుంటున్నారు. దీనివల్ల చీటికీ మాటికీ విడాకులిచ్చేసుకునే బెడద తప్పుతుందని అక్కడి ప్రజల అభిప్రాయం. ఇంతకీ ఈ శవపేటికలను తయారుచేసి అద్దెకిచ్చే ఓ మహిళామణికి ఈ వ్యాపారం అక్షరాలా 'మూడు పెళ్ళిళ్ళు, ఆరు పేటికలూ' అన్నట్టు నడుస్తోందట. 'పిండికొద్దీ రొట్టె' అన్నట్టు శవపేటిక అందచందాల్ని బట్టే అద్దె కూడా వుంటుందిమరి.

పైప్‌లో ప్రవహించే నీరు ఒక్కసారిగా నేలకు ధారగా జారింది. ఆ ధార నేలను తాకలేదు. సరిగ్గా జె.యస్. తలను తాకింది. అతడిని పూర్తిగా తడిపేసింది.

ఒకటి... రెండు... మూడు సెకనులు... అక్కడ ఎవ్వరికీ ఏమీ తోచలేదు. ముందుగా తేరుకున్నది రాజశేఖరం, చప్పున పైప్‌ని పైకి జరిపి జాయింట్ చేశాడు. అప్పుడు తేరుకున్నారు చతుర్వేది, సోమనాథ్!

''యూ బాస్టర్డ్! కళ్ళు... కళ్లు కనిపించ లేదా...'' ఆవేశం ఆపుకోలేక అరిచాడు చతుర్వేది. సోమనాథ్ ఒక అడుగు ముందుకు వేశాడు. జె.యస్. చెయ్యి అడ్డంగా ఉంచడంతో ఆగిపోయాడు.

తప్పు తనదే! అందుకే పి.ఓ. నీచంగా మాట్లాడినా సహించాడు రాజశేఖరం. అందులోనూ జె.యస్. తనవలన చాలా చాలా ఇబ్బందిపడవలసి వచ్చింది. రాజశేఖరం భయపడ్డాడు కూడా! బిత్తరచూపులు చూడసాగాడు.

''సార్! వీడిని... వీడిని ఇప్పుడే డిస్మిస్ చేస్తాను సార్'' వణికిపోతూ కీచుగా అరిచాడు చతుర్వేది.

అటువంటి సిట్యుయేషన్‌లో కూడా జె.యస్. తొణకలేదు. సన్నని చిరునవ్వు పెదాలమీదినుండి చెరిగిపోలేదు. ''నో నో! ఇందులో అతడి తప్పేంలేదు... అతడినేమీ అనవద్దు'' చెప్పాక అతడు తడిబట్టలతోనే వెళ్లి కారులో కూర్చున్నాడు. డ్రైవర్ కారు స్టార్ట్ చేశాడు. సోమనాథ్, చతుర్వేది కారు దగ్గరకు వెళ్లారు. ''సారీ సర్... మిమ్మల్ని చాలా ఇబ్బంది పెట్టాం సార్''

''ఇట్సాల్‌రైట్''

క్షణమాగి ప్రశ్నించాడు చతుర్వేది ''హైదరాబాద్ వెళ్లిపోతున్నారా?''

''లేదు. ఒక వారంరోజులు ఈ టౌన్‌లోనే ఉండాలనుకుంటున్నాను. పుట్టిపెరిగిన ఊరు కదా!... మనసు అప్పుడప్పుడూ కొద్దికాలం ఇక్కడే గడపాలని కోరుకుంటుంది'' సన్నగా నవ్వాడు జె.యస్.

అతడు కనుసైగ చేయడంతో కారు ముందుకు కదిలింది.

తనకు జరిగిన సంఘటనను మరిచిపోయి వెళ్లిపోయాడు జె.యస్. కాని అతడికి జరిగిన అవమానాన్ని భూతద్దంలోంచి చూశారు చతుర్వేది. సోమనాథ్‌లు. అందుకు బాధ్యుడు రాజశేఖరం అని నిర్ణయించి, వెంటనే అతడిని నెలరోజులపాటు సస్పెండ్ చేశారు.

* * *

''మే ఐ కమిన్''

ప్రిస్క్రిప్షన్ వ్రాస్తున్న లక్ష్మి తలెత్తి చూసింది. అతడిని చూడడంతోనే ఆమె కనులు మిలమిల మెరిశాయి.

''ఎప్పుడొచ్చారు?'' చేతిలోని పెన్ టేబుల్ మీద పడేసింది. కుర్చీలో వెనక్కువాలింది. రిలాక్సింగ్‌గా!

అతడు ఆమె ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు. ''ఉదయం వచ్చాను. పేపర్‌మిల్‌కి వెళ్లి చూశాక, గెస్ట్‌హవుస్‌లో డ్రస్ ఛేంజ్ చేసుకుని తిన్నగా ఇలా వస్తున్నాను''

పక్కనే ఉన్న పేషెంట్స్ వారిద్దరినీ మార్చి చూడసాగాడు.

''గెస్ట్‌హవుస్‌లో దిగకపోతే మా ఇంటికి రాకూడదా?''

అతడు నవ్వాడు. బదులివ్వలేదు. టాపిక్ మారుస్తూ ''అవినాష్ ఉన్నాడా ఊళ్లో'' ప్రశ్నించాడు.

''మెడికల్ కాన్ఫరెన్స్ ఉందని ఢిల్లీ వెళ్లాడు. మరో వారం పదిరోజులలో రావచ్చు''

''నిన్ను ఈ పరిస్థితిలో వదిలి...'' మాట పూర్తిచేయకుండానే మింగేశాడు. క్షణకాలం సర్దుకుని తర్వాత చెప్పాడు. ''పేషెంట్స్‌ని చూసి పంపించు. నేను బయట కాసేపు వెయిట్ చేస్తాను''

ఆమె అందంగా నవ్వింది. ''క్షణం తీరిక లేని బిజినెస్ మాగ్నెట్ నా కోసం గంట వెయిట్ చేయడమా...? వాటే వండర్''

ఏదో చెప్పబోయి ఆగిపోయాడు అతడు. అలా ఆగిపోవడం అతడికి అదే మొదటిసారి కాదు. ఆమెముందు చాలా... చాలాసార్లు మన

సులోనిమాట చెప్పలేక ఆగిపోయాడు అతడు. తను చెప్పదలచుకున్నది చెప్పలేకపోవడమన్నది అతడికి కేవలం ఆమె ముందు మాత్రమే. ఆమె ముందు తప్ప, అతడు ఈ ప్రపంచంలో ఎవరి ముందయినా ఠీవిగా సూటిగా మాట్లాడగలడు.

"బయట వెయిట్ చేస్తుంటాను లక్ష్మీ"

"అలాగే"

జె.యస్. బయటకు నడిచాడు. విజిటర్స్ రూంలో కూర్చుని 'బిజినెస్ ఇండియా' మేగజైన్ చదవసాగాడు.

పావుగంట తర్వాత లక్ష్మి ఇవతలకు వచ్చింది. అతడి ముందు నిలబడి "రండి వెళ్దాం" అంది.

అతడు పుస్తకం మూసి పైకి లేచాడు. పార్కింగ్ ప్లేస్‌లో ఉన్న కారు తీసుకువచ్చి ఆమె ముందుంచాడు. ఫ్రంట్‌డోర్ తీసుకుని ఎక్కి కూర్చుంది లక్ష్మి.

కారు రోడ్డు ఎక్కాక పరీక్షగా ఆమె వంక చూసి అన్నాడు. "లక్ష్మీ! ఇప్పుడు కూడా శ్రమ పడటం ఎందుకు? కొద్దిరోజులు రెస్ట్ తీసుకోకూడదూ?"

"నిజమే...! చాలా భారంగా ఉంది కూడా! రెస్ట్ తీసుకోవాలనే అనిపిస్తూ ఉంది. కాని... అవినాష్ లేడు. నేనూ హాస్పిటల్‌కి రావడం మానేస్తే ప్రాక్టీస్ దెబ్బతింటుంది"

"ప్రాక్టీస్ దెబ్బతింటుందని డెలివరీ డేస్‌లో శ్రమపడటం బాగాలేదు. పుట్టబోయే పాపాయిని మరీ అంత బాధపెట్టకు లక్ష్మీ"

ఆమె మౌనంగా ఉండిపోయింది. అతడి ఆప్యాయపు పలుకులు మనసు మారుమూలల్లో ఎక్కడో ముళ్లలా గుచ్చుకుంటున్నాయి.

"రోడ్లన్నీ చాలావరకూ రద్దీ లేకుండా ఉన్నాయి. క్రితంరోజుల్లో చేసిన బంద్ ప్రకటన వలన ముప్పాతికవంతు దుకాణాలు మూసేశారు. అయితే అది ప్రతిపక్షాలు చేస్తున్న బంద్ కాబట్టి అధికారంలో ఉన్న పాలకపక్షం బంద్ విఫలం చేసేందుకుగాను అరాకొరా బస్సులను రోడ్డుమీద తిప్పుతూ ఉంది. ఆ రోడ్లమీద సైకిళ్ళు, కొద్దిపాటి వాహనసంచారం జరుగుతూనే ఉంది. బంద్ చాలావరకూ ప్రశాంతంగానే జరుగుతున్నట్టుంది.

అతడు కారు వేగంగా ముందుకు పోనిస్తూనే ఎత్తయిన ఉదరభాగంవంక ఆప్యాయంగా చూశాడు. నవమాసాలు నిండుకున్నాయేమో! ఆమె ఇప్పుడు... పరిపూర్ణత సంతరించుకున్న స్త్రీ మూర్తి ఫలాన్ని అందించినప్పుడే వృక్షానికి సార్థకత! నిండుగర్భిణిలో ఒక రకమయిన హుందాతనం ఉంటుంది. ఈ ప్రపంచాన్ని పరిపాలించగలిగిన అర్హత స్త్రీమూర్తికే ఉందేమోననిపిస్తుంది.

"అమ్మ ఎలా ఉంది?"

జె.యస్. ఆమె ముఖంలోనికి చూశాడు. "బాగుంది" అని క్షణం తర్వాత చెప్పాడు. "అమ్మ నిన్ను చూడాలంటోంది. మరో రెండు మూడు రోజులలో ఇక్కడికి రావచ్చు"

"అలాగా...! అయినా ఆంటీకి మీ గురించే దిగులు"

"ఎందుకు?"

"మీరు పెళ్లిచేసుకోవడంలేదని"

బలవంతంగా పెదాలమీదకు నవ్వు తెచ్చుకున్నాడతడు. "లక్ష్మీ! ఇప్పుడు నా వయసు ఎంతనుకుంటున్నావు?! ముప్ఫయ్‌మూడు... పెళ్లి చేసుకునే వయసు దాటిపోయింది"

"ఏంకాదు! ఈ ప్రపంచాన్ని అర్థంచేసుకుని, పెళ్లి అన్నది తోడుకోసమేనని తెలుసుకుని పెళ్ళాడేందుకు ఇదే సరయిన వయసు"

"కావచ్చు. కాని నాకు పెళ్లిమీద ఇంట్రస్ట్ కలగడంలేదు లక్ష్మీ"

"ఎందుకని?"

"ఎందుకంటే- నాది అడ్జస్ట్ అయ్యే మెంటాలిటీ కాదు. ఒకరిని పెళ్లాడాలనుకుని వీలుకాకపోతే మరొకరిని పెళ్లాడటం నా మనసు ఒప్పుకోదు"

ఆమె మాట్లాడలేకపోయింది. అతడన్న మాటలలోని అర్థం ఆమెకు తెలియకపోలేదు. గతాన్ని గుర్తుకు తెచ్చుకుంటే-

కాలేజీలో తను ఇంటర్ చదివేప్పుడు అతడు డిగ్రీ చదివేవాడు. పక్కపక్క ఇళ్లు కావడంతో కలిసి తిరిగేవారు. మెడికల్ ఎంట్రన్స్ వ్రాశాక తనకు సీటు రావడం, అతడికి దూ

రంగా వెళ్లిపోవడం జరిగింది. అయినా అతడు తనకు లెటర్స్ వ్రాసేవాడు.

హౌస్‌సర్జన్ చేశాక పుట్టిన ఊరిలోనే ప్రాక్టీస్ పెట్టింది తను. అప్పుడు కూడా తనతోనే ఎక్కువ సమయం గడిపేవాడు. సహజంగా తెలివయినవాడే. అయినా దేనిమీదా ఎక్కువగా ఇంట్రస్ట్ చూపించేవాడు కాదు- ఒక్క తనమీద తప్ప!

తామిద్దరూ దారి వెంబడి నడుస్తుంటే అతడు ఎన్నో విజ్ఞాన విషయాలు చెప్పేవాడు. ప్రతి సబ్జెక్ట్ గురించి మాట్లాడగలిగేవాడు. చివరికి- మెడికల్ సైన్స్‌లో కూడా అతడికున్న పరిజ్ఞానానికి తను ఆశ్చర్యపోయేది. తనకు తెలియని బైపాస్ ఆపరేషన్- బెలూన్ థెరపీ, డయాలసిస్ మిషన్ పనిచేసే విధానం... ఇవన్నీ చెబుతుంటే కళ్ళింతలు చేసుకుని వినేది. మరి ఇంత తెలివయినవాడు హయ్యర్ స్టడీస్‌కి ఎందుకు వెళ్లలేదో అర్థమయ్యేది కాదు. చదువు సరే వదిలేసినా, కనీసం ఉద్యోగ ప్రయత్నాలు కూడా చేసేవాడు కాదు.

అప్పటికీ తను ఒక్కొక్కసారి అడిగేది, ''మీరు ఏదయినా ఉద్యోగం సంపాదించుకోకూడదూ?'' అని.

''ప్చ్! నాకు ఉద్యోగం చేయాలని లేదు. ఏదయినా చిన్న బిజినెస్ చేస్తాను. నెలకో రెండు, మూడువేలు సంపాదన ఉంటే చాలు'' బదులిచ్చేవాడు అతడు.

''అయితే ఆ బిజినెస్ అయినా స్టార్ట్ చేయండి''

''చేస్తాను... చేస్తాను...''

అలా కొద్దికాలం గడిచిపోయింది. ఇంతలో పెద్దలు తనకు పెళ్లి నిశ్చయం చేశారు. ఆ వార్త శ్రీనివాస్‌కి తెలిసింది.

అంతే! అతడు చాలారోజులపాటు కనుపించలేదు తనకు.

తన పెళ్ళయ్యాక ఓసారి పుట్టింటికి వెళ్తే అతడు ఎదురుపడ్డాడు. మనిషి చాలా నీరసంగా కనుపించాడు.

''ఏమిటి మీరు కనుపించటమే మానేశారు. పెళ్ళికి కూడా రాలేదు'' అడిగింది తను.

నవ్వలేక నవ్వాడు అతడు.

''రెండువీధుల అవతలనేకదా మా అత్తారిల్లు! రాకూడదూ?''

అతడు జవాబు ఇవ్వలేదు.

కొద్దిక్షణాల తర్వాత తిరిగి తనే అడిగింది, ''ఇప్పుడేం చేస్తున్నారు?''

అప్పుడు పెదవి విప్పాడు అతడు, ''ఇంత కాలం చాలా అమాయకంగా బ్రతికాను లక్ష్మీ! డబ్బు, స్టేటస్‌లకు ఇంత విలువ ఉంటుందని నాకు తెలియదు.. లేట్ రియలైజేషన్...! ప్రస్తుతం డబ్బు స్టేటస్‌లు సంపాదించుకునే ప్రయత్నంలో ఉన్నాను'' అనేసి తన ముందు నుండి తప్పుకున్నాడు అతడు.

ఆ తర్వాత- రెండు, మూడేళ్లవరకూ అతడి గురించి వినడమే తప్ప చూడలేకపోయింది. హైదరాబాద్ వెళ్లిపోయాడని, బాగా సంపాదిస్తున్నాడని, అమ్మను కూడా తీసుకెళ్లిపోయాడని... తన పుట్టింటివాళ్ళు చెపుతుండేవారు. అతడి ప్రస్తావన వచ్చినప్పుడల్లా తనకు మనసు ఏదోలా అనిపించేది.

ఒకరోజు హఠాత్తుగా అతడు తన హాస్పిటల్‌కి వచ్చాడు. అతడిని చూడడంతోనే ఆశ్చర్యపోయింది తను.

చాలా హుందాగా ఉన్నాడతడు. ఖరీదయిన సూట్, రేబాన్ గ్లాసెస్, మనిషి మరింత తెల్లబడి హుందాగా తయారయ్యాడు.

''హలో మీరా?... రండి...'' ఆనందంగానూ, ఆతృతగానూ ఆహ్వానించింది. అతడు తన టేబుల్ ఎదురుగా కూర్చున్నాడు.

''చాలా కాలమయింది మిమ్మల్ని చూసి''

అతడు నవ్వాడు. మాట్లాడలేదు.

''ఆంటీ బాగుందా?''

తలూపాడు అతడు. ఇంతలో అవినాష్ లోపలికి వచ్చాడు. శ్రీనివాస్‌ని పరిచయం చేసింది.

''మావారు... అవినాష్'' చెప్పింది అతడితో.

''హలో! గ్లాడ్ టు మీట్ యూ'' చేతులు చాపాడు శ్రీనివాస్.

''హలో...! మీరేనా జె.యస్. అంటే... మీ గురించి లక్ష్మిచాలాసార్లు చెప్పింది. మా ఇద్దరి

మధ్యా అప్పుడప్పుడూ మీ గురించి డిస్కషన్ వస్తూనే ఉంటుంది...'' చేతులు కలిపాడు అవినాష్.

నర్స్‌తో టీ తెమ్మని చెప్పింది తను.

''మనం ఒకే పేటలో ఉంటున్నా ఏనాడూ కలుసుకోలేదు అప్పుడు. నేను చిన్నప్పటి నుండి వైజాగ్‌లో మా మామయ్యగారింట్లో ఉండి చదువుకున్నాను కాబట్టే నా పెళ్లికి ముందు మనం కలుసుకోవడం జరగలేదు''

వారిద్దరికీ మధ్య మాటలు మొదలయ్యాయి. అవినాష్ చాలా ఎక్కువగా మాట్లాడుతాడు. శ్రీనివాస్ చాలా తక్కువగా మాట్లాడటం అప్పుడే గమనించిందామె.

మాటల మధ్య అతడు చెప్పాడు, ''ఈ ఊళ్లో ఓ పేపర్‌మిల్ పెట్టాలని ఆలోచన కలిగింది. సరయిన స్థలంకోసం వెతుకుతున్నాను''

''ఇక్కడే పెట్టాలని ఎందుకు అనుకుంటున్నారు?''

''ఇది నేను పుట్టిపెరిగిన ఊరు. ఈ మిల్ కారణంగా అయినా అప్పుడప్పుడు నా ఊరు నేను చూసుకుంటూ ఉండొచ్చని''

రెండురోజులలో అతడు ప్లేస్ చూశాడు. నెల తర్వాత కన్‌స్ట్రక్షన్ ప్రారంభమయింది. అప్పటినుండి నెలకో, రెండు నెలలకో ఒకసారి అతడు హైదరాబాద్ నుండి వచ్చేవాడు. వచ్చినప్పుడల్లా తనను కలుసుకుని మరీ వెళ్ళేవాడు. లేక తనను కలుసుకునేందుకే వచ్చేవాడో ఏమో.

నిజంగానే డబ్బు, స్టేటస్ సంపాదించుకున్నాకే అతడు తనను కలుసుకున్నాడు... పట్టుదల అంటే అది!

''ఇల్లు వచ్చేసింది...''

ఆలోచనలు కట్ అయ్యాయి. ఆమె అతడి వంక చూస్తే, నవ్వుతూ తనవంక చూస్తున్నాడు అతడు.

''రండి'' కిందికి దిగుతూ అంది లక్ష్మి. అతడు కారు డోర్ తెరచుకుని కిందికి దిగాడు.



ఆమె భారంగా అడుగులు ముందుకు వేస్తోంది. అతడు ఆమె పక్కనే నడవసాగాడు.

ఇంటి లోపలికి వెళ్లాక ''కూర్చోండి'' హాలులో సోఫా చూపించి చెప్పిందామె. కూర్చున్నాడు అతడు.

ఆమె వంటగదిలోనికి వెళ్లి వంటమనిషికి చెప్పివచ్చింది. ''రండి భోంచేద్దాం'' ఇవతలికి వచ్చాక అంది.

ఇద్దరూ డైనింగ్‌టేబుల్ ముందు కూర్చున్నారు. వంటమనిషి టేబుల్‌మీద అన్నీ సర్దిపెట్టి వెళ్లింది. లక్ష్మి ప్లేట్స్‌లో వడ్డించింది.

భోంచేస్తున్నప్పుడు ఆమె అతడివంక అదోలా చూస్తూ అన్నది. మొన్నామధ్య మీ మిత్రులొకరు హాస్పిటల్‌కు వచ్చారు. మీ గురించి మాట్లాడుతూ 'శ్రీనివాస్ చాలా మారిపోయాడు. డబ్బు సంపాదించాక స్నేహితులను కూడా మరిచిపోయాడు' అన్నారు.. నిజమేనా...?''

అతడు భుజాలెగరేశాడు. ''నిజమే కావచ్చు'' చెప్పాడు.

''అది తప్పుకదూ! డబ్బు మనిషిని మార్చకూడదు. సంపద మరింత అణకువ నేర్పాలే గాని, గర్వాన్ని పెంచకూడదు''

''అంటే నాకిప్పుడు గర్వం పెరిగిందని నువ్వనుకుంటున్నావా?''

''నేను అనుకోవడంలేదు. నీ మిత్రులంతా అది నిశ్చయించేశారు''

''మిత్రులు...'' మెల్లగా నవ్వాడు. ''ప్రతి మనిషికీ ఒక స్నేహితుడు కావాలి. కాని స్నేహమనేది ప్రాణానికి ప్రాణం ఇచ్చేలా ఉండాలే తప్ప అవసరాలలో ఎస్కేప్ కావడం స్నేహమనిపించుకోదు... నీకు తెలుసా? నీ పెళ్లి జరిగాక మెంటల్‌గా నేను చాలా అప్‌సెట్ అయ్యాను. ఆ క్షణం ఈ ప్రపంచమంతా డబ్బుమయంగానే కనుపించింది. నేను నా మిత్రులందరినీ ఏదయినా బిజినెస్‌కోసం సహాయం చేయమని కోరాను. ఒక్కడు... ఒక్కడు కూడా సహాయపడలేదు. అందరూ తప్పించుకున్నారు. నీ పెళ్లి తర్వాత నాకు రెండోషాక్ అది! అప్పటివరకూ 'స్నేహమేరా జీవితం- స్నేహమేరా శాశ్వతం' అనుకుంటూ ఉండేవాడిని. స్నేహితులలోని ఎస్కేపిజాన్ని, స్నేహంయొ

క్క రెండోకోణాన్ని అప్పుడే చూశాను... అంతే! మిత్రులందరినీ దూరంగా నెట్టేశాను. నాకీనాడు డబ్బు సంపాదించడం ధ్యేయమే తప్ప వ్యామోహం కాదు... ఈ సమాజం 'డబ్బు' అనే పునాదిమీదే నిర్మింపబడిందని తెలుసుకున్నాక నాకు విరక్తిలాంటిది కలిగింది. అందుకే ఎవ్వరితోనూ నేను ఎక్కువగా మాట్లాడను. నేను జె.యస్.లా కాకుండా శ్రీనివాస్‌లా మాట్లాడేది ఈ ప్రపంచంలో ఇద్దరిముందే- అమ్మ, నువ్వు''

ఆమెకు పొలమారింది. ఆ కారణానో మరే కారణానో ఆమె కన్నులలో నీరు సుడులు తిరిగింది. ఆమె మనసులో శ్రీనివాస్‌ని దూరం చేసుకుని తను తప్పు చేశానేమోనన్న 'ఫీలింగ్' మరొక్కసారి కదలాడింది. తన వలననే అతడు బ్రహ్మచారిలా, విరాగిలా మారిపోయాడన్న బాధ గుండెలను మెలిపెట్టింది. అన్నం సయించలేదు.

ఆ తర్వాత- చాలాసేపు వారిద్దరూ మాట్లాడుకోలేదు. భోజనం అయిందనిపించారు ఎలాగో!

హాలులోకొచ్చి కూర్చున్నాక ''ఇక నేను వెళ్తాను'' అన్నాడు అతడు.

''వెళ్లి ఏం చేస్తారు...? ఈరోజు బయట తిరగడం కూడా అంత మంచిది కాదు 'బంద్' నిర్వాహకులు ఏ సమయంలో ఎలా ప్రవర్తిస్తారో చెప్పలేము. కారులో రోడ్డుమీద వెళుతుంటే, ఏదయినా అనుకోని అవాంతరం ఎదురయితే... ప్రాబ్లమ్ ఫేస్ చేయడం అంత మంచిది కాదేమోననుకుంటున్నాను''

''బిజినెస్ చేసేవాడు ప్రాబ్లమ్స్ ఫేస్ చేసేందుకు భయపడకూడదు. అలా భయపడేవాడు సక్సెస్‌ఫుల్ బిజినెస్‌మెన్ కాలేడు''

''భయపడటం కాదుగాని ఈ బంద్‌లవలన జనం చచ్చిపోతున్నారనుకోండి. అసలు ఈ బంద్‌లు మొదలుపెట్టినవాడు ఎవడో కాని వాడికి నమస్కారం చేయొచ్చు''

''ఈ బంద్‌వలన నీకేం జరిగిందిప్పుడు?'' నవ్వుతూ అడిగాడు.

''ఏం జరగలేదనుకుంటున్నారు...? ఉదయం హాస్పిటల్‌కి వెళ్ళాలంటే ఆటో దొరకలేదు. రోడ్డు వెంబడి ఆటో వెళుతుంటే ఎవరు ఆపుతారోనని భయం. కూరలు లేక అల్లాడేవారు, నిత్యావసర వస్తువులు దొరక్క ఇబ్బందిపడేవారు నేను కాదు, ఈ బంద్‌వలన అందరూ ఇబ్బందిపడేవారే! ఏమంటారు...?''

అతడు నవ్వి చెప్పాడు. ''ఈ బంద్‌లవలన ఇబ్బందులు అవేకాదు, ఇంకా చాలా ఉన్నాయి చెప్పమంటావా...?''

''చెప్పండి'' ఆమె గెడ్డం కింద అరచేతిని ఉంచి ఆసక్తిగా ముందుకు వంగింది.

అతడు పెదవి విప్పాడు. సరిగ్గా అప్పుడే ఫోన్ మ్రోగింది. ఆమె తలతిప్పి ఫోన్‌వంక చూసింది.

''వెళ్లు లక్ష్మీ! ఫోన్ చూడు'' చెప్పాడు అతడు.

ఆమె భారంగా పైకి లేచి ఆవైపు నడిచింది. రిసీవర్ తీసుకుని ''హలో'' అంది. అవతలివైపు అవినాష్!

''హలో లక్ష్మీ! ఎలా ఉన్నావు?''

''బాగానే ఉన్నాను''

''కోపమా?''

''ఎందుకు?''

''డెలివరీ డేస్‌లో నిన్నిలా వదిలేసి నేను ఢిల్లీ వచ్చేసినందుకు''

''కోపంలేదు. కాని... ఇలాంటిస్థితిలో మీరు తోడు ఉంటే బాగుండేదనుకుంటున్నాను'' ఎలాంటి ఫీలింగ్ లేకుండా చెప్పిందామె.

''సారీ లక్ష్మీ! నాకూ ఉండాలనే అనిపించింది. అయితే- ఈ కాన్ఫరెన్స్‌కి చాలా మంది ప్రముఖులు వస్తున్నారని తెలిశాక ఆగలేకపోయాను. ఇక ఎనిమిదిరోజులేగా- తొమ్మిదో తారీఖు ఉదయానికి నేను నీ ముందు ఉంటాను...''

''జయప్రద ఆంటీ టెంత్ డెలివరీ డేట్‌గా చెప్పారు''

''వెల్...! అంటే ఒకరోజు ముందుగానే నేను అక్కడికి చేరుకుంటానన్నమాట... వెరీగుడ్...'' సంతోషంగా అన్నాడు అతడు.

ఆమె నిట్టూర్చింది. 'తన భార్య ప్ర డానికి ఒకరోజు ముందుగానే చేరుకుంటున్న

నని సంతోషపడే అతడి మనస్తత్వాన్ని ఏమను కోవాలి?'

"ఉంటాను" అమె మనసులో ఏదో స్తబ్దత... శ్రీనివాస్ వచ్చిన విషయం చెప్పాలని పెదవి విప్పింది. అనవసరమేమోనని ఆగిపోయింది.

"ఆల్‌రైట్" ఫోన్‌లోనే ఒక ముద్దు విసిరి రిసీవర్ పెట్టేశాడు అతడు.

ఆమె కూడా రిసీవర్ క్రెడిల్ చేసింది. పెదాలమీదికి బలవంతాన నవ్వు తెచ్చుకుని అతడి ముందుకు నడిచింది.

అతడు ఆమె ముఖంలోనికి చూశాడు. కదలాడే నిరాశామేఘాలు గుర్తించాడు. "అవినాష్ దగ్గరనుండేనా ఫోన్?" అడిగాడు.

"అవును" సోఫాలో కూర్చుంటూ బదులు పలికింది.

"ఏమంటున్నాడు?"

"తొమ్మిదో తారీఖుకంతా ఇక్కడికి చేరుతారట..."

కొద్దిక్షణాలు నిశ్శబ్దం ఇద్దరి మధ్యా! ఆమెలో కొద్దినిముషాల క్రితం ఉన్న సంతోషం ఎగిరిపోవడం గుర్తించాడు. ఆమెతో మరేం మాట్లాడాలో అర్థంకాలేదు అతడికి.

కొద్దినిముషాలు మౌనంగా దొర్లాక "వెళ్తాను" అంటూ లేచాడు అతడు.

"మరి కాసేపు కూర్చోకూడదూ?"

"రేపు వస్తానుగా"

"ఉంటున్నారా?"

"అవును... ఓ వారంరోజులు ఉండాలనుకుంటున్నాను"

"బాప్‌రే! చాలారోజులు కేంప్ వేశారే?!"

"అవును" నవ్వి పలికాడు. "కొద్దిరోజులపాటు బిజినెస్ పనులకు దూరంగా, ప్రశాంతంగా గడపాలని ఇక్కడికి వచ్చాను"

"నిజమా?"

"నిజంగా నిజం"

ఆమె గలగలా నవ్వింది. ఆ నవ్వు ఆప్యాయంగా చూశాక అతడు బయటకు నడిచాడు.



కొద్దినిముషాల క్రితం వారిద్దరి మధ్యా 'బంద్' గురించిన టాపిక్ వచ్చింది. అతడు ఏదో చెప్పబోయి ఆగిపోయాడు. ఆ చెప్పబోయిన ఇబ్బందులే ఆ తర్వాత వారికి ఎదురవుతాయని వారికి తెలియదు ఆ క్షణాన!

★ ★ ★

"అన్నా! ఇక ఊరుకోకూడదు. మనం రేపటి నుండే సమ్మె చేయాలి. మన యూనియన్ వాళ్లెవరూ పనిలోనికి వెళ్లకూడదు"

రాజశేఖరం నిశ్శబ్దంగా తలాడించాడు.

"నిన్న నన్ను సస్పెండ్ చేశాడు. ఈరోజు నిన్ను సస్పెండ్ చేశాడు. ఇలా మనం ఊరుకుంటే వరుసగా మన యూనియన్‌లోని వర్కర్స్‌నందరినీ తీసి అవతల పడేస్తాడు. అందుకే మనం వెంటనే సమ్మెలోనికి దిగాలి..." ఆవేశంగా అన్నాడు రమేష్.

"కేవలం మన యూనియన్ ఒక్కటే సమ్మెలోనికి దిగితే పెద్దగా ప్రయోజనం ఉండకపోవచ్చు. సమ్మె విజయవంతం కావాలంటే పని ఆగిపోవాలి. అదే సమ్మె విజయానికి మూలసూత్రం. ఇప్పుడు మనం సమ్మె చేస్తాం. మేనేజ్‌మెంట్ మిగిలిన వర్కర్స్‌చేత ఓ.టి.లు చేయించి మిల్ నడుపుతూ ఉంటుంది. మనం మాత్రం ఎంతకాలమయినా బయటే ఉండిపోతాం... అర్థమయిందా?" చెప్పాడు రాజశేఖరం వివరంగా.

రమేష్ తల గోక్కున్నాడు, "మరి మనం ఇప్పుడేం చేయాలి?" అరనిమిషం ఆగాక అడిగాడు అతడు.

రాజశేఖరం సిగిరెట్ వెలిగించి గుండెల నిండుగా పొగపీల్చాడు. తన ముందు కూర్చుని ఉన్న కార్మికులందరివంకా ఒకసారి కలయచూశాడు. మెల్లగా పలికాడు. "ఒక వర్కర్‌కి అన్యాయం జరిగితే, మేనేజ్‌మెంట్ దానిని సరిదిద్దేలా చేయటం యూనియన్ బాధ్యత. మేనేజ్‌మెంట్‌ని భయపెట్టేందుకు యూనియన్‌కున్న ఒకే ఒక ఆయుధం సమ్మె...! సమ్మె ద్వారా మేనేజ్‌మెంట్‌ని భయపెట్టొచ్చు. కాని ఆ సమ్మెవలన మిల్ మూతపడేలా ఉంటేనే మేనేజ్‌మెంట్ భయపడుతుంది. మన యూనియన్‌లో రెండొందల మంది కార్మికులు మాత్రమే ఉన్నారు. అంతే

మిల్ వర్కర్స్‌లో అయిదవవంతు అన్నమాట! ఈ కొద్దిమంది సమ్మెవలన మేనేజ్‌మెంట్ భయపడదు. మేనేజ్‌మెంట్ భయపడాలి అంటే కనీసం సగంమంది కార్మికులు పనిలో ఎంటర్ కాకూడదు. అందుకే నేను మిగిలిన యూనియన్ వాళ్లను కూడా కలుస్తాను. మన సమ్మెకు కోపరేట్ చేయమని అడుగుతాను...'' అని ఆగి ''ఒకవేళ ఆ యూనియన్‌లు కోపరేట్ చేస్తే మంచిదే. లేకున్నా... మనం రేపటి నుండే సమ్మె మొదలుపెడుతున్నాం'' పూర్తిచేశాడు.

రమేష్ ముఖంలో ఒక మెరుపు మెరిసింది. చాలామంది వర్కర్స్‌ముఖాలలో మాత్రం 'సమ్మె' అనగానే అదోలాంటి భయం కదలాడటం గమనించాడు రాజశేఖరం. సమ్మె చేయాలని కోరుకునే వర్కర్స్ చాలా కొద్దిమందే నని అర్థమయింది రాజశేఖరానికి!

అతడు సమావేశం ముగించి పైకి లేచాడు. తన వెంట నలుగుర్ని తీసుకుని మిల్‌లోని మరో యూనియన్ నాయకుడు జగన్నాధాన్ని కలుసుకున్నాడు. ''రేపటినుండి మేము సమ్మె చేయాలనుకుంటున్నాం. దయచేసి మీరు కూడా డ్యూటీలకు హాజరుకాకండి'' అని చెప్పాడు.

జగన్నాధం తల అడ్డంగా ఆడించాడు ''సారీ రాజశేఖరం! ఇది మీ యూనియన్‌కు సంబంధించిన గొడవ! ఇందులో మేము జోక్యం చేసుకుని మేనేజ్‌మెంట్‌కి వ్యతిరేకం కావడం నాకిష్టంలేదు. అందులోనూ ఇది అగ్రిమెంట్ కుదరబోయే సమయం. ఇలాంటి సమయంలో మనం మేనేజ్‌మెంట్‌తో సఖ్యంగా ఉండాలి...''

''కాని మా యూనియన్‌లో ఇద్దరిని అనవసరంగా సస్పెండ్ చేశాడు చతుర్వేది. అందులోనూ యూనియన్ లీడరయిన నన్ను కూడా! సాటివర్కర్స్‌కి అన్యాయం జరిగింది కాబట్టి ఆ అన్యాయాన్ని మీరూ ఖండించాలి. ఈరోజు నాకు జరిగింది, రేపు మీకూ జరగొచ్చు. ఆరోజు మీకు మేమూ కోపరేట్ చేస్తాం...''

జగన్నాధం అదోలా నవ్వాడు. ''రమేష్‌ని సస్పెండ్ చేశారన్న కారణాన నువ్వు జె.యస్.ని కోరి అవమానపరిచావు. జె.యస్. మంచివాడు కాబట్టి నిన్ను పట్టి చూడకుండా వెళ్లిపోయాడు. జె.యస్. కనుక ఒక్కసారి కన్నెత్తి నిన్ను చూసి ఉంటే నువ్వు అధఃపాతాళానికి వెళ్లివుండేవాడివి. అది నీ అదృష్టం... అయితే ఒక వర్కర్ చేతిలో తమ యజమాని అవమానపడటం ఏ మేనేజ్‌మెంట్ మాత్రం సహించగలదు? నిన్ను సస్పెండ్ చేయడం ద్వారా మేనేజ్‌మెంట్ సరయిన నిర్ణయమే తీసుకున్నదని మా రెండు యూనియన్‌లూ అనుకుంటున్నాయి''

రాజశేఖరం చెప్పాడు ''జగన్నాధ్! నేను కోరి జె.యస్.ని అవమానపరచలేదు. అనుకోకుండా స్పానర్ స్లిప్ అవడంతో అలా జరిగింది. జె.యస్.ని అవమానపరిచేంత ధైర్యమా నాకు...?''

''కథలు చెప్పకు రాజశేఖరం! నువ్వు కోరి జె.యస్.ని ప్రీ ప్లాన్డ్‌గానే చేశావని మేనేజ్‌మెంట్ నమ్ముతోంది. జె.యస్.ని అవమానపరిస్తే ఆయన మేనేజ్‌మెంట్‌మీద కోప్పడతాడని, తద్వారా కసి తీర్చుకోవచ్చని అనుకున్నావు. నీ పథకం బెడిసికొట్టింది. జె.యస్. దాన్ని సీరియస్‌గా తీసుకోలేదు. కాని మేనేజ్‌మెంట్ మాత్రం దాన్ని సీరియస్‌గా తీసుకుంది అంతే''

''మీరంతా పొరపాటు పడుతున్నారు. అది అనుకోకుండా జరిగిన సంఘటన ప్రీప్లాన్డ్ కాదు...'' అరిచినట్టు చెప్పాడు రాజశేఖరం. తన వలన అనుకోకుండా జరిగిందాన్ని వీరంతా అలా భావిస్తుంటే బాధ కలిగింది అతడికి.

''మేము చెవిలో పువ్వులు పెట్టుకోలేదు. నువ్వు కావాలనే చేశావని మా రెండు యూనియన్‌లూ నమ్ముతున్నాయి''

''డామిట్'' చేతిని బలంగా గోడకేసి కొట్టాడు రాజశేఖరం. తన నిస్సహాయత మరెలా బయటపెట్టడమో అర్థంకాలేదు అతడికి.

''సారీ'' లోపలికి వెళ్లిపోయాడు జగన్నాధం!

రాజశేఖరం తన వెంట వచ్చిన వర్కర్స్ ముఖాలలోనికి చూశాడు. వారి కన్నులలో నిరాశ! వారు ప్రశ్నార్థకంగా ముఖంపెట్టి నాయ

కుని వంక చూశారు.

"మరో యూనియన్ ఉందికదా! వారిని కూడా కలుద్దాం" ముందుకు నడుస్తూ అన్నాడు రాజశేఖరం. అతడికి ఏమాత్రం నమ్మకంలేదు- గంగరాజు తమకు సహాయం చేస్తాడని అయినా కలిశాడు.

గంగరాజు కూడా జగన్నాధానికి డిటోగానే ప్రవర్తించాడు. "ఈ విషయంలో తప్పు మీదే! ఎంత సాటివర్కర్స్ అయినా- తప్పుచేసినవాడిని సమర్ధించటం మంచిదికాదు. మీకు ఆ శిక్ష సరయినదే"

రాజశేఖరం జుట్టు పీక్కున్నాడు. "నేను కోరి ఆ తప్పు చేయలేదు. అనాలోచితంగా జరగిపోయిందంటే నమ్మరేం..."

గంగరాజు అతడివంక అపనమ్మకంగా చూశాడు.

రాజశేఖరం కోపంగా వెనుతిరిగాడు. అప్పటికి రాత్రి పదకొండున్నరయింది. అతడు తన అనుచరులతో కలసి ఓ ఇరానీ రెస్టారెంట్‌లోనికి దారితీసి టీకి ఆర్డరిచ్చాడు.

ఆ రెండు యూనియన్‌లూ మన సమ్మెను బలపరచేలా లేవు. ఇప్పుడేం చేద్దాం" తనకేమీ తోచకపోవడంతో అడిగాడు రాజశేఖరం వర్కర్స్‌ని.



రమేష్ వెంటనే చెప్పాడు. ఆ యూనియన్లు మన సమ్మెను సపోర్ట్ చేయడంలేదని మనం సమ్మెలోకి దిగకపోతే, రేపు మేనేజ్మెంట్ దృష్టిలో మనం అలుసవుతాం. ఈరోజు నిన్ను, నన్ను మాత్రమే సస్పెండ్ చేశారు. రేపు మన యూనియన్‌లోని వారందరినీ వరుసగా సస్పెండ్ చేయడం మొదలుపెడతారు. అప్పుడు కూడా మనం చేతులు ముడుచుకుని కూర్చోవలసివస్తుంది. ఒకే ఒకసారి మేనేజ్మెంట్ ముందు మనం వీక్ అయితే చాలు, ఆ తర్వాత వారు మనల్ని ఫుట్‌బాల్‌లా ఆడుకుంటారు. అదీగాక, మన యూనియన్ వీక్ అని తెలిస్తే, మన యూనియన్‌లోని వర్కర్స్ చాలామంది ఆ రెండు యూనియన్‌లలోనికి జంప్ కావచ్చు. ఎవరయినా బలవంతుడి ఆశ్రయమే కోరుకుంటారుకదా...''

మిగిలినవారిలో కూడా అదే భావం కనిపించింది. అందుకే రాజశేఖరం అన్నాడు. ''కావచ్చు రమేష్! కాని నువ్వొకటి ఆలోచించు... ఈరోజు సస్పెండ్ అవడంవలన నువ్వూ, నేను మాత్రమే బాధపడుతున్నాం. రేపు మన యూనియన్ సమ్మెలోనికి దిగితే, ఆ సమ్మెను ఎన్నిరోజులకు కూడా మేనేజ్‌మెంట్ కేర్ చేయకపోతే, మన యూనియన్‌లోని వర్కర్స్ మొత్తం ఇబ్బంది పడవలసివస్తుంది... ఆ ఆలోచనే నన్ను వెనుకడుగువేసేలా చేస్తోంది''

''మరి మనకు జరిగిన అన్యాయాన్ని సరిదిద్దుకోవడం ఎలా?''

అదీ నిజమే...! రాజశేఖరానికి ఏమీ తోచడంలేదు. ఏ నిర్ణయమూ తీసుకోలేకున్నాడు. సమ్మెలోనికి దిగితే ఆ సమ్మెను మేనేజ్‌మెంట్ లెక్క చేయదన్నది తెలుస్తూనే ఉంది. సమ్మె చేయకపోతే తమ సస్పెన్షన్ అలాగే ఉండటమేకాక, మిగిలినవారిని పురుగుల్లా చూస్తుంది మేనేజ్‌మెంట్. అందుకయినా సమ్మెచేసి తీరాలి! కాని... షిట్! ఆ రెండు యూనియన్లు తమ సమ్మెలో కలిస్తే తప్ప, ఈ అన్యాయాన్ని ఎదుర్కోవటం సాధ్యంకాదు. ఇప్పుడేం చేయాలి?

అతడి డైలమా అర్థంచేసుకున్న ఓ కార్మికుడు అన్నాడు. ''మనం ఆంజనేయులునాయుడ్ని కలిస్తే బాగుంటుందేమో!''

చప్పున ఆ కార్మికునివంక చూశాడు రాజశేఖరం. సరయిన సమయంలో సరయిన సలహా చెప్పాడా వర్కర్!

''యూ ఆర్ రైట్!... మనం ఆంజనేయులునాయుడ్ని కలవటమే మంచిది'' చెప్పాడు రాజశేఖరం. టీలు తాగాక పైకి లేచారు వారంతా. రాజశేఖరం బిల్లు చెల్లించాక, రోడ్డు మీదికి వచ్చారు. అప్పుడు సమయం పన్నెండుగంటలు.

వారంతా ఆంజనేయులు ఇంటివైపు అడుగువేయసాగారు. ఆ సమయంలో ఆంజనేయులు తన ఇంటిమిద్దెమీద మందుకొడుతూ కూర్చుని ఉంటాడని వారికి తెలుసు.

వారు ఆంజనేయులునాయుడి ఇల్లు చేరుకునేసరికి పావుగంట పట్టింది. కొత్తగా కట్టబడిన ఇల్లు అది! ఇంటిముందు తెల్లటి మారుతికారు ఆగివుంది.

''అన్నా'' గేటుముందు నిలబడి అరిచాడు రాజశేఖరం.

''ఎవరూ?'' కాస్త బొంగురుగొంతు మిద్దెమీదనుండి వినిపించింది.

''నేనన్నా...! రాజశేఖరాన్ని...'' చెప్పాడు.

ఆంజనేయులునాయుడు చేతిలోని గ్లాసు కిందపెట్టి, పారాపిట్‌వాల్ దగ్గరగా వచ్చాడు. కిందికి చూస్తే రాజశేఖరం తనవంకే చూస్తూ కనిపించాడు. పక్కనే కార్మికులు...

''హలో రాజశేఖరం... రారా... పైకిరా...'' నవ్వుతూ అన్నాడు ఆంజనేయులు. అప్పటివరకూ అతడి పక్కనే కూర్చుని ఉన్న అతడి భార్య ఎవరో పైకి వస్తున్నారని తెలిసి మెట్లు దిగి కిందికి వెళ్ళిపోయింది.

రాజశేఖరం, కార్మికులు మెట్లెక్కి పైకి వచ్చారు.

పైనుండి తెల్లని వెన్నెల పడుతోంది. వెన్నెలనీడలో తెల్లని పరుపు పరచిఉంది ఆ మిద్దెమీద. పరుపుపక్కనే రెండు గ్లాసులు, హాఫ్ బాటిల్ విస్కీ, జీడిపప్పు ప్లేట్... ఆంజనేయులునాయుడు ప్రతి రాత్రీ మందుకొడతాడని

వారికి తెలుసు.

ఆంజనేయులునాయుడికి ముప్ఫయ్ అయిదేళ్లుంటాయి. కాలేజీలో చేరినప్పుడే రాజకీయం అంటే ఏమిటో తెలిసింది. అన్నిరకాల వ్యాపారాలకన్నా, రాజకీయంలో చాలా తక్కువ కాలంలో ఎక్కువ సంపాదించవచ్చని పించింది. అంతే! అతడు చదువుమీద శ్రద్ధ చూపించలేదు. స్టూడెంట్స్ యూనియన్‌లో యాక్టివ్ పార్ట్ తీసుకున్నాడు. గేమ్స్ సెక్రటరీ, వైస్‌ప్రెసిడెంట్, ప్రెసిడెంట్... వరుసగా ఆ కాలేజిలోని పదవులన్నీ నిర్వహించాడు. కాలేజీ స్టడీస్ పూర్తయ్యాయి. డిగ్రీ ఫెయిలయ్యాడు. యూనివర్సిటీలో చేరేందుకు అవకాశంలేదు. అసలా కోరికాలేదు.

ఈ దేశంలో ప్రతి స్టూడెంట్ యూనియన్, కార్మికసంఘం- ఏదో ఒక రాజకీయ పార్టీకి అనుబంధ సంస్థగా ఉంటుంది. స్టూడెంట్స్ యూనియన్‌లోనుండి బయటకు వచ్చాక ఆంజనేయులునాయుడు, తమ పార్టీకి యూత్ లీడరయ్యాడు. యూత్‌లీడర్‌గా ఉంటూనే కార్మిక సంఘాలకు లీడరయ్యాడు.

ఆ జిల్లాలోని అన్ని కార్మికసంఘాలకన్నా వారి కార్మికసంఘం చిన్నదే అయినా అన్ని ఫ్యాక్టరీలలో ఉంది. ఫ్యాక్టరీ యూనియన్‌లీడర్లకు ఏ ప్రాబ్లమ్ వచ్చినా ఆంజనేయులునాయుడ్ని కలుస్తుంటారు.

రాజకీయాలలో చేరేనాటికి ఆంజనేయులునాయుడికి ఆస్తి అంటూ ఏమీలేదు. కానీ అతడీరోజు అయిదులక్షలు ఖరీదు చేసే బిల్డింగ్ కట్టాడు. మారుతికారు మెయిన్‌టైన్ చేస్తున్నాడు. నిజమే! పాలిటిక్స్ అన్ని బిజినెస్‌లలోకెల్లా లాభసాటి వ్యాపారం!

"ఏమిటోయ్ రాజశేఖరం! చాలా పొద్దుపోయి వచ్చావు... ఏమిటి విశేషాలు?" ఏదో విశేషం లేనిదే వారు అర్ధరాత్రివేళ రారని అతడికి తెలుసు.

"మీతో చిన్నపని పడిందన్నా" పరుపుమీద కూర్చుంటూ చెప్పాడు రాజశేఖరం మెల్లగా!

"ఏమిటది?"

"రేపటినుండి మేం సమ్మె చేయాలనుకుంటున్నాం"

"ఎందుకు?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు ఆంజనేయులు.

రాజశేఖరం చెప్పాడు- రమేష్‌ని సస్పెండ్ చెయ్యడం, జె.యస్. రావడం, నీళ్లు పడటం, చతుర్వేది తనను సస్పెండ్ చేయడం...! అంతా చెప్పాక "వాళ్లు నన్ను అనవసరంగా సస్పెండ్ చేశారన్నా! ఇప్పుడు నేను సమ్మె చేయిద్దామనుకుంటున్నాను. కాని మన యూనియన్ మాత్రమే సమ్మెలోనికి దిగితే, సమ్మె సక్సెస్ కాదు. అందుకనే... సలహాకోసం మీ దగ్గరకు వచ్చాను..." అన్నాడు.

"మనం సమ్మె చేస్తే ఎందుకని సక్సెస్ కాదనుకుంటున్నావు?" అడిగాడు ఆంజనేయులు నవ్వుతూ.

"మన జనం కొందరేకదన్నా! సమ్మె ఎలా సక్సెస్ అవుతుంది"

"మన జనం కొద్దిఅయితే, మిగతా కార్మికుల్ని కూడా పనిలోకి రాకుండా చూసేది... ఆ పని చేస్తే మన సమ్మె సక్సెస్..."

"ఇప్పుడే ఆ లీడర్స్‌ని కలిసివచ్చాం. వారు డ్యూటీలకు హాజరవుతామని ఖచ్చితంగా చెప్పారు"

సంభాషణ రాజశేఖరం, ఆంజనేయులునాయుడు ఇద్దరి మధ్యే జరుగుతూ ఉంది. ఆంజనేయులునాయుడు కొద్దిక్షణాలపాటు మౌనంగా ఉండిపోయాడు- దీర్ఘాలోచన చేస్తూ!

"అసలు నువ్వు లీడర్స్‌ని ఎందుకు కలవడం? మేనేజ్‌మెంట్ ఇప్పటికే వారి చేతులు తడిపి ఉంటుంది. వారు మన సమ్మెకు మద్దతు పలుకుతారని ఎలా అనుకున్నావు?... అది జరగనిపని! కాబట్టి... మన సమ్మె విజయవంతం కావాలంటే మనం డైరెక్ట్‌గా వర్కర్స్‌ని కలవాలి. వారిని నయాన్నో, భయాన్నో డ్యూటీలకు అటెండ్ కాకుండా చూడాలి. ఆ పని చేయండి. అప్పుడు ఈ సమ్మె ఎలా సక్సెస్‌కాదో నేను చూస్తాను..."

ఆంజనేయులునాయుడి మనసులోని విషయం అర్థమయింది. అతడి నోటివెంట ఆమాట వస్తేచాలు, మిగిలిన వ్యవహారం తామే నడిపించేయగలరు.

''అలాగేనన్నా'' చెప్పాడు రాజశేఖరం.

మరికొద్దిసేపు భరోసా మాటలు చెప్పాక, ''ఇక వెళ్ళిరండి'' అన్నాడు ఆంజనేయులునాయుడు.

''వస్తామన్నా'' చెప్పారు కార్మికులంతా.

రాజశేఖరం వారందరితో కలిసి రోడ్డు ఎక్కాడు. ''మనం రాత్రికేవిషయం తేల్చుకోవాలి. మీకు తెలిసిన కార్మికుల ఇళ్లు చూపించండి. వారిని నయానో, భయానో డ్యూటీకి రాకుండా చేయాలి...''

''ఆపని చేద్దాం'' వంత పలికారు కొంతమంది.

ఆ అర్ధరాత్రివేళ వారంతా కొందరు కార్మికుల ఇళ్ళకు వెళ్ళారు. కొంతమందిని బ్రతిమిలాడారు. మరికొందరిని బెదిరించారు. ''...మర్యాదగా డ్యూటీలకు హాజరుకాకండి. మాకు అన్యాయం జరిగింది. అందుకే సమ్మె చేస్తున్నాం. మీరు కనుక డ్యూటీలకు హాజరయి, మా సమ్మెను విఫలం చేయాలని ప్రయత్నిస్తే మాత్రం... తలలు పగులుతాయి...''

సాటి వర్కర్స్‌ని బ్రతిమలాడుకోవడం, బెదిరించడం జరిగాక వాళ్ళు ఇళ్లకు చేరుకున్నారు...

మరునాటినుండి సమ్మె చేయాలని నిర్ణయింపబడింది.



రాత్రి పదిగంటలవేళ చతుర్వేది ఇంటికి బయలుదేరాలనుకుంటుండగా జగన్నాధంనుండి ఫోన్ వచ్చింది. ''సార్! రాజశేఖరం యూనియన్ రేపటినుండి సమ్మె చేయాలనుకుంటున్నారు...మీకు తెలుసా?''

''ఎక్స్‌పెక్ట్ చేసాను... ఇంతకీ నీకెలా తెలుసు ఈ విషయం?''

''వారు మా ఇంటికి వచ్చి నన్ను కలిసారు. సమ్మెకు మా యూనియన్ సపోర్ట్ కావాలన్నారు. నేను వీలుపడదన్నాను''

'ఆమాటమీదే ఉండు. ఐ కెన్ డూ సమ్‌థింగ్ ఫర్ యూ''

''అలాగే సర్''

''గంగరాజు కూడా సమ్మెలో పాల్గొనడు కదా''

''ఏమో చెప్పలేను సర్''

చతుర్వేది కొద్ది సెకనులు మౌనంగా ఉండి ''అతడిని నేను కంట్రోల్ చేయగలనులే... ఎనీహౌ థాంక్‌యూ ఫర్ యువర్ కైండ్ ఇన్‌ఫర్‌మేషన్''

ఫోన్ పెట్టేసాడు చతుర్వేది. ఆఫీస్‌బాయ్‌ని పిలిచాడు. ''రూమ్ లాక్ చేసుకో... నేను వెళుతున్నాను''

మెట్లు దిగి కిందికి వచ్చాడు అతడు. పార్కింగ్ ప్లేస్‌లోని స్కూటర్ తీసుకుని ముందుకు పోనిచ్చాడు. పావుగంటలో ఇంటికి చేరుకున్నాడు.

మిసెస్ చతుర్వేది తలుపు తీసింది. అతడు లోపలికి వెళ్ళి సోఫాలో అలసటగా వెనక్కు వాలి కూర్చున్నాడు. ఆమె అతడి నుదుటిమీద చేతులు వేసి ప్రశ్నించింది, ''ఏమిటిలా ఉన్నారు''

''ఏమీలేదు, జస్ట్ మిల్ గొడవలలో కొద్దిగా అలసిపోయాను. అంతే''

''చాలా ఆలస్యమయిందేం?''

''ఉదయం జె.యస్. వచ్చాడు... కొద్దిరోజులు ఇక్కడే ఉండేలా ఉన్నాడు. ఆయన ఎప్పుడయినా మిల్‌కి రావచ్చు. అందుకే పరిస్థితులన్నీ చక్కగా ఉంచాలని...''

ఆమె మౌనంగా వుంది.

''పూనమ్'' పిలిచాడు అతడు.

''ఏమిటి?''

''తలనొప్పిగా ఉంది. కొద్దిగా జండుబామ్ రాయి''

ఆమె లోపలికి వెళ్లి సీసా తెచ్చి అతడి నుదుటన సుతారంగా రాయసాగింది. అతడు కొద్దిక్షణాలు ప్రశాంతత ఫీల్అయ్యాక లేచాడు.

''ఎక్కడికి'' అతడు తయారవడం చూసి ప్రశ్నించిందామె.

''నేను సోమనాథ్‌గారి ఇంటివరకు వెళ్లివస్తాను.

''ఇంత రాత్రివేళనా?'' ఆశ్చర్యంగా ప్రశ్నించింది. ''ఇప్పుడు సమయం పదకొండు గంటలు కావస్తోంది''

''కావచ్చు...సోమనాథ్‌గారు అప్పుడే నిద్రపోరనుకుంటాను''

''ఇంత రాత్రివేళ ఆయనను కలవడం ఎందుకు? ఫోన్‌లో మాట్లాడవచ్చు కదా?'' ''ఫోన్‌లో మాట్లాడేందుకు వీలుకాని విషయం ఇది! ఆయనతోనే చర్చించాలి''

''ఏమిటంత సీరియస్ విషయం?''

''రేపు మా మిల్‌లోఒక యూనియన్ సమ్మె చేయబోతుంది''

''సరే! భోంచేసి వెళ్ళండి''

''నో టైమ్'' అతడు బయటకు నడిచాడు.

పావుగంట తరువాత అతడి స్కూటర్ మిల్ జనరల్ మేనేజర్ ఇంటిముందు ఆగింది. అతడు స్కూటర్ ఆపి, స్టాండ్‌వేశాడు. ఇంటి వరండాలోనికి వెళ్ళి కాలింగ్‌బెల్ నొక్కాడు.

పద్ధెనిమిదేళ్ల అమ్మాయి తలుపు తీసి అతడిని చూసి ''హలో అంకుల్ వెల్‌కమ్'' అంది.

''హలో ప్రతిమా... డాడీ ఏంచేస్తున్నారు? ఇంకా నిద్రలోనికిజారుకోలేదుకదా'' అడిగాడు.

''లేదు అంకుల్! ఇప్పుడే ఎవరితోనో ఫోన్‌లో మాట్లాడి డ్రాయింగ్ రూంలోకివెళ్ళారు. బహుశా ఆఫీస్ ఫైల్స్ చూస్తున్నారనుకుంటాను''

అతడు లోపలికి నడిచాడు. డ్రాయింగ్ రూమ్ ముందు నిలబడి''మే ఐ కమిన్ సర్'' అన్నాడు. లోపల వున్న వ్యక్తి అటు తిరిగి చూసాడు. చతుర్వేదికేసి చూసి ''కమిన్'' అన్నాడు. చతుర్వేది కర్టెన్ తొలగించుకుని లోపలికి వెళ్లాడు. ఆయన చూపించిన కుర్చీలో కూర్చున్నాడు.

''చతుర్వేదీ! నేనే ఫోన్ చేసి మాట్లాడాలనుకున్నాను. ఇంతలోనువ్వేవచ్చావు'' అన్నాడు సోమనాథ్.

చతుర్వేది మౌనంగా ఉన్నాడు.

తిరిగి సోమనాథే చెప్పాడు,''ఇప్పుడే జగన్నాథం నుండి ఫోన్ వచ్చింది. రేపటి నుండి రాజశేఖరం యూనియన్ సమ్మె చేయాలనుకుంటున్నారట''

''తెలుసు! ఆ విషయం మీతో మాట్లాడాలనే వచ్చాను''

''ఏమిటి మాట్లాడేది'' కనుబొమ్మలు ముడివేసి ప్రశ్నించాడుసోమనాథ్.

''అదేసర్... ఈ విషయాన్ని జె. యస్.కి ఇన్‌ఫార్మ్ చేద్దామా? వద్దా? ... అని...''

''ప్స్'' నాలుక చప్పరించేసాడు సోమనాథ్. ''ప్రతి చిన్న విషయాన్ని ఆయన దృష్టికి తీసుకు వెళ్లడం ఎందుకు? రియల్ అడ్మినిస్ట్రేటర్ ఎప్పుడూ చాలా కొద్ది విషయాలు మాత్రమే పైవారికి వినిపిస్తాడు. జె.యస్. చుట్టూ ఎప్పుడూ కొన్ని వందల సమస్యలు ఉంటాయి. వాటికితోడు ఇదో సమస్యగా ఆయనకు వినిపించడం ఏమిటి?...వి కెన్ సాల్వ్ దిస్ ప్రాబ్లమ్''

''కరక్ట్‌సార్'' అని ఆగి తర్వాత అన్నాడు. ''కాని రేపు రాజశేఖరం యూనియన్ సమ్మెలోనికి దిగితే దాని పర్యవసానం...''

చతుర్వేది మాటలు మధ్యలోనే కట్ చేశాడు సోమనాథ్.''ఏమవుతుంది! నథింగ్... ఇప్పుడు అన్ని యూనియన్‌లు ఒక్కసారిగా సమ్మెలోనికి దిగితే ఫ్యాక్టరీ మూతపడుతుందని భయపడాలి. బట్ వియార్ నాట్ ఫేసింగ్‌దట్ ప్రాబ్లమ్! ఎందుకంటే, మిగిలిన రెండు యూనియన్‌లు మేనేజమెంట్ వైపే ఉన్నాయి. వారు ఆ ఇద్దరినీ సస్పెండ్ చేయిడం సరయినదే అంటున్నారు. ఇలాంటి సమయంలో మనం భయపడాల్సిన పనిలేదు. మిగిలిన యూనియన్‌లు కోపరేట్ చేయకపోతే వీరు ఎంతకాలం సమ్మె చేయగలరు... నాలుగురోజులు... తర్వాత ఒక్కొక్కరే పనిలో ఎంటర్ అవుతారు...''

''మీరు ఆ మాత్రం భరోసా ఇస్తేచాలు. ఇక ఆ యూనియన్‌లను ఎలా ఆట ఆడించాలో నేను చూసుకుంటాను''

మరికొద్దిసేపు ఫ్యాక్టరీ విషయాలు మాట్లాడుకున్నాక, సోమనాథ్ చెప్పాడు ''మన ఫ్యాక్టరీ విషయాలలో ఓ వారంరోజులపాటు నేను పెద్దగా జోక్యం చేసుకోలేకపోవచ్చు. ఎనిమిదో తారీఖున ప్రతిమ పెళ్లి జరగబోతోంది కదా! ఆ పనులలో నేను బిజీ... సో! ఈ విషయాన్నినువ్వే డీల్ చేయాలి''

''అలాగేసార్''

మరో పది నిమిషాలు మాట్లాడాక లేచాడు చతుర్వేది ''వెళ్లొస్తానుసార్''

''గుడ్‌నైట్''

అతడు రూమ్ దాటి ఇవతలకు వచ్చాడు. హాలులో కూర్చుని నవల చదువుకుంటోంది ప్రతిమ.

''హాయ్ ప్రతిమా?... ఏమిటి చదువుతున్నావు''

''నవల అంకుల్'' ''చాలా పొద్దుపోయింది. వెళ్లిపడుకుని తీపి కలలు కనకూడదూ?''

''పో అంకుల్'' సిగ్గుపడిందామె.

''వెళ్తున్నాను... కాని నీ పెళ్లికి వస్తానమ్మాయ్''

ఆమె ఏడుపు ముఖం పెట్టింది.

నవ్వుకుంటూ బయటకు నడిచాడు అతడు.

★ ★ ★

హాల్లోని సోఫాలో కూర్చుని దీర్ఘాలోచనలో మునిగిపోయాడు శ్రీనివాస్. అప్పుడు గడియారంలోని చిన్నముల్లు పన్నెండును సమీపిస్తూ వుంది. బయట వెన్నెల మల్లెపూలు పరచినట్టుగా వుంది.

ఆ వెన్నెల అతడిలోని అసంతృప్తిని మరింత పెరిగేలా చేస్తోంది. అర్ధరాత్రివేళ గాఢనిద్రలోనుండి ఉలిక్కిపడి లేస్తే చుట్టూ ఉండే మసక చీకటి వెక్కిరిస్తుంది. అప్పుడు ఆక్షణమే అర్థమవుతుంది ఒంటరితనం ఎంత బాధాకరమయినదో! ఎవరయినా కాసింత ఆప్యాయంగా, ఆదుర్దాగా 'ఎందుకు?... ఎందుకు ఉలికిపడి లేచావని?' ప్రశ్నిస్తే ఎంత బాగుణ్ణు! ఆ పిలుపు తల్లిది కావచ్చు, ప్రియురాలిది కావచ్చు! కాని ప్రతిమనిషికి ఒంటరితనాన్ని దూరంచేసే ఒక తోడు కావాలి... నేను లక్షలు సంపాదించాను. తెల్లారి లేచాక నాచుట్టూ వందల కొలదీ జనం ఉండొచ్చు. బట్ ఈ నిశి రాత్రివేళ నాకెవరు తోడున్నారు?... ఒంటరితనానికి మించిన శాపం మరోటి ఏముంది?... అయితే నేను శాపగ్రస్తుడినా?...

లక్ష్మి గుర్తుకు వచ్చింది అతడికి. 'ఎందుకు లక్ష్మీ! నన్నెందుకిలా మార్చావు?... ఇందులో నీ తప్పేం లేకపోవచ్చు. నువ్వు ఏనాడూ నాతో ప్రేమ నటించలేదు. నేనే అపార్థం చేసుకున్నాను. ఆశలు పెంచుకున్నాను. ఆశ అడియాస అయ్యాక కసి పెరిగింది నాలో! అది డబ్బు సంపాదన మీదకి డైవర్ట్ అయింది. ఆ కసి తీరాక, వెనుతిరిగి చూసుకుంటే, నేను మునుపటి మనిషినే! డబ్బు తప్ప మరేమీ లేనివాడిని. ముఖ్యంగా ఆప్యాయతకు ముఖం వాచినవాడిని...' అనుకున్నాడు బాధగా.

గడియారంలోని మూడు ముల్లులు పన్నెండుమీదకి చేరాయి. ఆ సమయంలోనే-టీపాయ్‌మీది ఫోన్ మ్రోగింది. ఆలోచనలలో మునిగిన అతడు మూడు సెకనులపాటు ఆ శబ్దాన్ని వినిపించుకోలేదు. లీలగా వినిపించిన శబ్దం ఆలోచనలను కట్ చేసింది తర్వాత...

అతడు ఫోన్ వంక అదోలా చూసాడు. ఈ సమయంలో తనకు ఫోన్ చేసేవారు ఎవరు? హైదరాబాదులోనయితే అన్నివేళలా ఫోన్స్ వస్తూనే ఉంటాయి. కాని ఇక్కడ...

ఫోన్ రిసీవర్ చేతిలోనికి తీసుకుని హలో అన్నాడు అతడు.

''నేను గాయత్రిని''

అతడు ఆశ్చర్యపోయాడు. ఆనందం కూడా కలిగింది. ఇంత రాత్రివేళ గాయత్రి నుండి ఫోన్...

''ఏమిటి విశేషం?''

''మీరేమిటి చెప్పకుండా ఊరు చెక్కేసారు.

# ఏరిన ముత్యాలు

★ జీవితం అంతకంతకు తన్మయత్వంనొందించే సాహస కార్యంవలె కనపిస్తుంది. అందులో మనం నేర్చుకోవలసింది, చేయవలసింది ఎంతో ఉంది.

— నెహ్రూ

★ జీవితం మంచీకాదు, చెడూకాదు. నీ మనఃస్థితినిబట్టి అది మంచిగానూ, చెడుగానూ కనబడుతుంటుంది.

— వివేకానంద

★ ఎలా మరణించాడు అనేదికాదు గొప్ప విషయం. అతడు ఏరకంగా జీవించాడనేది గొప్ప విషయం.

— హజరత్అలీ

★ ప్రయత్నశీలునికే పనులు నెరవేరతాయి తప్ప, ఊరికే పగటి కలలుకనేవాడికి కాదు. సింహమైనా నోరు తెరుచుకొని ఉంటే, జంతువులు వాటంతట అవి వచ్చి నోటిలో దూరవు.

-- హితోపదేశం

★ అన్ని కళలలోకి గొప్ప కళ అందమైన నడవడి.

-- ఎమర్సన్

★ కష్టాల్ని కోరితెచ్చుకోవడం నీ సరదా అయితే తప్పకుండా తెచ్చుకో. కానీ పక్కవారికి పంచిపెట్టడానికి నీకేం హక్కుంది?

--కిప్లింగ్

★ అన్నిటికంటే కష్టమైనవి మూడు- ఒకటి రహస్యాల్ని దాచిపెట్టడం, రెండు కష్టాల్ని మర్చిపోవడం, మూడు అవకాశాన్ని సద్వినియోగపరచుకోవడం.

--చిలో

★ భార్యాభర్తలు కత్తెరలోని రెండు భాగాలవంటివారు. అవి విడదీయ రాకుండా అతుకబడి ఎప్పుడూ వ్యతిరేకదశలో కదులుతుంటాయి. మధ్య వచ్చిన వాటిని మాత్రం కత్తిరించి పారేస్తాయి.

— సిడ్నీ స్మిత్

★ తొందరగా పెళ్లిచేసుకుంటే తీరికగా పశ్చాత్తాపపడక తప్పదు.

— విలియం కాంగ్రీవ్

★ ఏకాలంలోనైనా, ఏ జాతికైనా దాని భవిష్యత్తు ఇరువది అయిదేండ్లలోపు వయసుగల యువకుల భావాలపైనే ఆధారపడి ఉంటుంది.

— కార్లైల్

★ క్లుప్తంగా, మధురంగా చెప్పడం కళ. తేటగా సూటిగా రాయడం ఒక శాస్త్రం.

— విద్వాన్‌విశ్వం

సేకరణ: నలబెల్లి శ్రీమన్నారాయణ

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✶ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

--- కూపన్ ---

జూలై    చతుర నవల    బంద్

సమీక్షకుని పేరు : ....................................

చిరునామా : ....................................

....................................

....................................

....................................

చెపితే వెంటపడతానని భయమా?'' సీరియస్‌గా ధ్వనించింది అవతలివైపు కంఠం. అయితే ఆ గొంతులోని తియ్యదనం మాత్రం ఎప్పటిలానే ఉంది.

''అదేమిటి గాయత్రి! అలా అంటావు? నీకు చెప్పడానికి నాకు భయమేమిటి?... కాక పోతే అనుకోకుండా బయలుదేరేసాను. అంతే''

''ఇప్పుడే ఆంటీకి ఫోన్ చేస్తే తెలిసింది. తనురు వారంరోజులపాటు ప్రోగ్రాం వేసారని. చాలా కోపం వచ్చింది. వెంటనే మీకు ఫోన్ చేస్తున్నాను...''

అతడి పెదాల మీద సన్నని నవ్వు కదలాడింది. 'సారీ' అన్నాడు. ''సారీ... గీరీ... అనేస్తే వప్పుకోను''

''మరేం చేయను''

''హైదరాబాదు తిరిగి రాగానే నన్ను కలవాలి''

అచేతనుడయ్యాడు శ్రీనివాస్.'ఎందుకు.. ఎందుకు ... గాయత్రీ! నామీద నీకింత అభిమానం! ఏమీలేని స్థితిలో కూడా నన్ను ఆదరించావు. అన్నీ సంపాదించుకున్నాక, పొద్దువాలిన వయసులో కూడా నన్ను వదలనంటావు? నాలో ఏమి చూసావు! వద్దు గాయత్రీ ఎంతో మంచి మనసు నీది! తెలిసి తెలిసీ నన్ను వలచి వ్యథపడబోకు...' చెప్పాలనుకున్నాడు. కాని, చెప్పలేక ఆగిపోయాడు. క్షణకాలంలో కలిగిన భావాల పరంపరను వివరించడానికి పెదవి సహకరించలేదు.

''అలాగే'' అనగలిగాడు చివరికి.

వెంటనే ప్రశ్నించింది ఆమె. ''లక్ష్మి అక్కయ్యా ఎలా ఉంది?''

'నువ్వెవరో ఆమెకు తెలియదు. ఆమె ఎవరో నీకు తెలుసు... అయినా ఆమె యోగక్షేమాలు విచారించేంత మంచితనం నీలో వుంది' అనుకుని పైకి ''షి ఈజ్ ఆల్‌రైట్'' అన్నాడు.

''ఇంకేమిటి విశేషాలు?''

గాయత్రి తనను ఏనాడూ బిజినెస్ వ్యవహారాలు ప్రశ్నించదు. అన్నీ పర్సనల్ టాపిక్సే!

''ఏమున్నాయి... మరో నాలుగయిదు రోజులలో హైదరాబాదు వచ్చేస్తాను''

''బాప్‌రే! చాలారోజులు కేంప్ వేసారే''

''అవును! కాసింత రెస్ట్ అవసరమనిపించింది''

''లక్ష్మి అక్కయ్యా దగ్గరగా ఉండాలనా?''

అతడు నవ్వలేదు. తామిద్దరి గురించి ఆమెకు పూర్తిగా తెలుసని అతడికి తెలుసు. దాచుకోవలసిందంటూ ఏమీలేదు.

''సరే! మళ్లీ ఫోన్ చేస్తాను రేపు రాత్రికి! ఉంటాను'' ఫోన్ పెట్టేసింది గాయత్రి. -

అతడు కూడా ఫోన్ పెట్టేసాడు. అరనిమిషంపాటు ఆచోటే నిలబడి పోయాడు. ఏమిటో తన మనసులోని సంఘర్షణ తనకే అర్థంకావడంలేదు. 'తనకు లక్ష్మి అంటే ఇష్టం! గాయత్రికి తనంటే ఇష్టం! తను లక్ష్మిని పెళ్లి చేసుకోలేకపోయానన్న బాధతో బ్రహ్మచారిగా ఉండిపోయాడు. గాయత్రి తనను పెళ్లాడాలన్న కోరికతో పెళ్ళిచేసుకోకుండా ఆగిపోయింది. తనకు పెళ్ళంటే విరక్తి! ఆమెకు తననే పెళ్ళాడాలని పట్టుదల... ఆ దేవుడు చాలా విచిత్రాలు సృష్టిస్తూ ఉంటాడు. మనసుతో ఆడుకుంటూ ఉంటాడు'

దీర్ఘంగా నిట్టూర్చాడు అతడు. మెల్లగా వెనుతిరిగి కిటికీ దగ్గరగా వచ్చాడు. విండో కర్టెన్ పక్కకు లాగితే, నైట్‌క్వీన్ పరిమళం సుతారంగా తాకింది అతడిని. గాయత్రి మళ్లీ గుర్తుకువచ్చింది.

'తను హైదరాబాదు చేరిన తొలిరోజులు అవి. ఓ కన్‌స్ట్రక్షన్ కంపెనీలో జాయిన్ అయ్యాడు తను. ఆ కంపెనీ చీఫ్ ఇంజనీర్ కూతురు గాయత్రి. ఏదో పనిమీద వారింటికి వెళ్ళినప్పుడు తొలిసారిగా పరిచయం అయింది. ఆ పరిచయం కొద్దిరోజులకు స్నేహయమయింది. ఆరు నెలల తర్వాత తను ఆ కంపెనీ నుండి ఇవతలికి వచ్చేసాడు. అయినా ఆమె తనతో స్నేహం ఆపేయలేదు... తను కష్టపడే తీరు ఆమెకు నచ్చింది. తనలోని పట్టుదల ఆమె మెచ్చింది. తెలివితేటలు గుర్తించింది. జీవిత భాగస్వామి కావాలన్న కోరిక వ్యక్తం చేసింది... తను లక్ష్మి గురించి చెప్పాడు. తమ కథ అంతా

విన్నాక 'ఆమెకు పెళ్ళయిపోయింది కదా! మరి నన్ను పెళ్ళాడటంలో అభ్యంతరమేమి టని' ప్రశ్నించింది గాయత్రి. ఏమని చెప్పగల డు తను?! లక్ష్మిని మరచిపోలేకున్నానని విడ మరచి చెప్పినా 'నిన్నే పెళ్ళాడుతా'నని పట్టు పడితే ఏం చేయగలడు?!

ఎంత ఆలోచించినా, అది ప్రవాహమే తప్ప అంతం కనిపించట్లేదు. ఆలోచనలమధ్య ఆల సిపోయాక వెనుతిరిగి-వచ్చి బెడ్ మీద వాలా డు.

* * *

రాజశేఖరం యూనియన్ సమ్మెలోకి దిగింది.

మిల్ ముందు టెంట్‌వేసి అందులో వంద మంది వరకూ కార్మికులు కూర్చున్నారు. వారిలో కొందరు గేటు దగ్గరకు వెళ్ళి పెద్దగా నినాదాలు ఇవ్వసాగారు.

''మేనేజ్‌మెంట్ డౌన్ డౌన్''

''సస్పెండ్ చేసిన కార్మికులను వెంటనే పనిలోనికి తీసుకోవాలి''

''చతుర్వేది డౌన్‌డౌన్''

నినాదాలు, పేపర్ల మీద వ్రాసిన స్లోగన్స్!

సెక్యూరిటీ గార్డ్‌లు సమ్మె చేసే కార్మికులను గేటుదాటి లోపలికి రానివ్వకుండా చూస్తున్నా రు. మిల్ ముందు వాతావరణం వేడిగా ఉంది.

అదే సమయంలో లోపల చతుర్వేది కూడా హడావుడిగా ఉన్నాడు. జగన్నాథరావు, గంగరా జులను తన ఛాంబర్‌లోనికి పిలిపించాడు.

''రాజశేఖరం సమ్మె మొదలుపెట్టాడు?''

తలూపాడు గంగరాజు ''సమ్మె మొదలుపె ట్టగానే సరిపోదు కదా సార్! మొదలుపెట్టిన సమ్మె సక్సెస్ కావాలి... ఇంత పెద్ద మిల్‌లో ఓ వంద రెండు వందల మంది వర్కర్స్ డ్యూటీకి రానంత మాత్రాన మిల్ ఆగిపోదు''

''నేను ఆ యూనియన్ గురించి ఆలో చించడం లేదు. ఐ డోన్ట్‌కేర్!... నేను భయప డేది- మీరు వీక్ అవుతారేమోనని''

''నో సార్'' ఖచ్చితంగా పలికారు వారు, ''మేము ఎలాంటి వత్తిడులకు, మరెలాంటి బెదిరింపులకు భయపడం... రాత్రి కూడా ఆ యూనియన్ వాళ్ళు మా యూనియన్ కార్మి కుల ఇళ్ళకు వెళ్ళి బెదిరించి వచ్చారట. మేము ఆ కార్మికులకు చెప్పాము- అటువంటి బెదిరింపులకు భయపడవద్దని వారికి ఎలాంటి ప్రమాదం జరగకుండా మేము కాపా డుతామని...''

''ఆ మాట మీదే ఉండండి మీరు''

''అలాగే సర్'' బదులిచ్చారు వారు.

''వారు మీ కార్మికులను బెదిరించవచ్చు. డ్యూటీకి వస్తే అది చేస్తాం- ఇది చేస్తాం అని భయపెట్టవచ్చు. మీ కార్మికులను భయపడవ ద్దని చెప్పండి. అవసరమయితే పోలీస్ ప్రొటె క్షన్ కూడా తీసుకుందాం''

''అవన్నీ మేము చూసుకుంటాం సర్''

చతుర్వేది తన కోటు జేబులోనుండి పదిరూ పాయల నోట్లకట్టలు రెండు తీసాడు. చెరొకటి అందించాక చెప్పాడు ''ఇక మీరు వెళ్ళొచ్చు'' వారిద్దరూ పైకిలేచి అతడికి నమస్కరించి వెనుతిరిగారు.

వారు తలుపు దగ్గరగా వెళ్ళాక, చతుర్వేది పిలిచాడు ''చూడండి'' లీడర్స్ ఇద్దరూ తల లు తిప్పి చూశారు.

''సమ్మె ఎట్టి పరిస్థితిలోనూ సక్సెస్ కాకూడ దు. ఇది జె.యస్.పరువుకు సంబంధించిన విషయం''

తలలూపి వెళ్లిపోయారు వారిద్దరూ.

చతుర్వేది తన ఛాంబర్ విండో దగ్గరగా నడిచి కర్టెన్ తొలగించి ఎంట్రన్స్ గేటువంక చూసాడు.

కార్మికుల 'గోల' ఎక్కువగా ఉంది. అతడి పెదాలమీద అదోలాటి చిరునవ్వు కదలా డింది. వ్యంగ్యమయిన నవ్వు అది. 'ఆ కొద్ది మంది కార్మికులు నన్నేం చేయగలరు?' అన్న ధీమాతో కూడిన నవ్వు అది!

అతడు తలతిప్పి మరోవంక చూసాడు. 'మిల్ లోపల సమ్మెఛాయలు ఏమీ లేవు. పనులన్నీ నిరాటంకంగా జరిగిపోతున్నాయి. యంత్రాలన్నీ ఎప్పటిలానే కదులుతు న్నాయి... మరి వారు సమ్మె చేసి సాధించిందే మిటి?'

ఫోన్ రింగవడంతో అతడి ఆలోచనలు కట్ అయ్యాయి. టేబుల్ దగ్గరగా వెళ్ళి ఛెయిర్‌లో కూర్చుని రిసీవర్ చేతిలోనికి తీసుకున్నాడు.

''హలో చతుర్వేది స్పీకింగ్''

''ఐయామ్ సోమనాథ్!... మిల్ పరిస్థితి ఎలా ఉంది?''

''గుడ్‌మార్నింగ్ సర్!... ఆ యూనియన్ వాళ్ళు సమ్మెకు దిగారు. బట్ దానివలన వారు సాధించేదేమీలేదని అనుకుంటున్నాను''

''మిగిలిన రెండు యూనియన్‌లు మన కంట్రోల్‌లోనే ఉన్నాయి కదా''

''ఉన్నాయి సర్! అదే నా ధీమా కూడా''

''వారిని గుప్పిటలోనుండి జారనివ్వకు. అది చాలా ముఖ్యం''

''నాకు తెలుసు సార్''

''ఏదయినా మరీ అవసరపడితే నాకు ఫోన్ చెయ్యి''

''తప్పకుండా'' ఆగి క్షణం తర్వాత పలికాడు ''ఆ అవసరం రాదనే అనుకుంటున్నాను''

అవతలివైపు సోమనాథ్ చిన్నగా నవ్వాడు.

నాలుగు సెకనుల తర్వాత చతుర్వేది అడిగాడు ''జె.యస్.టౌన్‌లోనేఉన్నాడు కదూ?''

''అవును''

''ఈరోజు సాయంత్రం ఆయనను కలుసుకోవాలనుకుంటున్నాను''

''ఎందుకు?'' చప్పున అడిగాడు సోమనాథ్.

''సమ్మె గురించి మాట్లాడేందుకు కాదు లేండి... పెద్దవారు మనకు దగ్గరగా ఉన్నప్పుడు కలవడం మర్యాద కదా! లేకపోతే ఆయన చిన్నబుచ్చుకునేందుకు అవకాశం ఉంది.''

''నిజమే'' అని ఆగి తర్వాత అన్నాడు సోమనాథ్ ''నాకూ ఆయనను కలవాలనే ఉంది. కాని ఈ పెళ్ళి పనుల వత్తిడిలో వీలుపడట్లేదు. అయినా వీలు చూసుకుని ఆయనను కలవాలి''

అప్పుడే గుర్తుకువచ్చినట్టు ''పెళ్ళి పనులు బాగా సాగుతున్నాయా సార్?'' ప్రశ్నించాడు చతుర్వేది.

''ఆహా!... కల్యాణ మండపం బుక్ చేయడం, వెడ్డింగ్ కార్డ్స్ ప్రింటింగ్, బట్టలు పర్చేజ్ వరకూ జరిగిపోయాయి. బంధువులకు కార్డ్స్ పంచడం, పిండి వంటలు తయారీ లాంటివి మిగిలి ఉన్నాయి... అన్నట్టు రేపు వెడ్డింగ్ కార్డ్ తీసుకుని నేనూ జె.యస్.ని కలిస్తే బాగుంటుంది కదూ''

''బాగుంటుంది''

''సోమనాథ్ తనలోతాను అనుకుంటున్నట్టుగా అన్నాడు ''పెళ్ళి ఇక ఆరు రోజులే ఉంది... చేయవలసిన పనులు చాలా ఉన్నాయి''

అవతలివైపు ఫోన్ పెట్టేసాక, తనూ ఫోన్ పెట్టేసాడు చతుర్వేది.

★ ★ ★

ఫ్యాక్టరీలో పరిస్థితి ఇలా ఉంటే, ఆ విషయమే తెలియని శ్రీనివాస్ లక్ష్మితో కలసి కాలాన్ని ప్రశాంతంగా గడిపేస్తున్నాడు.

ఆరోజు ఉదయమే అతడు లక్ష్మికి ఫోన్ చేసాడు.

''హలో లక్ష్మీ! నేను శ్రీనివాస్‌ని మాట్లాడుతున్నాను''

''లక్ష్మీ! ఈరోజు సన్‌డే కదా!... ఏదయినా ప్రోగ్రాం ఉందా?''

''ఆదివారం మధ్యాహ్నం వరకూ ఇన్ పేషెంట్స్‌ని చూస్తాము తర్వాత ఫ్రీయే!... ఎందుకు?''

''అయితే ఈరోజు నాకు కంపెనీ ఇవ్వగలవా?''

''ఏదయినా ప్రోగ్రాం ఫిక్స్ చేసారా?''

''ప్రోగ్రాం ఫిక్స్ చేయడం అంటూ ఏమీ లేదు. నీకు టైమ్ ఉంటే ఈరోజు సాయంత్రం నీతో అలా షికారుగా తిరగాలనిపిస్తోంది''

అవతలివైపు కొన్ని సెకనుల నిశ్శబ్దం! మనసుమూల ఎక్కడో చిన్న స్పందన.

''అలాగే సాయంత్రం మీకోసం వెయిట్ చేస్తూ ఉంటాను''

ఫోన్ పెట్టేసింది లక్ష్మి! పక్కనే ఉన్న సోఫాలో కూర్చుని తల వెనక్కు వాల్చింది 'శ్రీనివాస్‌కి తనంటే ఎందుకింత ప్రేమ... తనకు పెళ్ళయిపోయింది. రేపోమాపో 'అమ్మ' కాబోతోంది. అయినా శ్రీనివాస్ తనమీద ప్రేమ

ను ఇంకా మరచిపోలేదా?!

శ్రీనివాస్ గురించి ఆలోచిస్తూనే హాస్పిట ల్‌కు తయారుకాసాగింది.

పావుగంట తర్వాత ఆమె ఎక్కిన రిక్షా క్లినిక్ ముందు ఆగింది. రిక్షా దిగుతుంటే చాలా భారంగా అనిపించింది. కడుపులో బిడ్డ కది లినట్టు... ఆమెకు అవినాష్ గుర్తుకు వచ్చాడు. 'మరో వారంరోజులలో డెలివరీ కావలసి ఉంది. ఈ సమయంలో తనకు రెస్ట్ ఎంతో అవసరం. ఆ విషయమే తను అతడికి చె ప్పింది- మెడికల్ కాన్ఫరెన్స్‌కి వద్దని, హాస్పి టల్ చూసుకోమని! కాని అతడు వినలేదు 'ప్లీజ్ డార్లింగ్! డెలీవరీ టైమ్‌కి మూడురోజులు ముందుగానే వచ్చేస్తాను' అంటూ రిక్వెస్ట్ చేసు కుని వెళ్ళాడు. తనేం చేయగలదు? ఇలాంటి సమయంలో స్త్రీ విశ్రాంతిని, భర్త తోడును ఎంతగా కోరుకుంటుందో అతడికేం తెలుసు?!' భర్త మీద కొద్దిగా కోపం వచ్చింది. మనసులోనే విసుక్కుంది కూడా!

లోపలికి వెళ్లి కన్సల్టింగ్ రూమ్‌లో కాసేపు కూర్చుంది. నర్స్ వెంబడి రౌండ్స్‌కి వెళ్లింది.

పేషెంట్స్‌ని చూసి వచ్చేసరికే గంటపైగానే అయింది. తిరిగి వచ్చి కుర్చీలో కూర్చున్నాక, నర్స్ అందించిన కాఫీ తాగింది.

"డాక్టర్‌గారు ఎప్పుడొస్తారు మేడమ్" అడి గింది నర్స్.

"రాత్రి ఫోన్ చేశారు. వచ్చేసరికి వారం రోజులు పడుతుందట" జవాబు పలికింది లక్ష్మి.

"మేడమ్! ఈ రోజు ఉదయం డాక్టర్ జయప్రదగారు ఫోన్ చేశారు. నిన్ననే మీరు ఇంజక్షన్‌కి వెళ్లాలటకదా"

"ఓ! మర్చేపోయాను" శ్రీనివాస్ ఆలోచనల మధ్య తను నిన్నటి రోజు ట్రీట్‌మెంట్‌కి వెళ్లటం మర్చిపోయింది, "ఇప్పుడే వెళ్తున్నా ను. నేను వస్తున్నట్టు ఆంటీకి ఫోన్ చేసి చెప్పు"

నర్స్ ఫోన్ చేసేందుకు పక్కరూమ్‌లోకె ళ్లింది. లక్ష్మి తన బేగ్ సర్దుకుంది. నర్స్ వచ్చాక ఆమెకు చెప్పేసి బయటకు నడిచింది. రిక్షా ఎక్కి డాక్టర్ జయప్రద నర్సింగ్‌హోమ్‌కె ళ్లింది. డాక్టర్ జయప్రద టౌన్‌లో పేరున్న గైనకాలజిస్ట్. యాభై సంవత్సరాలు ఉంటా యామెకు. లక్ష్మిని చూడగానే ఆమె చాలా ఆప్యాయంగా ఆహ్వానించింది.

"కమిన్ లక్ష్మి! ఐ యామ్ వెయిటింగ్ ఫర్ యూ... నిన్న రాలేదు ఎందుకని?"

"సారీ ఆంటీ! కాసింత బిజీగా ఉండి..." నసిగింది లక్ష్మి!

"ఈ టైమ్‌లో నువ్వు మరీ ఎక్కువ అలసిపో కూడదమ్మా! అసలు హాస్పిటల్ బాధ్యత నీ మీద వదిలేసి వెళ్లిన అవినాష్‌ని అనాలి. రానివ్వు చెడామడా అడిగేస్తాను..."

లక్ష్మి ఇబ్బందిగా నవ్వింది.

"కమిన్" ఆవిడ పక్కగదిలోనికి వెళ్లి లక్ష్మిని పిలిచింది. లక్ష్మి ఆ గదిలోనికి వెళ్లి బెడ్ మీద పడుకుంది. జయప్రద ఆమెకు ఇంజ క్షన్ చేసింది. తర్వాత ఆమెను పరీక్షించి చెప్పింది "లక్ష్మీ! డెలివరీ పదవతారీఖుకన్నా ముందుగానే జరగొచ్చేమో!"

"ఐసీ"

"ఎందుకయినా మంచిది ఎనిమిది, తొమ్మిది తారీఖులలో హాస్పిటల్‌లో జాయిన్ కాకూడదూ?"

"అలాగే"

ఇద్దరూ కన్సల్టింగ్ రూమ్‌లోనికి వచ్చారు.

ఆవిడ ఫీజు తీసుకోదు. లక్ష్మికి ఆవిడ ట్రీట్‌మెంట్ ఇస్తుంది. తన కుటుంబంలోని వారికి ఫిజీషియన్ అవసరమయితే ఆవిడ వారిని లక్ష్మి దగ్గరకు పంపిస్తుంటుంది. అవి నాష్ కార్డియాలజిస్ట్!

జయప్రద హార్లిక్స్ ఇచ్చింది లక్ష్మికి. తాగాక 'వెళ్లొస్తాను ఆంటీ' చెప్పింది లక్ష్మి పైకి లేచి!

"ఏదయినా ప్రాబ్లమ్ ఉంటే ఫోన్ చెయ్యి"

"అలాగే"

బయటకు వచ్చి రిక్షా ఎక్కింది. చాలా నీరసంగా అనిపిస్తోందిఆమెకు. అయితే సాయంత్రం శ్రీనివాస్‌తో కలసి షికారుగా బయటకు వెళ్లబోతున్నామన్న ఆలోచన ఎక్క డలేని ఉత్సాహాన్ని కలిగిస్తోంది. తామిద్దరూ కలసి తిరిగి చాలా చాలా కాలమయిపోయింది

కదూ! తిరిగి ఇప్పుడు...

ఆలోచనల మధ్య ఇల్లు రావడం కూడా గమనించలేదు. రిక్షా ఆగటంతో ఉలికిపడి ఆలోచనల నుండి తేరుకుంది. రిక్షావాడికి డబ్బులిచ్చేసి లోపలికి నడిచింది.

కాసేపు విశ్రాంతిగా పడుకున్నాక, లేచి ఫోంచేసింది. మళ్లీ పడుకోవాలని ప్రయత్నించింది. నిద్రపట్టలేదు. ఏదో తెలియని టెన్షన్. తన వయసు ఒక్కసారిగా పదేళ్లు తగ్గిపోయినట్టు, అసుర సంధ్యవేళ అభిసారికలా ఎదురు చూడడం... తనకే ఆశ్చర్యంగా తోచింది.

ఏమిటీ వింత?... మనసా! ఎందుకీ తుళ్లింత...

ఆమె లేచి వెళ్లి స్నానం చేసింది. శ్రీనివాస్‌కి గులాబీరంగు అంటే చాలా ఇష్టం. తనకు పెళ్లికాక మునుపు అతడు తనతో చాలాసార్లు అన్నాడు. 'గులాబీరంగు నీ వంటికి బాగా నప్పుతుంది లక్ష్మీ! ఈ చీరలో నువ్వు మరింత అందంగా కనిపిస్తావు' అందుకే ఆమె బీరువాలోనుండి అన్ని చీరలూ చూసి గులాబీరంగు చీర అందుకుంది. చీర కట్టుకుని అద్దంలో చూసుకుంది. ఈమధ్య తను కాసింత లావయింది. బుగ్గలు నునుపెక్కాయి... గర్భిణీస్త్రీలు ప్రసవ సమయం దగ్గరయ్యేకొద్దీ అలా కనుపించడం మామూలే!

లక్ష్మి హాలులోనికి వచ్చి కూర్చుని, శ్రీనివాస్ కోసం ఎదురు చూడసాగింది.

సరిగ్గా నాలుగు గంటలకు అతడి కారు ఇంటి ముందు ఆగింది. అతడు కారుదిగి, లోపలికి వచ్చాడు. తయారయి ఉన్న ఆమెను చూసి 'గుడ్' అన్నాడు. 'వెళ్దామా?' ప్రశ్నించాడు.

లక్ష్మి అతడివెంట బయటకు నడిచింది. కారు ఫ్రంట్ డోర్‌తీసి పట్టుకున్నాడు. ఆమె కారు ఎక్కింది. డోర్ వేసి వెళ్ళి డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు.

కారు రోడ్డు ఎక్కాక అడిగాడు ''ఎక్కడికి వెళ్దాం?''

''నాకేం తెలుసు? కంపెనీ అడిగారు... సో! మీరు ఎక్కడికి తీసుకువెళితే అక్కడికి వస్తాను'' సన్నగా నవ్వుతూ చెప్పిందామె.

''ఎక్కడికి తీసుకువెళితే అక్కడికి వస్తావా?'' అదోలా నవ్వాడు.

శ్లేష అర్థమయింది. అర్థంకానట్టే నవ్వి ఊరకుండిపోయింది.

కారు ముందుకుపోసాగింది. ఆమె తల పక్కకు తిప్పి రోడ్డు వంక చూడసాగింది. కొద్ది రోజులక్రితం తామిద్దరూ ఆ రోడ్డు వెంబడే నడిచి వెళ్లడం గుర్తుకు వచ్చిందామెకు. అప్రయత్నంగా ఆమె ఓరగా అతడిని చూసింది. చాలా... చాలా సామాన్యంగా కనిపించే ఈ వ్యక్తి పట్టుదల, తెలివి తేటలు నిజంగా ఎంత గొప్పవి. ఓ ఏడేళ్ల క్రితం ఈ వ్యక్తే ఇదే రోడ్డు వెంబడి రాళ్లు కొట్టుకుంటూ తిరిగాడంటే నమ్మడం సాధ్యమేనా? అతడేమీ ఇల్లీగల్ పనులు చేయలేదు. కేవలం తెలివి పెట్టుబడిగా లక్షలు సంపాదించాడు. ఇంత తెలివయిన వాడిని, ముఖ్యంగా తనను ప్రేమించినవాడిని దూరం చేసుకోవడం తప్పేనేమో!

కారు ఆగడంతో ఆ వంక చూసింది. ఐస్‌క్రీం పార్లర్!

అతడు కారు దిగాడు. ఆమె కూడా కారు దిగి ముందుకు నడిచింది. లోనికి వెళ్లి ఓ టేబుల్ ముందు కూర్చున్నారిద్దరూ!

ఆమెకు తెలుసు శ్రీనివాస్‌కి ఐస్‌క్రీం అంటే చాలా ఇష్టం! ఒకసారి అతడికి ఎక్కువగా జ్వరం వచ్చింది. అప్పుడు అతడికి తనే ట్రీట్‌మెంట్ ఇస్తూ ఐస్‌క్రీం తినవద్దని చెప్పింది. కానీ అతడు వినలేదు. చాటుగా వెళ్లి తిని వచ్చేసేవాడు. మెల్లగా అది న్యూమోనియాగా మారడం...

సప్లయర్ వచ్చాక రెండు ఐస్‌క్రీం తెమ్మని చెప్పాడు అతడు.

''ఐస్‌క్రీం తినడం ఇంకా మానలేదా?''

''చిన్నతనంలో ఏర్పడిన కొన్ని ఇష్టాలు, అభిరుచులు ఎంత పెద్దవాడయినా, ఏ స్థాయికి వెళ్లినా అంత సులభంగా మారవు''

అతడు ఆ మాట ఏ ఉద్దేశ్యంతో అన్నాడో తెలియదుగానీ, ఆమెకు మాత్రం మరో అర్థం కూడా వినిపించింది.

సప్లయర్ రెండు ఐస్‌క్రీమ్స్ తెచ్చి టేబుల్ మీద పెట్టాడు.

ఆమె ఐస్‌క్రీం స్పూన్‌తో అందుకుని నోట్లో ఉంచుకుంది. అది వెంటనే కరిగిపోయింది. మనసులోని వేదన కూడా అలా కరిగిపోగలిగితే ఎంత బాగుణ్ణు!

"మీరు బిజినెస్ పనులలో ఎప్పుడూ బిజీ కదా! మరి ఇప్పుడు వారంరోజులపాటు. అందులోనూ ఈ చిన్న టౌన్‌లో ఉండిపోవడానికి కారణం ఏమిటి?"

"గత కొద్దిసంవత్సరాలుగా ఈ బిజినెస్ గొడవలలో మానసికంగా, శారీరకంగా బాగా అలసిపోయాను లక్ష్మీ. కాసింత విశ్రాంతి తీసుకోవాలనిపించింది. ఎవరి దగ్గరయితే నాకు ప్రశాంతత దొరుకుతుందా అని ఆలోచిస్తే వెంటనే నువ్వు గుర్తుకు వచ్చావు. అందుకే ఇలా ఇక్కడికి... బిజినెస్ గొడవలకు దూరంగా..."

ఆమెకు గుటకపడటం కొద్దిగా కష్టమయింది. ఆమె మౌనిగా మారింది.

అతడికి కూడా వెంటనే ఏం మాట్లాడాలో అర్థంకాలేదు. ఏమీ తోచక టేబుల్‌మీద ఉన్న ఆరోజు పేపర్ అందుకున్నాడు.

హెడ్‌లైన్స్‌లో ఉందా వార్త... నిన్నటి బంద్ గురించి!

'క్రితంరోజు బంద్‌వలన పౌరజీవనం స్తంభించిపోయిందట. కొన్ని ప్రాంతాలలో ట్రాన్స్‌పోర్టేషన్ ఆగిపోయింది. రైళ్ల రాకపోకలు ఆగిపోయాయి. అక్కడక్కడా కొద్దిగా ఉద్రిక్తత తలెత్తినా, చాలావరకూ బంద్ ప్రశాంతంగా జరిగింది...'

అతడు సీరియస్‌గా చదువుతుండటంతో, తమ మధ్య ఏర్పడిన నిశ్శబ్దపు గేప్‌ని ఆమె భరించలేకపోయింది. అందుకే "ఏమిటి చదువుతున్నారు?" నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ ప్రశ్నించింది.

శ్రీనివాస్ తలెత్తి చూశాడామెవంక "ఇదా...? నిన్నటి బంద్ గురించిన వార్త" చెప్పాడు.

ఆ న్యూస్ ఉదయమే చదివింది ఆమె. "ఏమిటో ఈమధ్య దేశమంతా ఒకటే బంద్‌లు. ప్రతి చిన్న విషయానికీ లీడర్స్ బంద్‌లు చేయడం నేర్చుకుంటున్నారు..." అన్నదామె.

అతడు అదోలా నవ్వాడు.

"ఎందుకు నవ్వుతున్నారు?"

"నువ్వు లీడర్ అనేపదం వాడితేనూ?... నలుగురిని పోగేసిన ప్రతి ఒక్కడూ లీడరేనా?" అరనిముషం తర్వాత అతడే అన్నాడు. "ఏదేమయినా ఈ బంద్‌లవలన జనం చాలా ఇబ్బందులపాలవుతున్నారు"

ఆమె ఆ టాపిక్ ఇష్టం లేనట్టుగా "పోనివ్వండి. బంద్‌లు, లీడర్ల గొడవ మనకెందుకు?" అంది పెదవి విరిచేస్తూ.

"అది తప్పు లక్ష్మీ!... ఈ ప్రపంచంలో చాలారకాల సమస్యలున్నాయి. వాటిలో ఎక్కువశాతం కొద్దిమంది స్వార్థపరులవలన క్రియేట్ చేయబడినవే! ఇలా క్రియేట్ చేయబడిన సమస్యల గురించి మనం అంతగా పట్టించుకోం. ఎందుకంటే- ఆ సమస్య 'ప్రస్తుతం' మనల్ని 'అంతగా' ఇబ్బంది పెట్టడంలేదు. కాబట్టి. కాని నిజంగానే ఆ సమస్య మనలను ఇబ్బందులకు గురిచేస్తే... అప్పుడు... అప్పుడు... ఆ సమస్య యొక్క వికృతరూపాన్ని మనం గుర్తిస్తాం. అప్పటికే మనం ఏమీ చేయలేని నిస్సహాయులం అయిఉంటాం..."

"ఆల్‌రైట్ ఈరోజునుండి బంద్‌లు గురించి, లీడర్ల గురించి తీవ్రంగా ఆలోచిస్తాను సరేనా?" వచ్చే నవ్వు ఆపుకుంటూ పలికింది లక్ష్మి.

తను సీరియస్‌గా మాట్లాడే విషయాన్ని ఆమె ఎగతాళిగా తీసుకుందని అర్థమయింది అతడికి. 'ఇటువంటి విషయాలు అనుభవంలోకి వస్తేగానీ, ఆ సమస్యల తీవ్రత అర్థంకాదు' మనసులోనే అనుకున్నాడు. టాపిక్‌ని అంతటితో కట్ చేశాడు.

ఐస్‌క్రీం తినడం పూర్తయింది.

అతడు టైం చూశాడు. ఐదున్నరయింది.

"ఏ సినిమాకెడదాం?" ప్రశ్నించాడు.

"చెప్పానుకదా! ఈ రోజంతా మీ ఇష్టం! మీరు ఎక్కడికి తీసుకువెళ్లినా ఏ సినిమా చూపించినా మీ కంపెనీ నేనుంటాను"

శ్రీనివాస్ ఆరుసెకనులు ఆలోచించాడు.

తర్వాత ''పద లక్ష్మీ'' అన్నాడు.

''ఎక్కడికి?''

''మొదట సినిమాకెళ్లాలని మనసులో అనుకున్నాను. కాని ఇప్పుడు పార్క్‌కి వెళ్లడానికి డిసైడ్ చేశాను. పార్క్‌లో ఎక్కడయినా ఓచోట కూర్చుని ప్రశాంతంగా కబుర్లు చెప్పుకుందాం''

''సినిమా ఎందుకు కాన్సిల్ చేశారు?''

''సినిమా థియేటర్‌లో మనం మాట్లాడుకునే అవకాశంలేదు. అదే పార్క్‌లో అయితే మరో మూడుగంటలు నీతో మాట్లాడే అవకాశం దొరుకుతుందికదా?''

ఆమె బదులు పలుకలేదు. శ్రీనివాస్ పలికే ప్రతి మాటా ఆమె హృదయాన్ని కొద్దికొద్దిగా కరిగిస్తూ ఉంది.

ఇద్దరూ కారులో పార్క్‌కి వెళ్ళారు. పార్కులో దూరంగా నడిచివెళ్లి ఓ మూలగా ఉన్న పొదచాటున కూర్చున్నారు.

సూర్యుడు అప్పుడే అస్తమిస్తూ ఉన్నాడు. ఆకాశం ఒడిలో వాలేందుకు సూర్యుడు తొందరపడుతున్నట్టే, ప్రియురాలి ఒడిలో వాలేందుకు అక్కడ కూర్చుని ఉన్న ప్రతి యువకుడి మనసూ ఆతృతపడుతోంది.

శ్రీనివాస్ ఆమెకు రెండడుగుల దూరంలో కూర్చుని ఉన్నాడు. దూరంగా ఉన్నప్పుడు ఆప్తులను కలిస్తే ఎన్నో మాట్లాడాలనుకుంటారు. తీరా కలిశాక- ఏం మాట్లాడాలో తెలియని పరిస్థితి ఏర్పడుతుంది. ప్రస్తుతం వారిద్దరి మధ్యా ఏర్పడినస్థితి అలాంటిదే! నిశ్శబ్దం- ఇద్దరి మధ్యా.

కొద్ది నిమిషాలు మౌనంగానే సాగిపోయాయి. కోయిలమ్మ మూగగా, గోరువంక పరధ్యాసగా... కాలమా! నువ్వు మాత్రం ఎవ్వరికోసమూ ఆగవు కదా!

ఎవరో జంట తమ వెంట పసిపాపను తీసుకువచ్చినట్టున్నారు. పాప దేనికో మారాం చేస్తోంది. ఆ తల్లి ఏడ్చే బిడ్డను సముదాయిస్తోంది. ''ఏయ్! ఊరుకో... ఊరుకోమ్మా...'' ఆ బిడ్డ ఎంతసేపటికీ తన ఏడుపు ఆపడంలేదు.

అతడు కొద్దిసమయంపాటు ఆ పాప ఏడుపు ఆలకించాక, ఆమెతో అన్నాడు. ''లక్ష్మీ! కొద్దిరోజులు తర్వాత నువ్వూ నీ బిడ్డను అలా సముదాయించవలసివస్తుందికదూ?''

''తప్పదుకదా!'' నవ్విందామె. లక్ష్మి నవ్వితే నిజంగా చాలా అందంగా ఉంటుంది మనసులోనే అనుకున్నాడతడు.

''పుట్టబోయే పాపాయికి ఏంపేరు పెట్టాలనుకుంటున్నావు?''

''అంటే నాకు పుట్టబోయేది ఆడపిల్లేనని డిసైడ్ చేశావా?''

''తప్పకుండా ఆడపిల్లే! ఆ విషయం ఖచ్చితంగా చెప్పగలను'' అని ఆగి ''మరి పాపాయికి ఏంపేరు పెట్టాలనుకుంటున్నావు?'' అడిగాడు.

''ఏమో నేనింకా పాపాయికి పెట్టబోయే పేరు గురించి ఆలోచించనేలేదు'' కొద్దిక్షణాల తర్వాత ఆమే అడిగింది. ''పోనీ మీరు చెప్పండి. పాపాయికి ఏం పేరు పెడదాం?''

అతడు విరక్తిగా పెదవులు కదిలించాడు. ''పాపాయికి పేరు పెట్టే హక్కు నాకెక్కడిది? ఆ హక్కు కలవారు, నువ్వూ మీవారు''

''హక్కుల గురించి కాకపోయినా, మీకు నచ్చిన పేరు ఏదయినా చెప్పండి''

''చెప్పను... నేను చెప్పే పేరు మీవారికి నచ్చకపోవచ్చు. ఐ డోంట్ లైక్ ఇట్''

ఆమె కొద్దిక్షణాలు బదులు చెప్పలేకపోయింది. తర్వాత ''ఏమండీ- ఆంటీకి పిల్లలంటే ఇష్టం. మీరూ... మీరూ పెళ్లిచేసుకోకూడదూ?''

''ఇంతకుముందు చాలాసార్లు ఈ మాట అడిగావు? కాని ఏంచేయను- పెళ్లంటే నాకు ఇంట్రెస్ట్ కలగడంలేదు''

''ఎందుకని?''

''కారణం నాకే తెలియదు'' ఆకాశంలో అప్పుడే వెలగడం మొదలయిన నక్షత్రాలవంక చూస్తూ పలికాడు అతడు.

కారణం అతడికి తెలియక కాదు. చెప్పడం ఇష్టంలేదు... అది ఆమెకూ అర్థమయింది.

పల్లీలు అమ్మే కుర్రవాడిని పిలిచాడు అతడు. పల్లీలు కొన్నాడు. ''ఇలా నీతో కూర్చుని

పల్లీలు తింటూ కబుర్లు చెప్పుకుని చాలా సంవత్సరాలయింది. తిరిగి ఇప్పుడు..."

ఆమె మాట్లాడలేదు.

అతడే అన్నాడు. "ఈ ప్రపంచం మొత్తం డబ్బుకి ఎందుకింత విలువనిస్తుందో నాకిప్పటికీ అర్థం కావడంలేదు లక్ష్మీ! డబ్బు అధికారాన్ని, అహంకారాన్ని సౌకర్యాలను ఇస్తుందేమో గానీ, ఆత్మతృప్తిని ఇవ్వలేదు. ఆ సంతృప్తి కోసం నేను ఎంతగా వ్యధపడుతున్నానో ఎవ్వరికీ అర్థంకాదు"

ఆమె జాలిగా చూసిందాతడివంక.

ఎనిమిదవుతుండగా అతడు పైకి లేచాడు. "వెళ్దామా లక్ష్మీ"

తలూపిందామె. అతిభారంగా పైకి లేచింది. అతడు తన చేయి ఆమెకు అందివ్వబోయి కూడా ఎందుకనో వెనక్కు తీసుకున్నాడు.

హోటల్‌లో డిన్నర్ తీసుకున్నారు. అతడు ఆమెను ఇంటి దగ్గర డ్రాప్ చేశాడు. "చాలా కాలం తర్వాత ఈరోజు నాకెంతో ఆనందంగా ఉంది" అన్నాడు.

ఆమె నవ్వి "మళ్లీ ఎప్పుడు కలుస్తారు?" ప్రశ్నించింది.

"చెప్పానుగా! ఈ వారంరోజులూ ఎక్కువ టైమ్ నీ సమక్షంలోనే... రేపు సాయంత్రం వస్తాను" చెప్పాడు అతడు.

కారు ముందుకు సాగిపోయింది.

అతడికి చాలా సంతోషంగా ఉంది. తనకు ప్రియమయిన లక్ష్మితో కలసి తిరిగాడీరోజు. ఆనందంగా గెస్ట్‌హౌస్‌వైపు కారు పోనివ్వసాగాడు.



రెండోరోజు కూడా సమ్మె ప్రశాంతంగా జరిగింది.

సమ్మె మిల్ ప్రొడక్షన్‌మీద ఎలాంటి ప్రభావం చూపలేదు.

తమ సమ్మెవలన ఉత్పత్తికి అంతరాయం కలగకపోవడంతో సమ్మెచేసే కార్మికులు కొద్దిగా నిరాశపడ్డారు. తన కార్మికులలో ఏర్పడిన నిరాశను రాజశేఖరం కూడా గుర్తించాడు.

'సమ్మె చేసే కార్మికులలో ఎప్పుడూ నిరాశ ఏర్పడకూడదన్నది' అతడికి తెలిసిన వాస్తవమే! నిరాశపడిన కార్మికులు మెల్లగా డ్యూటీలకు హాజరుకావచ్చు. ఇది తన ప్రిస్టేజ్ క్వశ్చన్! ఎట్టి పరిస్థితిలోనూ అలా జరగడానికి వీలులేదు....'

అతడారాత్రి ఆంజనేయులునాయుడిని కలిశాడు. "మీ మాట వలననే మేము సమ్మె మొదలుపెట్టాం. అయితే- రెండోరోజుకే వర్కర్స్ నీరసపడిపోయారు. మరో రెండు రోజులలో అందరూ డ్యూటీలకు హాజరయ్యేలా ఉన్నారు"

ఆంజనేయులునాయుడు నిశ్చింతగా నవ్వాడు. "నువ్వు పాలిటిక్స్‌లో నేర్చుకోవలసింది చాలా ఉంది రాజశేఖరం! రెండోరోజుకే వారు నీరసపడిపోయారని నువ్వు వెనుకడుగు వేస్తే, ఇక నువ్వు నాయకుడిగా **ఎందుకు?**.. కార్మికులు లేదా జనం నీరసపడిపోయేటప్పుడు వారిని మాటలతోనో, చేతలతోనో ఉద్రేకపరచగలిగినవాడే నాయకుడిగా రాణించగలడు. వారు ఇప్పుడు నీరసపడ్డారన్నావు- జస్ట్ నాయకుడిగా నువ్విప్పుడు చేయవలసిందేమిటంటే, వారిలో ఆవేశం కలిగించు. ఆవేశం మనిషిని ఆలోచనారహితుడిగా చేయడమే కాదు, అన్ని నీరసాలనూ దూరం చేస్తుంది.

రాజశేఖరం అమాయకంగా అడిగాడు "నా వర్గాన్ని ఇప్పుడు ఆవేశపరచడం ఎలా?"

ఆంజనేయులునాయుడు అతడిని ఒక చిన్నపిల్లాడిని చూసినట్టుగా చూశాడు. తను కూడా ఒకప్పుడు ఇలాంటి సలహాలు పెద్దలను అడగటం గుర్తుకు వచ్చింది. "ఇది కూడా తెలియదా రాజశేఖరం! అయినా

విను! నువ్వు ఇప్పుడు నీ వర్కర్స్‌కి చెప్పు- మీ సమ్మె ఫెయిల్ అయ్యేందుకు మిగతా రెండు యూనియన్‌లే కారణం అని! అవసరమయితే వారిని దెబ్బకొట్టయినా, డ్యూటీలకు హాజరుకాకుండా చేద్దామని రెచ్చగొట్టు. జస్ట్ టెన్షన్ క్రియేట్ చెయ్యి. అవసరపడితే రక్తపాతం జరిగినా పర్వాలేదు. ఈ సమ్మె సక్సెస్ కావాలి. టెన్షన్ క్రియేట్ అయితే అటు మేనేజ్‌మెంట్ కూడా భయపడుతుంది... ఎలాగయినా ఈ సమ్మె సక్సెస్ కావాలి. అప్పుడే నీకూ, నాకూ, మన పార్టీకీ పేరు వస్తుంది... గుర్తుంచుకో...'' చెప్పాడు ఆంజనేయులునాయుడు.

ఆ క్షణం రాజశేఖరానికి అతడు గీతాబోధ చేస్తున్న శ్రీ కృష్ణుడిలా కనిపించాడు.

''మీరు చెప్పినట్టే చేస్తాను... ఇక చూడండి...'' రాజశేఖరం పైకి లేచాడు. అతడికి నమస్కరించి ఇవతలికి వచ్చాడు.

ఆకాశంలో చంద్రుడు మబ్బుల చాటుకి తప్పుకున్నాడు.

మూడోరోజు సమ్మె మొదలయింది.

ఆరోజు ఉదయమే రాజశేఖరం తన కార్మికులతో మంతనాలు జరిపాడు. ఆంజనేయులు నాయుడు చెప్పినట్టే వారిని ఆవేశపరిచాడు. సాటి యూనియన్‌ల వర్కర్స్‌మీద కసిని పెంచాడు.

చిన్న అగ్గిపుల్ల చాలు, మహాజ్వాలను రగిలించేందుకు. కాని ఆ జ్వాలను ఆపడానికి చాలా కష్టపడవలసివస్తుంది.

అగ్గి రాజుకుంటే ఆహుతులు తప్పవు.

ఆ రాత్రి రాజశేఖరం, రమేష్ తదితరులను వెంటేసుకుని కార్మికుల ఇళ్లకు వెళ్లాడు. సుమారుగా రెండువందలమంది కార్మికులను బెదిరించాడు. ''రేపు కొట్లాటలు జరుగుతాయి. మీరు కనుక డ్యూటీలకు హాజరు కాదలచుకుంటే రండి. అయితే మా వర్కర్స్ ఆవేశంమీద ఉన్నారు. వారు రేపు ఏం చేస్తారో నేను చెప్పలేను. మీ ఇష్టం...'' అంటూ.

ఇంట్లో మగవారు లేకపోతే వారు ఆడవారిని మరింత భయపెట్టారు. ''చూడండమ్మా! మమ్మల్ని మేనేజ్‌మెంట్ అనవసరంగా సస్పెండ్ చేసింది. అందుకే మేము సమ్మె చేస్తున్నాం. మా సమ్మెను బలపరచవలసింది పోయి, వారిలా డ్యూటీలకు హాజరుకావడం బాగాలేదు. ఈ విషయంలో మా వర్కర్స్ చాలా కసిగా ఉన్నారు. అవసరపడితే రక్తపాతం సృష్టించయినా సమ్మెను సక్సెస్ చేయాలనుకుంటున్నారు. నా ఉద్దేశం- రేపు ఉదయం మా యూనియన్ కార్మికులు తప్పకుండా కొంత మంది తలలు పగలకొడతారు ఆ దెబ్బలు తినబోయే వ్యక్తి మీవారు కాకుండా చూసుకోండి''

అలాంటి మాటలు ఏ స్త్రీని మాత్రం భయపెట్టకుండా ఉంటాయి? తమ భర్తలు ఇళ్ళు చేరుకున్నాక చాలామంది వారిని మరునటి రోజు డ్యూటీలకు హాజరుకావద్దని ప్రాధేయపడ్డారు... ఆ ప్రయత్నంలో కొంతమంది స్త్రీలు విజయం సాధించారు కూడా!

ఆ రాత్రి రాజశేఖరం యూనియన్ మనుష్యులు జగన్నాధం యూనియన్ కార్మికుడిని ఒకడిని రక్తం కారేలా కొట్టారు కూడా. అదెలా జరిగిందంటే- రాజశేఖరం అప్పటివరకూ బెదిరిస్తూ వస్తున్న కార్మికులందరిలానే ఆ వ్యక్తిని కూడా బెదిరించాడు, ఆ కార్మికుడు జగన్నాధానికి చాలా సన్నిహితుడు. రాజశేఖరం బెదిరింపును అతడు చాలా కేర్‌లెస్‌గా తీసుకున్నాడు. 'కొట్లాట అంటూ జరిగితే మా యూనియన్ ముందు మీ వాళ్లెలాగూ ఆగలేరు. మాది చాలా పెద్ద యూనియన్. కాబట్టి మీరే కాస్త జాగ్రత్తగా ఉండండి'' అని హెచ్చరించాడు

అతడన్న మాటలో తప్పులేదు. అయితే- రాజశేఖరం మనసులో టెన్షన్ క్రియేట్ చేయాలని ఉంది. అందుకే అతడు దీన్నో అవకాశంగా తీసుకోదలచుకున్నాడు. మాటలు పెంచాడు. మాటలతో అతడిని రెచ్చగొట్టాడు. తనూ రెచ్చిపోయాడు. తొలిదెబ్బ తనే వేశాడు. రాజశేఖరం అనుచరులు కూడా తలా ఒకదెబ్బ వేశారు. అవతలివ్యక్తి ఒక్కడే! వీరు అధిక సంఖ్యాకులు అతడికి బాగా దెబ్బలు తగిలాయి.

ఆంజనేయులునాయుడు చెప్పినట్టే చేశానని సంబరపడ్డాడు రాజశేఖరం. చేతులు దులుపుకుని ఠీవిగా ఆచోటనుండి వెళ్లిపోయా

డు.

అగ్గి రాజుకుంది. ఈ జ్వాలకు బలిపశువు లు ఎంతమందో?

అర్ధగంట తర్వాత ఈ వార్త జగన్నాధానికి చేరింది. అతడు నిప్పులు కక్కాడు. ''రాజశేఖరం... వాడి... వాడి అంతు చూస్తాను'' అరిచాడు. రాత్రికి రాత్రే పదిమందిని వెంటేసుకుని, రాజశేఖరం ఇంటిమీదికి దాడికి వెళ్ళబోయాడు. కాని ఆలోచనాపరులయిన యువకులు కొందరు అతడిని ఆపారు.

''జగన్నాధం! దెబ్బకు దెబ్బ తీయడం పెద్ద కష్టం కాదు. మన యూనియన్‌ముందు వాడు మేకపిల్లలాంటివాడు. వాడేదో తొందరపడ్డాడని మనమూ తొందరపడకూడదు. మరో యూనియన్ లీడర్‌ని దెబ్బకొడితే- ఆ తర్వాత ఎలాంటి పరిణామాలు జరుగుతాయన్నది కూడా మనం కొద్దిగా ఆలోచించాలి. రాజశేఖరం మన కార్మికుడిని కొట్టాడూ అంటే- వెనకాముందు ఆలోచించకుండానే చేసి ఉండడు. తమ పార్టీ పెద్దలెవరో అతడికి సపోర్ట్‌గా నిలబడి ఇలా చేయమని చెప్పి వుండొచ్చు...''

''ఏదేమయినా నేను వాడిని కొట్టితీరాలి''...

''అప్పుడు, ఇవి యూనియన్ గొడవలనుండి పార్టీ గొడవలుగా మారుతాయి. వాడి యూనియన్ ఈ మిల్‌లో చిన్నదే కావచ్చు. కాని వారి పార్టీని తక్కువగా అంచనా వేయకూడదు. మన పార్టీకి పార్లమెంట్‌లో రెండొందల సీట్లు ఉంటే, వారి పార్టీకి వంద సీట్లున్నాయన్నది మనం మరచిపోకూడదు...''

జగన్నాధం కొద్దిగా తగ్గాడు. ''అయితే ఇప్పుడు మనమేం చేద్దాం?''

''ఈ విషయాన్ని మన పార్టీ పెద్దల దగ్గరకు తీసుకువెళ్దాం. వారెలా చెపితే అలా చేద్దాం''

జగన్నాధం అయిష్టంగానయినా ఒప్పుకోక తప్పలేదు.

ఆరాత్రే వారు తమ పార్టీ కార్యదర్శి రవిరాజుని కలుసుకున్నారు. పరిస్థితి మొత్తం వివరించి చెప్పారు. నలభైఏళ్ల రవిరాజు వారు చెప్పింది శ్రద్ధగా విన్నాడు. తన తలమీద వెంట్రుకలమల్లే ఆయన కూడా రాజకీయాలలో పండిపోయాడు. లోతయిన తన కళ్లలాగా చాలా లోతుగా ఆలోచించి నిర్ణయాలు తీసుకుంటాడు. నుదుటమీది ముడతలులాగా చాలా ఎత్తుపల్లాలు చూశాడతడు. మనిషి పొట్టివాడే కాని రాజకీయంలో గట్టివాడని అందరూ అంటుంటారు.

జగన్నాధం చెప్పినదంతా విన్నాక అతడు అన్నాడు. ''నువ్వు తొందరపడి ఆ రాజశేఖరాన్ని కొట్టకు. నాకు తెలిసినంతలో ఇందులో వాడి తప్పు కొద్దే! దీని వెనుక ఉండేవాడు- ఆంజనేయులునాయుడు. నాకు ఇంతకు ముందే ఆ ఇన్‌ఫర్మేషన్ వచ్చింది. వాడు... ఆ ఆంజనేయులునాయుడు చాలా స్ట్రీడయ్యాడు. గుండెలు తీసిన బంటులా రక్తపాతం సృష్టించేస్తున్నాడు. మొన్నటికి మొన్న కాలేజీ ఎలక్షన్స్‌లో మన పార్టీ కుర్రాడొకడిని చంపించేశాడు. పల్లెల్లో రాజకీయాలలో ఉద్రేకాలు సృష్టించేస్తున్నాడు. ముఠాతగాదాలు పెంచేసి, అవతల పార్టీవారు మాట్లాడితే కొట్టేయమని తన పార్టీవారికి చెపుతున్నాడు. ఇలాంటివాడు బతికివుంటే ఇంకా చాలా ఘోరాలు జరుగుతాయి కాబట్టి వాడిని ఎత్తేస్తే పరిస్థితులన్నీ ఎక్కడివక్కడ సద్దుమణుగుతాయని నా ఉద్దేశం! అప్పుడు ఈ రాజశేఖరం లాంటివారంతా కుక్కినపేనుల్లా ఉండిపోతారని నా నమ్మకం...!

రవిరాజు కొద్దిగా కూడా మనసులోని మాట బయటకు రానివ్వడు. కాని ఆ క్షణం అతడలా ఫ్రాంక్‌గా మనసులోని మాట బయటకు చెప్పాడంటే, అప్పటికే అతడు అవతలివ్యక్తివలన చాలా విసిగిపోయి ఉండాలి. అంతేకాదు, అప్పటికే అతడు ఒక నిర్ణయం తీసుకుని కూడా ఉండొచ్చు.

''... మీరు రేపు తొందపడకండి. మనం దెబ్బంటూ కొడితే కొమ్మల్ని కాదు, మొదలే నరికేద్దాం... సరేనా!''

వారు మౌనంగా ఉన్నారు.

''ఇక మీరు వెళ్లిరండి. జాగ్రత్త... చెప్పింది గుర్తుందికదా!''

తలలూపారు వారంతా. అక్కడినుండి వెనుతిరిగారు.

చాలా చిన్న సమస్యగా మొదలయింది.

ఒక కార్మికుడిని. పి.ఓ. సస్పెండ్ చేయడం ఆ సమస్య! అది చిలికి చిలికి గాలివానలా మారింది. చివరికి రెండు రాజకీయపార్టీల మధ్య గొడవలా రూపుదిద్దుకుంది.

సమ్మె మొదలయి మూడురోజులు గడిచిపోయాయి. ఆ సమ్మె గురించి శ్రీనివాస్‌కి కొద్దిగా కూడా తెలియదు. అతడు చాలాకాలం తర్వాత విశ్రాంతిగా, ఒకనాడు తాను మనసులో ఆరాధించిన లక్ష్మితో కబుర్లు, షికార్ల మధ్య ప్రశాంతంగా గడుపుతున్నాడు. కనీసం మిల్ వైపు వెళ్లడంగానీ, తన జి.యం.పి.ఓ.లకు ఫోన్ చేయడంగానీ చేయలేదు. అదే అతడు చేసిన పొరపాటు!

★ ★ ★

గత రెండురోజులుగా జె.యస్.ని కలవాలని, ఆయనకు ఇన్విటేషన్ అందించాలని అనుకుంటూ కూడా రాలేకపోయాడు సోమనాథ్! ఎలాగో వీలు చూసుకుని ఆ ఉదయమే జె.యస్. గెస్ట్‌హౌస్‌కి వెళ్లాడు.

గేటు దాటాక వాచ్‌మెన్‌ని ప్రశ్నించాడు. "సార్ లోపల ఉన్నారా?"

"ఉన్నారు సార్" బదులిచ్చాడు వాచ్‌మెన్.

"అతడు లోపలికి వెళితే, హాలులోనే కూర్చుని ఉన్నాడు అతడు. ఏవో పేపర్స్ ఏకాగ్రతగా చదువుతున్నాడు. చేస్తున్నపని ఏదయినా అందులో పూర్తిగా లీనమవటం చాలా కొద్దిమందికి మాత్రమే సాధ్యం! అలా లీనమయి పని చేయగలిగినవారు తాము అనుకున్నది చాలా సులభంగా సాధించుకోగలరు.

"గుడ్‌మార్నింగ్ సర్" విష్‌చేశాడు సోమనాథ్.

అతడు తలెత్తి సోమనాథ్‌వంక చూశాడు. పెదాలు విడివడీ విడివడనట్టుగా కదిలించాడు. చెయ్యి చూపించాడు కూర్చోమన్నట్టుగా! సోమనాథ్ సోఫాలో కూర్చున్నాడు.

అతడు సోమనాథ్‌ని ప్రశ్నించలేదు. ఎందుకు వచ్చావని? సోమనాథ్ చెప్పాడు. "సార్! ఎనిమిదో తారీఖున మా అమ్మాయి పెళ్లి నిశ్చయమయింది. ఇన్విటేషన్ ఇది! మీరు పెళ్లికి తప్పకుండా రావాలి..."

"అలాగా" అతడు వెడ్డింగ్‌కార్డ్ అందుకున్నాడు. ఎనిమిదో తారీఖున సాయంత్రం వెళ్లాలనుకుంటున్నాను... మీ పెళ్లికి అటెండ్ అయ్యాక వెళ్తాను"

"థాంక్స్ సార్"

అతడు అరనిమిషంపాటు మౌనంగా ఉన్నాక జేబులోనుండి చెక్‌బుక్ తీసి సంఖ్య వేసి కింద సంతకం చేసి ఇచ్చాడు.

అది అందుకుని దానివంక చూశాడు సోమనాథ్! పదివేల రూపాయలకు చెక్కు అది...

"ఎందుకు సార్" ప్రశ్నించాడు సోమనాథ్!

"మీ అమ్మాయి పెళ్లికి నా గిఫ్ట్ చెక్ అది"

సోమనాథ్ జె.యస్. దానగుణాన్ని గురించి చాలా వినివున్నాడు ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నాడు. "ఈయన ఇలాంటి భారీ కానుకలతోనే తనవారిలో భయమూ- భక్తి కలిగించుకుంటుంటాడు. అందుకే జె.యస్. దగ్గర పనిచేయాలని ప్రతిఒక్కరూ కోరుకుంటుంటారు' మనసులోనే అనుకున్నాడు. సోమనాథ్‌కి చాలా సంతోషం కలిగించింది. జె.యస్. మంచితనాన్ని మెచ్చుకున్నాడు కూడా! 'మాట క్లుప్తమే గానీ, మనసు మహా మంచిది'

"ప్రస్తుతం సెలవుమీద ఉన్నారుకదూ?"

"అవును సార్! అమ్మాయి పెళ్లికదూ... పది రోజులు సెలవు పెట్టాను"

అతడు తలూపాడు. "మిల్‌లో ప్రాబ్లమ్స్ ఏవీ లేవుకదూ?"

"సోమనాథ్ ఆ క్షణాన కొద్దిగా తటపటాయించాడు. 'ప్రస్తుతం మిల్‌లో జరుగుతున్న గొడవలు ఈయనకు చెప్పేద్దామా...?' ఆయన ప్రశాంతత చెడగొట్టడం ఇష్టం లేకపోయింది. బలవంతాన 'లేవు సార్' అన్నాడు.

అతడు మౌనంగా ఉన్నాడు. అవతలివ్యక్తి మౌనంగా ఉంటే ఎదుట కూర్చున్నవ్యక్తి అనీజీగా ఫీలవుతాడు. అనీజీగా కూర్చోలేరు ఎవరూ... కాఫీ వచ్చింది. తాగాక సోమనాథ్ పైకి లేచాడు. "వెళ్లొస్తాను సార్"

తలూపాడు అతడు. అదే శ్రీనివాస్‌లోని గొప్పతనం- ఎవరినీ తన ముందు ఎక్కువసేపు కూర్చోనివ్వడు. తనతో చనువు పెంచుకోని

వ్వడు.

సోమనాథ్ ఇవతలికి వచ్చేశాడు. అతడు ఇంటికి తిరిగి వచ్చేసరికి చతుర్వేది హాలులోనే కూర్చుని తన కోసమే కాబోలు ఎదురుచూస్తున్నాడు. "గుడ్‌మార్నింగ్ సర్" విష్ చేశాడు.

"హలో చతుర్వేది" అతడు చతుర్వేది పక్కనే కూర్చున్నాడు. "ఏమిటి విశేషాలు?" ప్రశ్నించాడు.

"మీరోసారి మిల్ దగ్గరకు వస్తే బాగుంటుందేమో సార్"

"వాట్ హేపండ్?" కనుబొమలు! ముడి వేసి ప్రశ్నించాడు సోమనాథ్!

"సమ్మె పెడదారులు తొక్కుతోంది సార్. రాజశేఖరం యూనియన్‌వాళ్లు రక్తపాతం సృష్టించయినా స్ట్రయిక్ సక్సెస్ అయ్యేట్లు చూడాలని ప్రయత్నిస్తున్నారు. రాత్రి వారు జగన్నాధం యూనియన్ కార్మికుడిని రక్తంకారేలా కొట్టారట. ఇప్పుడు వారు, వీరు ఏం చేయబోతున్నారో. ఇరువర్గాలూ కొట్లాటకు దిగితే పరిస్థితి చెయ్యిదాటిపోతుంది.... అందులోనూ జె.యస్. ఇక్కడే ఉన్నాడు. ఆయనవరకూ ఈ న్యూస్ వెళితే తనకు ముందుగా తెలియచేయనందుకు కోప్పడవచ్చు..." అన్నాడు చతుర్వేది.

"నిజమే..." ఒప్పుకున్నాడు సోమనాథ్. "అయితే ఇప్పుడేం చేద్దామంటావు?"

"ముందు మీరు మిల్‌వరకూ రండి సార్! అక్కడి పరిస్థితి అర్థం చేసుకున్నాక సలహా ఇస్తే నేను ఫాలో అవుతాను"

సోమనాథ్ చేయవలసిన పెళ్లిపనులు చాలా ఉన్నాయి. సెలవులో ఉన్నప్పటికీ, మిల్ పరిస్థితి కూడా తను చూడవలసిఉంటోంది"

"ఆల్‌రైట్! వస్తున్నాను" చెప్పాడు సోమనాథ్.

"మనం అక్కడికి వెళ్లేసరికి పరిస్థితి ఎలా ఉంటుందో, ముందుగా మనం పోలీసులకు ఫోన్‌చేసి ప్రొటక్షన్ ఏర్పాటు చేసుకుని వెళితే బాగుంటుందేమో?"

"గుడ్ ఐడియా" సోమనాథ్ పక్కనే ఉన్న ఫోన్ దగ్గరకు వెళ్లాడు. మిల్ ఉన్న రూరల్ ఏరియా పోలీస్‌స్టేషన్‌కి ఫోన్‌చేసి మిల్‌లో జరుగుతున్న సమ్మె గురించి తెలియచేశాడు. తమకు ప్రొటక్షన్ కావాలని కోరాడు.

'మరో అర్థగంటలో పదిమంది పోలీసులు మిల్ ముందు ఉంటారని తెలియచేశాడు పోలీస్ ఇన్‌స్పెక్టర్!

సోమనాథ్ రెడీఅయి బయలుదేరేసరికి ముప్పావుగంట పట్టింది. జనరల్ మేనేజర్, పర్సనల్ ఆఫీసర్లిద్దరూ కారులో మిల్‌కు బయలుదేరారు. దారిలో సోమనాథ్ అతడితో చెప్పాడు. "ఉదయమే నేను జె.యస్. దగ్గరకు వెళ్లి వెడ్డింగ్‌కార్డ్స్ ఇచ్చి వస్తున్నాను. ఆయన ఫ్యాక్టరీ పొజిషన్ గురించి అడిగితే బాగుందనే చెప్పాను"

"మనం పొరపాటు చేశామేమో! ఆయన ఎలాగూ టౌన్‌లోనే ఉన్నాడు కాబట్టి మొదటే ఆయనకీ విషయం తెలియజేసి ఉంటే బాగుండేది"

"ఇప్పుడు మాత్రం మునిగిపోయేదేముంది? అక్కడ పరిస్థితి చూసివచ్చి, ఆయనకు ఇన్‌ఫార్మ్ చేద్దాం. ఏమంటావు?"

మౌనంగా తలూపాడు చతుర్వేది.

వారు మిల్‌గేటు సమీపించే సమయంలో కొద్దిగా భయపడ్డారు.

కారుని చూడగానే టెంట్ దగ్గర కూర్చుని ఉన్న కార్మికులు ఒక్కపెట్టున అరిచారు "మేనేజ్‌మెంట్ డౌన్ డౌన్"- "చతుర్వేది, సోమనాథ్‌లు నశించాలి"

దారిలో కొంతమంది కారును చుట్టుముట్టబోయారుగానీ, పోలీసులు కార్మికులను కారు దగ్గరకు రానివ్వలేదు. కారు లోపలికి వెళ్లింది.

జి.యమ్., పి.ఓ. ఆఫీసురూంలో కూర్చున్నారు. సూపర్‌వైజర్ శివరామ్‌ని పిలిపించారు. "ఎలా ఉంది సమ్మె ప్రభావం?"

"చాలామంది డ్యూటీలకు హాజరుకాలేదు సార్! నిన్నటి బెదిరింపులకు బాగా భయపడిపోయినట్టున్నారు. రేపు మరింతమంది కార్మికులు డ్యూటీకి హాజరు కాకపోవచ్చేమో..."

"ఎందుకని?" ప్రశ్నించాడు సోమనాథ్!

"ఈరోజు రాత్రి కూడా రాజశేఖరం రక్తపాతం సృష్టించే ఉద్దేశ్యంతోనే ఉన్నట్టు వినికి

డి... ఈరోజు వారు మరో కార్మికుడిని కొట్టడం అంటూ జరిగితే రేపు డ్యూటీలకు హాజరయ్యే వారి సంఖ్య బాగా తగ్గిపోతుంది''

''ఇప్పుడేం చేద్దాం?'' అసహనంగా అడిగాడు.

''రాజశేఖరంగాడిని అరెస్ట్ చేయించండి సార్! ఒకవ్యక్తి తల పగలకొట్టాడు. మరోవ్యక్తిని కొట్టాలని ప్లాన్ వేస్తున్నాడని రిపోర్ట్ చేయండి''

''వద్దొద్దు. అలా చేయడంవలన వాడి పార్టీ పెద్దలు రంగంలోనికి దిగే అవకాశం ఉంది. వాడిమీద సానుభూతి కురిపిస్తూ పేపర్ స్టేట్మెంట్స్ వస్తాయి. వాడికి అనవసరమయిన పబ్లిసిటీ ఇచ్చినట్టవుతుంది'' చెప్పాడు సోమనాథ్.

''మరెలా?''

''జె.యస్. టౌన్‌లోనే ఉన్నాడు. ఈ గొడవ పెద్దదయ్యాక ఆయనకు తెలిస్తే కోప్పడవచ్చు. అందుకే- ముందుగానే ఆయనను కలుసుకుని పరిస్థితి వివరించటం బాగుంటుందని నేను అనుకుంటున్నాను''

''మనం వెంటనే జె.యస్.ని కలవటం మంచిది'' చెప్పాడు చతుర్వేది.

సోమనాథ్ కుర్చీలోనుండి లేచాడు. మెట్లు దిగి కిందికి వచ్చాడు.

వారిద్దరూ కారులో కూర్చున్నారు.

కొద్దినిమిషాలలో వారి కారు జె.యస్. ఉండే గెస్ట్‌హౌస్ ముందు ఆగింది. సోమనాథ్ కారులో నుండే వాచ్‌మెన్‌ని పిలిచి అడిగాడు. ''సార్ ఉన్నారా?''

''లేరు సార్! ఉదయం మీ వెనుకే తనూ కారులో వెళ్ళిపోయారు''

''ఎక్కడికెళ్ళారో తెలుసా?''

''తెలియదు సార్! ఆయన ఎక్కువ సమయం బయటే గడుపుతున్నారు''

''ఎప్పుడొస్తారు?''

''ఏ అర్ధరాత్రివేళనో రావచ్చు''

సోమనాథ్ చతుర్వేది వంక చూశాడు.

చతుర్వేది మౌనంగా తలాడించాడు. కొద్ది సెకనులు తర్వాత ''సరే! మనం చేయగలిగింది ఏముంది...? రేపు వచ్చి కలుస్తాను'' అన్నాడు.

సోమనాథ్ కారు వెనుకకు తిప్పాడు. చతుర్వేదిని మిల్ దగ్గర వదిలి తను ఇంటికి వెళ్ళిపోయాడు. ''ఏదయినా అవసరంపడితే ఇంటికి ఫోన్ చెయ్యి'' వెళ్ళేముందు చెప్పాడు సోమనాథ్.

చతుర్వేది ఆఫీసులో కూర్చుని చాలాసార్లు జె.యస్. కోసం ఫోన్ చేశాడు. కాని ఆయన దొరకలేదు. సరే! ''ఈరోజు కాకపోతే రేపు కలవచ్చు. ఒక్కరోజులో ప్రాబ్లమ్ ఏముంది?'' అనుకున్నాడు.

★ ★ ★

''రేపటినుండి నేను హాస్పిటల్‌కి వెళ్ళడంలేదు''

''ఎందుకని?''

''భారం మరీ ఎక్కువయింది రాత్రి పెయిన్‌గా అనిపించింది కూడా...''

''డెలీవరీడేట్ దగ్గరపడిందికదా!'' చెప్పాడు అతడు.

''బహూశా ముందుగానే కాన్పయ్యే సూచనలు కనిపిస్తున్నాయి'' అంది లక్ష్మి.

''ఐసీ'' తలాడించాడు. ''మరి అవినాష్‌కి ముందుగానే రమ్మని ఫోన్ చేశావా?'' అడిగాడు.

''లేదు. నేను ఫోన్ చేసినా తను రాడు. అతడికి ఈ కాన్ఫరెన్స్‌లు- అవీ అంటే తగని పిచ్చి. తన సాటివారిలో గొప్పతనం కనపరచాలనుకుంటాడు''

''పోనీ నేను ఫోన్ చేస్తాను'' అతడు పైకిలేచి ఒకడుగు ముందుకు వేశాడు.

''వద్దొద్దు'' ఆమె కంగారుగా లేచి అతడి చెయ్యి పట్టుకుంది. ''అతడిని ఇబ్బంది పెట్టడం నాకిష్టంలేదు'' చెప్పిందామె.

అతడు ఆమెవంక రెండుక్షణాలపాటు అదోలా చూసి నిశ్శబ్దంగా కూర్చున్నాడు. ఆమె కూడా అతడి పక్కనే సోఫాలో కూర్చుంది. అతడి చెయ్యి ఇంకా ఆమె చేతిలోనే ఉంది. అతడు తన చేతిని మెల్లగా విడిపించుకున్నాడు.

సంధ్య చీకట్లు ముసురుకుంటున్నాయి. కి

టికీ పక్కనే నిలబడి ఉన్న నైట్‌క్వీన్ మొక్క తనొక పువ్వు అందించగలిగాననీ కాబోలు సంబరంగా తలూపుతోంది. "నేను కాఫీ తయారుచేస్తాను" లక్ష్మి పైకి లేచి వంటగదిలోనికి వెళ్లింది. అతడు సోఫాలోనే కూర్చుని కొద్దిసేపు పేపర్స్ తిరగేశాడు. కాని ఏమీ తోచకపోవడంతో లేచి తనూ వంటగదివైపు అడుగువేశాడు. వాకిట తలుపుకు భుజం ఆనించి ఆమెవైపే చూడసాగాడు.

లక్ష్మి గ్యాస్‌స్టవ్ ఆన్ చేసింది. పాలు గిన్నెలో పోసుకుని దానిమీద పెట్టింది. అతడిని చూసి "అక్కడ కూర్చోవడం బోరుగా ఉందా?" ప్రశ్నించింది.

తలూపాడు అతడు. ఆమె మౌనంగా తన పని చూసుకోసాగింది.

పాలు కాగాక రెండు గ్లాసులలో పోసి కాఫీపౌడర్, చక్కెర కలిపింది. అతడికో గ్లాసు అందించింది. "నువ్వూ గ్లాసు అందుకో" చెప్పాడు అతడు.

"వన్‌మినిట్! బియ్యం కడిగి స్టౌమీద పడేసి, తర్వాత విశ్రాంతిగా కాఫీ తాగుతాను" అనేసి, కిందనున్న బిందె అందుకోబోయింది.

"ఏయ్ లక్ష్మీ! ఆగాగు... ఆ బిందె నేనెత్తి నీళ్లు పోస్తాను" అతడు కిందనున్న నీటిబిందె ఎత్తుకుని బియ్యం గిన్నెలో వంచాడు.

"గర్భిణీస్త్రీలు బరువులు ఎత్తకూడదట" బిందెకింద పెట్టాక చెప్పాడు.

ఆమె నాలిక కొరుక్కుంది. "అయినా ఈ విషయం మీకెలా తెలుసు?" అడిగింది.

"నిన్న ఏదో మేగజైన్ చదువుతుంటే "గర్భిణీ స్త్రీలు- తీసుకోవలసిన జాగ్రత్తలు" అన్న హెడ్డింగ్ కనిపిస్తే ఆసక్తిగా చదివాను"

"ఆహా! అందులో ఏం వ్రాసి ఉంది" కాఫీ గ్లాసు అందుకుని సిప్ చేయసాగింది.

"గర్భిణీ స్త్రీలు బరువులు ఎత్తకూడదట. కంగారుగా ఉలికిపడి లేవకూడదట. అలాగే డాక్టర్‌ని రెగ్యులర్‌గా కలుస్తూ ఇంజక్షన్స్, మందులూ వాడాలట..." అతడు చెపుతుంటే కళ్లింతలు చేసుకుని విన్నదామె. చెప్పడం ఆపాక "ఇంతకీ గర్భిణీస్త్రీలు తీసుకోవలసిన జాగ్రత్తల గురించి మీరెందుకు చదివినట్టు?" తాగిన కాఫీ గ్లాసు పక్కనపెట్టింది ఆమె.

"ఆ హెడ్డింగ్ చూడగానే చప్పున నువ్వు గుర్తుకు వచ్చావు. అందుకని..."

విస్మయంగా చూసింది అతడివైపు? 'నేను నిరంతరం నీ మనసులో మెదలాడుతుంటే గానీ ఇది సాధ్యం కాదు' మనసులోనే అనుకుందామె. అది ఆనందమో, దుఃఖమో మాత్రం తెలియదు. మనసును కుదిపివేస్తుంది... కొద్ది క్షణాలపాటు ఇద్దరి మధ్యా నిశ్శబ్దం!

అతడు అక్కడే చాలాసేపు నిలబడ్డాడు. ఆమె మౌనంగా ఉండిపోవడం చూసి "లక్ష్మీ! నా మాటలు నిన్నేమయినా నొప్పించాయా?" అడిగాడు.

"నేనో! అలాంటిదేమీ లేదు... అసలు మీకెందుకొచ్చిందా అనుమానం?" కంగారుగా ప్రశ్నించింది.

"నువ్వు ఒక్కసారిగా మౌనంగా అయిపోతేనూ..."

"అది... అది... ఏవో ఆలోచనలలోపడి..." సంజాయిషీగా పలికింది.

కొద్దిక్షణాల విరామం తర్వాత అతడు అన్నాడు "నేను త్వరగానే వెళ్లిపోవాలని వచ్చాను కానీ ఇక్కడ నిన్నీ స్థితిలో చూశాక, అవినాష్ కూడా లేకపోవడంతో నా ప్రోగ్రాం ముందుకు మార్చుకున్నాను"

"లేకుంటే నేనే నిన్ను ఉండమని కోరవలసి వచ్చేది"

అతడు హాల్లోకి వచ్చి కూర్చున్నాడు. 'మనసా! చెపితే వినుకోవు. చేజారినదాని గురించే ఆలోచిస్తావు. ఏమిటో నీదారి... చివరికది ఎడారి'

గంట తర్వాత లక్ష్మి కేకేసింది. "రండి! భోజనం రెడీ"

శ్రీనివాస్ లేచి వెళ్లి వాష్ బేసిన్‌లో చెయ్యి కడుక్కుని డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నాడు. వేడ వేడి అన్నం అతడి ప్లేట్‌లో వడ్డించింది. రెండు కూరలు వడ్డించాక జోక్‌గా అంది "ఫైవ్‌స్టార్ హోటల్స్‌లో లంచ్, డిన్నర్ తీసుకునే జె.యస్.కు ఈ కొద్ది కూరలతో పెట్టే

భోజనం సయిస్తుందా?''

''హోటల్ భోజనంలో ఎన్నో రకాల వంటకాలు ఉంటాయి. కానీ ఒక్కటి మాత్రం తక్కువవుతుంది. అది ఆప్యాయత! ప్రతి మనిషీ ఎక్కువగా కోరుకునేది ఆప్యాయతనే! కాబట్టి ఏ మనిషి అయినా ఇంటి భోజనం కోరుకుంటాడే తప్ప హోటల్ భోజనం కోరుకోడు తెలిసిందా?...''

ఆమె అందంగా నవ్వి ఊరుకుంది.

లక్ష్మి తను కూడా ప్లేట్ ముందుంచుకుని అన్నం వడ్డించుకుంది.

మాట్లాడుకుంటూ పది నిముషాలలో భోజనం ముగించారు. మరో అర్ధగంట విశ్రాంతిగా కూర్చున్నాక ''వెళ్లొస్తాను'' పైకి లేచాడు శ్రీనివాస్.

తలూపిందామె అతడిని వాకిలి వరకూ సాగనంపాలన్న ఉద్దేశ్యంతో రెండు అడుగులు ముందుకు వేసింది. చాలా భారంగా అనిపించింది. ఒక్కసారిగా అంత భారంగా అనిపించడం ఆమెకే ఆశ్చర్యమనిపించింది.

అతడు ఆమె అవస్థ గమనించాడు. ''నువ్వు కూర్చో లక్ష్మీ! నేను వెళ్తానుగా'' అన్నాడు. ఆమె తల అడ్డంగా ఆడించింది.

''ఫర్వాలేదు. నేను వాకిలి వరకూ రాగలను'' చెప్పింది.

అతడు అభ్యంతరం పెట్టలేదు. ఇద్దరూ వాకిలి వరకూ నడిచాక ''గుడ్‌నైట్ లక్ష్మీ'' ఆమె వైపు చూసి చెప్పాడు.

''గుడ్‌నైట్'' ఆమె పెదవులు పలికాయి.

అతడు ముందుకు నడిచి కారు స్టార్ట్ చేశాడు. డ్రైవింగ్ సీట్లో నుండి చెయ్యి ఊపాక కారు ముందుకు పోనిచ్చాడు.

గెస్ట్ హవుస్ గేటు దగ్గర గూర్ఖా సెల్యూట్ చేశాడు. అతడు కారు పోర్టికోలో ఆపాడు. లోపలికి వెళితే వంట నాయర్ చెప్పాడు. ''సార్! అమ్మగారు హైదరాబాదు నుండి ఫోన్ చేశారు''

''ఏమిటట?''

''విషయమేమీ చెప్పలేదు. బాబు ఉన్నాడా అని అడిగారు. లేరని చెపితే రాగానే ఫోన్ చేయమని చెప్పారు''

అతడు తలూపాడు ఫోన్ వైపు నడిచి, హైదరాబాదుకి డయల్ చేశాడు. అవతలివైపు ఆమె ఫోన్ ఎత్తుకున్నాక ''అమ్మా! నేను శ్రీనుని... ఏమిటి ఫోన్ చేశావట?'' అడిగాడు.

''ఏం లేదు బాబు! వెళ్లి నాలుగు రోజులయింది. ఒక్కసారి కూడా ఫోన్ చేయకపోతేనూ...''

అతడు సిగ్గుపడ్డాడు... ''సారీ అమ్మా...''

''లక్ష్మితో కలసి తిరుగుతూ ఇంటిని మరిచిపోయావా?''

అతడు జవాబు చెప్పలేదు. పది సెకనుల నిశ్శబ్దం తర్వాత ఆమే అంది. ''లక్ష్మి ఇంటికి వెళుతున్నావు కదూ?''

ఆమె ఏ ఉద్దేశ్యంతో అలా అడిగిందో అతడికి తెలుసు. అయినాచెప్పాడు ''వెళుతున్నానమ్మా! అన్నట్టు లక్ష్మి గర్భవతి. మరో నాలుగయిదు రోజులలో డెలివరీ కాబోతోంది. అవినాష్ కూడా ఊళ్లో లేడు. మరెవరూ తోడు లేరు కదా! వాళ్లమ్మా, నాన్నగారూ వస్తూ పోతున్నారనుకో... అయినా అవినాష్ వచ్చేవరకూ ఉండాలనుకుంటున్నానమ్మా...'' రాధమ్మ వెంటనే అంది ''లక్ష్మి గర్భవతా? అయితే నేనూ అక్కడికి వస్తాను. తనను చూసి రెండు మూడేళ్లయిపోయింది. ఒక్కసారి వచ్చి చూసి వస్తాను. మన ఊరు చూసినట్టు కూడా ఉంటుంది. అదీగాక లక్ష్మితో ఒక విషయం మాట్లాడాలి''

''ఏ విషయం?''

''వచ్చాక చెపుతానుగా''

అతడు కనుబొమలు ముడివేశాడు. తను మరోసారి ప్రశ్నించినా తల్లి జవాబివ్వదని అతడికి తెలుసు. ఎంతయినా ఆమె తనకు తల్లి. పట్టుదలలో ఏమాత్రం తగ్గిపోదు.

''తప్పకుండా రామ్మా... లక్ష్మికి కూడా తోడుగా ఉన్నట్టుంటుంది''

ఆమె ఆ వైపు నుండి అదోలా నవ్విన నవ్వు! అతడు అర్థం చేసుకున్నాడు. 'ఈ ఒక్క విషయంలో మాత్రం నేను పిచ్చివాడినేనమ్మా' మనసులోనే అనుకున్నాడు.

''ఎప్పుడొస్తున్నావమ్మా?'' అడిగాడు.

''రేపు... ఊహూఁ! ఎల్లుండి బయలుదేరు

తాను''

''అలాగే! బయలుదేరగానే ఫోన్ చెయ్యి. స్టేషన్‌కి వచ్చి రిసీవ్ చేసుకుంటాను'' చెప్పాడు.

''సరే! ఉంటాను'' రాధమ్మ ఫోన్ పెట్టేసింది.

అమ్మ మర్నాడు బయలుదేరుతుంది. ఆ తర్వాత రోజు అంటే తొమ్మిదో తారీఖు ఉదయానికి ఇక్కడకు చేరుకుంటుంది. ఆ తర్వాత రెండు మూడు రోజులకు లక్ష్మికి డెలివరీ కావచ్చు.

అతడు ఫోన్ దగ్గరే చాలాసేపు నిలబడ్డాడు, ఆలోచిస్తూ.



వేకువ ఝామున ఫోన్ రింగ్ అవుతుండడంతో లక్ష్మి బద్ధకంగా పైకి లేచింది. ఒళ్లంతా నొప్పులు. పైకి లేవాలనిపించడం లేదు. కానీ... ఫోన్ ఢిల్లీ నుంచేమో! అవినాష్‌తో రెండు నిముషాలయినా మాట్లాడాలనిపించింది. అతి కష్టం మీద బెడ్ మీదనుంచి లేచింది. పైకి లేస్తే కళ్లు తిరుగుతున్నట్టనిపించింది. కడుపులో పెద్ద కదలిక జయప్రద ఆంటీ చెప్పిన టైమ్ కన్నా ముందే డెలివరీ కావచ్చేమో! అనుకుంది.

మెల్లగా నడుచుకుంటూ వెళ్లి రిసీవర్ చేతిలోనికి తీసుకుంది 'హలో'. అవతలివైపు అవినాష్ కాదు, ఫోన్ ఢిల్లీ నుండి కాదు. హాస్పిటల్ నుండి నర్స్ మాట్లాడుతోంది. ''మేడమ్! మీరు అర్జంట్‌గా హాస్పిటల్‌కి రాగలరా?''

''ఎందుకు?''

''ఒక వ్యక్తిని సీరియస్ కండిషన్‌లో హాస్పిటల్‌కు తీసుకొచ్చారు.''

''బట్, ఈ టైమ్‌లో నేను హాస్పిటల్‌కి రావడం ఎలా? నాకు చాలా భారంగా ఉంది. అందులోనూ నేను ఈ రోజునుండి హాస్పిటల్‌కి రావాలనుకోవడం లేదు కూడా'' చెప్పింది లక్ష్మి.

''కావచ్చు మేడమ్'' రెండు సెకనుల తర్వాత అన్నది నర్స్ ''అతడు జె.యస్. పేపర్ మిల్ కార్మికుడు. ఆ మిల్ వర్కర్స్ మెడికల్‌కేర్ మన హాస్పిటల్ చూస్తుంది''

ఆమె చప్పున అడిగింది. ''జె.యస్.మిల్ కార్మికుడా? ఏమయిందట?''

ఆ మిల్లులో అయిదారు రోజులుగా సమ్మె జరుగుతోందట. సమ్మె వలన యూనియన్‌ల మధ్య గొడవలు మొదలయ్యాయట. సమ్మె చేసే యూనియన్ వాళ్లు మొన్న కూడా ఒక కార్మికుడిని కొట్టారట. ఆ గాయపడిన వ్యక్తిని మన హాస్పిటల్‌కు తీసుకురాలేదు....''

లక్ష్మి ప్రశ్నించింది ''ఈ కార్మికుడి పరిస్థితి సీరియస్‌గా ఉందా?''

''యస్ మేడమ్''

''అయితే నేనిప్పుడు హాస్పిటల్‌కి చేరుకోవడం ఎలా?''

''పేపర్ మిల్ జీప్ వచ్చింది మేడమ్. దానిని ఇంటికి పంపిస్తాను''

''అలాగే చెయ్యి'' రిసీవర్ పెట్టేసింది లక్ష్మి. వెంటనే శ్రీనివాస్‌కి ఈ విషయం తెలియచేస్తే బాగుణ్ణనిపించింది కానీ ఆ టైమ్‌లో అతడిని డిస్టర్బ్ చేయడం ఇష్టం లేకపోయింది.

తయారయి జీప్ కోసం ఎదురు చూడసాగింది.

పది నిముషాలు తర్వాత గేటు బయట జీప్ హారన్ వినిపించడంతో ఇంటిలోనుండి బయటకు నడిచింది. వీధి లైట్ వెలుతురు మసకగా కనిపిస్తోంది. ఆ మసక వెలుతురులో జీప్ ఆగి ఉంది.

ఆమె జీప్ దగ్గరగా నడిచింది. ''రండి డాక్టర్'' జీప్ ఫ్రంట్ సీట్లో కూర్చుని ఉన్న

జగన్నాథం కిందికి దిగాడు.

లక్ష్మి ఫ్రంట్ సీట్లో కూర్చుంది. అతడు వెనుకకు వెళ్లిపోయాడు.

హాస్పిటల్ ముందు దిగాక, ఆమె వేగంగా లోపలికి నడిచింది. ''వేరీజ్ ద పేషెంట్?''

నర్స్ ఆమె ముందుకు నడిచి, కన్సల్టింగ్ రూంలో బెడ్ మీద పడుకుని ఉన్న ఆ వ్యక్తిని చూపించింది.

తల పగిలింది. నెత్తురు ధారగా కారుతూ ఉంది. హెడ్ క్వార్టర్స్‌కి పంపవలసిన కేసు! పోలీసులకు కూడా ఇన్ఫార్మ్ చేయాలి. కానీ ఇది శ్రీనివాస్ ఫ్యాక్టరీకి సంబంధించిన విషయం.

ఆమె క్షణాలలో తన పనిలో నిమగ్నమయింది. నర్స్ ఆమెకు సహాయపడసాగింది. అతడి బ్లడ్‌గ్రూప్ అడిగి తెలుసుకుని, బ్లడ్ బ్యాంక్‌కి మనిషిని పంపింది. గాయాన్ని శుభ్రం చేసి, కుట్లు వేసింది.

తెలతెల వారుతుండగా ఆమె తన పని ముగించుకుని రిలాక్సింగా ఛెయిర్‌లో కూర్చుంది. నర్స్ వేడి కాఫీ అందించింది. కాఫీ సిప్ చేస్తూనే ఆమె రిసీవర్ చేతిలోనికి తీసుకుని నంబర్ డయిల్ చేసింది. ఆమెకు తెలుసు శ్రీనివాస్ ఐదింటికే నిద్రలేస్తాడని. అతడు రెస్ట్ తీసుకునే సమయం రోజుకి నాలుగు గంటలు మాత్రమే.

''హలో! జె.యస్. స్పీకింగ్'' అవతలివైపు కంఠం గంభీరంగా పలికింది.

''నేను లక్ష్మిని...''

''హాయ్ లక్ష్మీ! ఏమిటి ఇంత వేకువనే ఫోన్ చేశావు? సుప్రభాత వేళ మేలుకొలుపు పాడాలనిపించిందా?'' అతడి గొంతులో కాసింత ఆనందం, మరికాస్త ఆశ్చర్యం కలసి ఉంది.

''కాదు'' ఆమె చెప్పింది 'తనకు వేకువనే ఫోన్ రావడం, అతడి ఫ్యాక్టరీ కార్మికునికి తగిలిన గాయం, జరుగుతున్న సమ్మె...'

''ఈజిట్'' అతడు చాలా ఆశ్చర్యపోయాడు. ''నాకు ఈ విషయాలేమీ తెలియదు. ఇక్కడికి వచ్చాక నేను మిల్ గురించి పట్టించుకోలేదు. ఒకే ఒకసారి మిల్‌కి వెళ్ళి చూసి వచ్చాను. ఆ తర్వాత నాకేమీ తెలియదు''

''నాకు తెలుసు- మీరు కొద్దిరోజులపాటు ప్రశాంతంగా, బిజినెస్ వ్యవహారాలకు దూరంగా గడపాలని వచ్చారు... సారీ! ఈ విషయం మీకు తెలియచేయకూడదనుకున్నాను. కాని... వ్యవహారం శృతిమించుతుందేమోనని ముందుగా తెలియచేస్తున్నాను'' అపాలజిటిక్‌గా పలికింది లక్ష్మి.

''ఇట్సాల్‌రైట్'' రిసీవర్ పెట్టేయబోతూ చివరివాక్యం చెప్పాడు. ''బిజినెస్ మన్‌కి ప్రశాంతత ఎప్పుడూ అరడుగు దూరంలోనే ఉంటుంది లక్ష్మీ''

లక్ష్మి తను కూడా రిసీవర్ పెట్టేసి అతడి కోసం ఎదురుచూడసాగింది. పావుగంట తర్వాత అతడు కారులో వచ్చాడు. తను ఊహించినంతగా అతడు కంగారుగా లేడు. చిరునవ్వు పెదాలమీద నుండి తొలగిపోలేదు.

'ఎలాంటి విషమపరిస్థితయినా చిరునవ్వుతో ఎదుర్కోవడం అతడికి అలవాటయినట్టుంది' అనుకుందామె.

అతడు ''పేషెంట్ ఎక్కడ?'' తన దగ్గరగా వచ్చి అడిగాడు.

ఆమె ఎమర్జన్సీ వార్డ్‌లోని పేషెంట్ దగ్గరకు నడిచింది. అతడు బెడ్ పక్కనే నిలబడి ఆ వ్యక్తి వంక కొద్దిక్షణాలపాటు తదేకంగా చూసాడు. ఆ వ్యక్తి అపస్మారక స్థితిలో ఉన్నాడు. బాటిల్‌లోని రక్తం మెల్లగా అతడి శరీరంలోనికి ఎక్కుతోంది.

అతడు తలతిప్పి ''ఇతన్ని తీసుకువచ్చిన వారెక్కడ?'' ఆమెను ప్రశ్నించాడు.

''బయట ఉన్నారు''

అతడి అడుగులు వడివడిగా అటువడ్డాయి. బయట నిలబడి ఉన్న వ్యక్తులు బిక్కమొహాలు వేసుకుని అతడివంక చూసారు ''మీరు?''

''నాపేరు జగన్నాథం సార్! యూనియన్ లీడర్ని... ఆ వ్యక్తి మా యూనియన్‌లోని వాడే''

''గొడవకు కారణం''

జగన్నాథం మొదట నుండి పూసగుచ్చినట్టుగా అతడికి వివరించాడు. గంభీరంగా

అంతా విన్నాడు అతడు. ''ఐసీ'' అన్నాడు చివరగా.

వెంటనే లక్ష్మి రూమ్‌లోకి వెళ్ళి ఫోన్ రింగ్ చేశాడు. ''నేను జె.యస్.ని మిస్టర్ చతుర్వేది? మీరు వెంటనే క్లినిక్‌కి రండి''

అతడి ముఖంలో ఎలాంటి భావాలూ లేవు. టెన్షన్ ఫీలవుతున్నట్టు గానీ, సీరియస్‌గాగానీ లేడతడు. అవతలివారు మాట్లాడుతున్నప్పుడు ఏకాగ్రతగా వినడం, ఆ సమయంలోనే ఒక నిర్ణయానికి రావడం, నిర్ణయాన్ని వెంటనే అమలుపరచడం... శ్రీనివాస్ ఎంతగా ఎదిగిపోయాడు? తనకు ఒకప్పుడు పరిచయమున్న శ్రీనివాస్ ఇతడేనా?! అతడి వంక అబ్బురంగా చూడసాగింది లక్ష్మి.

అర్థగంట తర్వాత చతుర్వేది స్కూటర్ క్లినిక్ ముందు ఆగింది. అతడు వణికిపోతూ ఉన్నాడు. ''కూర్చోండి'' లోపలికి వచ్చాక చెప్పాడు శ్రీనివాస్.

నిశ్శబ్దంగా కూర్చున్నాడు చతుర్వేది.

ఆ గదిలో ముగ్గురే ఉన్నారు. లక్ష్మి తన సీట్లో కూర్చుని శ్రీనివాస్ వంకే చూస్తోంది. శ్రీనివాస్ ఆమె పక్కనే సీట్లో కూర్చుని చేత్తో పేపర్‌వెయిట్ తిప్పుతున్నాడు. కొద్దిక్షణాలు మౌనం తర్వాత అతడు మెల్లగా పలికాడు. ''మిస్టర్ చతుర్వేది! మీరు, రమేష్- రాజశేఖరంలను ఎందుకు సస్పెండ్ చేసినట్టు?''

''సార్ అది... అది...'' నసగసాగాడు.

''చతుర్వేది! మన 'ఈగోలు దెబ్బతిన్నా'యని కార్మికుల జీవితాలతో ఆడుకోవడం అంత మంచిది కాదు. అనివార్యమయితే తప్ప కార్మికుల మీద సస్పెన్షన్ అనే అస్త్రం ప్రయోగించకూడదు. ఏదేమయినా మీరు మాత్రం తప్పుచేసారు... పెద్ద తప్పు చేసారు...''

''సారీ సర్''

''ఆల్‌రైట్! జరిగిందేదో జరిగిపోయింది'' అని అరక్షణం ఆలోచించుకుని చెప్పాడు. ''మీరు రేపు యూనియన్ లీడర్ల సమావేశం ఏర్పాటుచేయండి. నేను వారితో మాట్లాడుతాను. ఈ సమస్యకు ఇంతటితో ఫుల్‌స్టాప్ పెట్టేద్దాం''

చతుర్వేది మౌనంగా తలూపాడు.

''రేపు ఉదయం పదిగంటలకు నేను మిల్‌కి వస్తున్నాను''

కావల్సిన ఏర్పాట్లు చేస్తాను''

చతుర్వేది వెళ్ళిపోయాడు కాసేపటికి.

అతడు సోమనాథ్‌కి ఫోన్‌చేసాడు. ''మిస్టర్ సోమనాథ్! మీకు మన మిల్‌లో జరుగుతున్న సమ్మె గురించి తెలుసా?''

అవతలివ్యక్తి కంఠం మెల్లగా వణికింది. ''తెలుసు... సార్''

''నేను ఇక్కడే ఉన్నాను. నాకెందుకు చెప్పలేదు?''

''సార్ అది!... మిమ్మల్ని డిస్టర్బ్ చేయడం... అయినా ఈ చిన్నవిషయం మీ వరకూ తీసుకు రావడం ఎందుకని?...''

''ఇక నుండి మన మిల్‌లో జరిగే ప్రతి చిన్నవిషయం నా దృష్టికి రావాలి''

''అలాగే సర్''

''రేపు యూనియన్ లీడర్స్‌తో నేను మాట్లాడబోతున్నాను. మీరూ రాగలరా?'' అని ఆగి తనే వెంటనే అన్నాడు. ''వద్దులెండి! ఎల్లుండి మీ అమ్మాయి పెళ్ళి కదా! రేపు మీరు పనుల వత్తిడిలో ఉంటారేమో వద్దులెండి''

''థాంక్యూ సర్''

అతడు ఫోన్ పెట్టేసాడు. కుర్చీలో వెనక్కు వాలి దీర్ఘంగా నిట్టూర్చాడు.

అప్పటివరకూ అతడి వంకే తదేకంగా చూస్తుండిన ఆమె మెల్లగా ప్రశ్నించింది ''ఏమిటిదంతా?''

అతడు భుజాలెగరేసాడు ''వ్యాపారి సమస్యలు... బిజినెస్ మెన్ ఎదుర్కొనే అతి చిన్న సమస్యలు''

ఆమె కొద్దిసేపు మౌనంగా ఉండి తర్వాత అంది, ''మీరు నిర్ణయాలు చాలా త్వరగా తీసుకుంటారనుకుంటాను?''

''బిజినెస్‌లో త్వరిత నిర్ణయాలు తీసుకోలేనివాడు మంచి అడ్మినిస్ట్రేటర్ కాలేడు తెలుసా?''

''ఏమో! నేను బిజినెస్ మేనేజ్‌మెంట్ చదవలేదు''

అప్పటివరకూ టెన్షన్‌గా ఫీలయిన అతడు రిలాక్సింగ్‌గా నవ్వాడు. ''నేనూ చదవలేదు తెలుసా?''

''ఏదేమయినా మీరు మంచి బిజినెస్ మాగ్నట్''

శిఖరం చేరిన వ్యక్తికి పొగడ్తలు చాలా మామూలే!

''అన్నట్టు మీరీమధ్య చాలా తక్కువగా మాట్లాడుతున్నారు''

''బిజినెస్‌లో 'బి'కి అర్థం బ్రీఫ్ టాకింగ్''

నర్స్ కాఫీ పట్టుకు వచ్చింది. ఇద్దరూ కప్పులు తీసుకున్నారు.

అతడు కాసేపటి తర్వాత రూంలో నుండి ఇవతలకి వచ్చాడు. జగన్నాథం బయట స్టూల్ మీద కూర్చుని ఉన్నాడు. శ్రీనివాస్‌ని చూడగానే పైకిలేచి నిలబడ్డాడు. ''రేపు యూనియన్ లీడర్స్‌తో నేను సమావేశం జరుపుతాను. మీ ప్రాబ్లమ్స్ ఏవయినా ఉంటే నాతో చర్చించండి''

కారులో వెళ్ళిపోయాడు శ్రీనివాస్

★ ★ ★

ఒంటరితనం మనిషికి శాపం. జీవితంలో ఆస్తి, అంతస్తు, హోదా, పలుకుబడి లాంటివి సంపాదించుకోవచ్చు. కాని నిన్ను నిన్నుగా అభిమానించే వ్యక్తిని సంపాదించుకోవడం కష్టం! డబ్బుతో నీ చుట్టూ ఎంతోమంది చేరవచ్చు. వారు నీమీద అభిమానం కురిపిస్తూ ఉండొచ్చు. బట్- అది నటనే.



అతడికి తల్లి ఉంది. కాని ఒంటరితనపు నీడలోనుండి బయటపడలేకపోతున్నాడు. 'అమ్మ తర్వాత నాకు తోడు ఎవరు?' అని తనలోతానే ప్రశ్నించుకుంటాడు. ఒంటరితనం గుర్తుకురాకుండా ఎన్నో వ్యాపకాలు, బిజీగా పనులు కల్పించుకుంటున్నాడు. కాని ఏ అర్ధరాత్రో హటాత్తుగా మెలుకువవస్తే, అతనికి భయంగా తోచేది. 'నేను ఎందుకు బ్రతుకుతున్నాను?' అని తపనపడేవాడు. 'ప్రవాహం వాలులో, కాలగతిలో కొట్టుకుపోతున్నాను నేను. నాకు... నాకు ఒక ఆసరా కావాలి' అని అనుకునేవాడు. అయితే తెల్లారి లేచాక రాత్రి వ్యధ మరిచిపోయి బిజినెస్ పనులలో మునిగిపోయేవాడు. 'శ్మశానవైరాగ్యం' అది. క్షణికం మాత్రమే!

అప్పుడప్పుడూ అతడికి అనిపించేది 'నేను ప్రేమించిన లక్ష్మి మరొకరిని పెళ్ళాడింది. మరి నేను గాయత్రిని ఎందుకు పెళ్ళాడకూడదూ?' ఎక్కడో మిగిలిన స్పందన ఆలోచనను అమలు పరిచేలా చేసేది కాదు.

ఆ రాత్రివేళ శ్రీనివాస్ మంచం మీద అటుఇటు పొర్లాడు. "అమ్మా నన్నెందుకు కన్నావు? ఈ ఒంటరితనపు కాలసర్పం నీడలో నేనెంత వ్యధపడుతున్నానో తెలుసా?... భగవాన్! నాకు తెలివినిచ్చావు. పట్టుదల నిచ్చావు. అన్నీ ఇచ్చిన నీవు... మనశ్శాంతిని మాత్రం ఇవ్వలేదు. మరచిపోతే మనశ్శాంతి ఉంటుంది. అయినా మరిచిపోలేని మానసిక బలహీనుడను నేను..."

అతడికి అసహనంగా ఉంది. ఏదో నిస్సహాయత. కసి... ఏడవాలనిపిస్తుంది...

అతడు పైకి లేచాడు. తన మనసుని ఇప్పుడు డైవర్ట్ చేయాలి. లేకుంటే తను పిచ్చివాడయిపోతాడు. అతడికి ఆక్షణం గాయత్రి గుర్తుకు వచ్చింది. వెంటనే హైదరాబాదుకి రింగ్ చేశాడు.

"హలో! నేను శ్రీనివాస్‌ని... గాయత్రి కావాలి"

పదిసెకనుల తర్వాత గాయత్రి లైనులోకొచ్చింది.

"ఏమిటి ఇంత రాత్రివేళ ఫోన్ చేసారు?"

అతడు ఫోన్ చేసాడుగానీ, ఆమె అలా అడిగాక ఏం మాట్లాడాలో అర్థంకాలేదు "నేను... నేను... ఏమీ తోచక..."

కొద్ది క్షణాలు అవతలివైపు నిశ్శబ్దం! ఆమె ఏదో అర్థమయినట్టుగా ప్రశాంతంగా నవ్వింది. "రూమ్‌లో ఒంటరిగా ఉన్నావా?"

"అ... అవును" తడబడ్డాడు.

"ఒంటరితనం భయమేస్తుంది కదూ?"

అతడు మాట్లాడలేదు.

"నాకు తెలుసు శ్రీనివాస్! ఒంటరితనంతో నువ్వెంతగా వ్యధపడుతున్నావో! పగలంతా గంభీరంగా ఉండే నువ్వు రాత్రివేళ నీమీద నువ్వే జాలిపడుతుంటావు. ఇది చాలా సహజమయిన విషయం... వయసులో ఉండగా ఆవేశంతో, వేగంగా కొట్టుకుపోవడంతో తోడు యొక్క ఆవశ్యకత తెలుసుకోరు. ఆ ప్రవాహం కాసింత నిశ్చలమయ్యాక, ఆలోచించడానికి వ్యవధి దొరుకుతుంది. అప్పుడు ఆలోచించడం మొదలయితే 'భయం' వేస్తుంది. 'రేపు నాకు తోడు ఎవరు?' అని ప్రశ్నించుకోవడం మొదలవుతుంది... ఇది నీ ఒక్కడి విషయం కాదు. నీలా 'తోడు' నిర్లక్ష్యం చేసిన ప్రతి ఒక్కడూ ఏదో ఒక సమయంలోపడే మానసిక సంఘర్షణ...

అతడు అప్పటికీ మౌనంగా ఉన్నాడు. తన నిశ్శబ్దమే తనను పరిహసిస్తున్న భావన కలిగింది.

"... శ్రీనివాస్! నేను... నేను నా ప్రేమను ఫలింపచేసుకునేందుకే ఇలా మాట్లాడడం లేదు. తెలివయినవాడివి... కొద్దిసేపు నీ గురించి నిన్ను ఆలోచించుకోమంటున్నాను..."

అవతలివైపు నిశ్శబ్దమయిపోయాక "ఉంటాను గాయత్రి" అంటూ ఫోన్ హుక్ మీద పెట్టేసాడు.

ఆక్షణం అతడికి ఓ పాటలోని చరణం గుర్తుకువచ్చింది... "అనుకున్నామని జరగవు అన్నీ అనుకోలేదని ఆగవు కొన్ని జరిగేవన్నీ మంచికనీ, అనుకోవడమే మనిషి పని..."

విరక్తిగా నవ్వుకున్నాడు శ్రీనివాస్.

★ ★ ★

"అన్నా! జె.యస్. రేపు యూనియన్ లీడర్లతో సమావేశమవుతానని కబురు పంపాడు"

ఆంజనేయులునాయుడు రాజశేఖరం వంక చూసి తలాడించాడు.

ఆ నిశిరాత్రివేళ ఎక్కడో తీతువుపిట్ట అరుస్తోంది. పెరట్లోని కొబ్బరి చెట్టు తలూపడం మానేసింది.

"రమేష్‌ని సస్పెండ్ చేసినందుకు జె.యస్. చతుర్వేదిని తిట్టాడట కూడా. జె.యస్.కి వర్కర్స్ మీద అభిమానంగానే ఉన్నట్టుంది"

"ఆ అభిమానాన్ని మనం వాడుకోవాలి. ఒకవిధంగా ఇప్పుడు మనదే పైచెయ్యి" అని ఆగి తర్వాత అన్నాడు. "రేపు జె.యస్.ని నేను కలవడమే బాగుంటుందేమో"

రాజశేఖరం అతడివంక విస్మయంగా చూసాడు.

"జె.యస్.ని నేను కలిస్తే, అతడు మన యూనియన్‌కు సహాయపడతాడు. రేపు జరగబోయే అగ్రిమెంట్‌లో మనం విజయం సాధించినవాళ్ళం అవుతాము. ఒక మిల్‌లోని చిన్న యూనియన్ మేనేజ్‌మెంట్ మీద విజయం సాధించిందంటే కార్మికులలో కలకలం మొదలవుతుంది. ఏ యూనియన్ నుండయినా మన యూనియన్‌లోకి వర్కర్స్ జంప్ అవుతారు"

అంతేకాదు, ఈ సంఘటనతో రాజకీయవర్గాలలో కూడా తన పలుకుబడి పెరుగుతుందని అతడికి తెలుసు.

రాజశేఖరం మౌనంగా తలాడించాడు.

'మర్నాడు ఆంజనేయులునాయుడు జె.యస్.ని కలుసుకోబోతున్నాడన్న' వార్త రవిరాజుకి అందింది.

అతడు జగన్నాథం తదితర అనుచరులతో సమావేశమయ్యాడు.

"ఆంజనేయులునాయుడు చాలాకాలం నుండి మనమీద దెబ్బతీస్తూనే ఉన్నాడు. మన కార్యకర్తలను ఒకరిద్దర్ని లేపేయించాడు. ఈ రోజు అతడు పేపర్ మిల్ ఓనర్‌తో సమావేశమయితే అతడికి కార్మిక సంఘంలో మంచి పట్టుదొరుకుతుంది... అతడిని రాజకీయంగా దెబ్బకొట్టాలన్నా, మన కార్యకర్తలకు జరిగిన అన్యాయానికి కసి తీర్చుకోవాలన్నా ఇదే సరయిన సమయం... ఆంజనేయులు నాయుడి దురాగతాలకు రేపు ఉదయమే ఫుల్‌స్టాప్ పెట్టేద్దాం"

జగన్నాథం తదితరులు మౌనంగా తలాడించారు.

"ప్లాన్ ఏమిటి?" కొద్దిక్షణాల నిశ్శబ్దం తర్వాత ప్రశ్నించాడు జగన్నాథం. అతడికి చాలా టెన్షన్‌గా ఉంది. రేపు... రేపు తమ పాత పగలు పరిసమాప్తి అవుతాయి. కాసింత భయంగా కూడా అనిపించింది. దీనివలన వచ్చే పరిణామాలను తట్టుకోవాలి. అంత చల్లని వాతావరణంలోనూ అతడి అరచేతులకు చెమట పట్టింది.

రవిరాజు కొద్దిక్షణాలు మౌనంగా కన్నులు మూసుకున్నాడు. మూసిన కన్నుల వెనుక ఒక దృశ్యం కదలాడింది. రేపటి ఉదయం జరగబోయే దృశ్యం... అతడు ఊహించాడు.

కన్నులు తెరిచాడు అతడు. తన చుట్టూ కూర్చుని ఉన్న ఆ నలుగురూ తనవంకే ఆసక్తిగా చూస్తున్నారు. తను చెప్పబోయే వాక్యాల కోసం చెవులు రిక్కించారు.

అతడు చెప్పాడు. "రేపు ఉదయం ఎనిమిది, పది గంటల మధ్య ఆంజనేయులునాయుడు జె.యస్. పేపర్‌మిల్‌కి వెడతాడు. పేపర్ మిల్ టౌన్‌కి పదిమైళ్ళదూరంలో ఉంది. ఈ దారిలో ఒకచోట చిన్న వంతెన వస్తుంది. అది నిర్జన ప్రదేశం... ఆంజనేయులునాయుడికి మన అటాక్ గురించి తెలియదు. అతడు కారులో ఇద్దరు, ముగ్గురు అనుచరులతో మాత్రమే మిల్‌కు వెడతాడు. మీరో ఇరవైమంది మూడు కారులలో వంతెన దగ్గర కాపు కాయండి. కావలసిన పరికరాలు వెంట పెట్టుకువెళ్ళండి. అతడి కారు కనిపించగానే రెండు కారులు అడ్డం పెట్టండి. అతడు తేరుకునేప్పటికే మీరు పని పూర్తిచేసేయాలి..."

నిశ్శబ్దంగా తలలూపారు వారు.

జగన్నాథం మాత్రం అడిగాడు "అన్నా!

దీని వలన ఏదయినా గొడవలయితే? పోలీసు కేసు లాంటివి...''

''అవన్నీ నేను చూసుకుంటాను... ఆంజనేయులునాయుడు బతికిఉంటే మన పార్టీ కార్యకర్తలను ఎందరినో కడతేరుస్తాడు. అందుకే వాడు బతికి ఉండకూడదు...''

'నిజమే' అనిపించింది వారికి. రవిరాజు భరోసా ఇచ్చాక ఇక తమకు ఏమాత్రం భయంలేదు.

''అలాగే అన్నా! ఈ రాత్రికే మెరికల్లాంటి మనవాళ్ళను పోగుచేస్తాను. మీరు మా ఇంటిదగ్గరకు కారులు పంపండి. ఆ తర్వాత మీరు అనుకున్నట్టే జరుగుతుంది''

ఆ అర్ధరాత్రివేళ ఒక నాయకుడు, మరొక నాయకుడిని చంపేందుకు ప్లాన్ వేసాడు. దిగజారిన రాజకీయానికి ఇదో ఉదాహరణ మాత్రమే! ఒకప్పుడు నాయకులు సిద్ధాంతపరంగా ఎదుటివారిని నొప్పించకుండానే ఘర్షించుకునేవారు. గాంధీ, నెహ్రూ, శాస్త్రి... మహానుభావులు వారు. ఆ తరం అంతరించిపోయింది. నేడు సిద్ధాంతాలు గాలికి వదిలివేయబడ్డాయి. వ్యక్తి దూషణ, వ్యక్తిగత కక్షలు రాజకీయంలో చొరబడ్డాయి. అవతలివాడిని సిద్ధాంతపరంగా మాటలతో ఓడించడంకన్నా బలప్రయోగంతో బలిచేయడమో, నీచపుటెత్తులతో తొక్కివేయాలని చూడడమో జరుగుతుంది. రాజకీయం భ్రష్టుపట్టిపోయింది. రాజకీయం పదవులకోసం మతాలను అడ్డుపెట్టుకోవడం. దేశంలో మతకల్లోలాలను సృష్టించడం... ఈ దేశాన్ని ఎవరు రక్షించగలరు?

అక్కడ కూర్చున్న వారంతా పైకి లేచారు.

''జాగ్రత్త'' హెచ్చరించాడు రవిరాజు, వారంతా బయటకు నడుస్తున్నప్పుడు.

''మీరు నిశ్చింతగా ఉండండన్నా... ఆ పని మేము చేసేస్తాం''

రవిరాజు పెదాలమీద చిరునవ్వు కదలాడింది. 'చాలా కాలంగా రాజకీయాలలో ప్రత్యర్థి అయిన వ్యక్తి కథ రేపటితో ముగిసిపోతుంది' మనసులోనే మురిసిపోయాడు అతడు.

* * *

సూర్యోదయమయింది.

శ్రీనివాస్ అప్పటికే తయారయి ఉన్నాడు. ప్రతిరోజూ ఆరుగంటలలోపే స్నానాదికాలు ముగించుకుని, కాఫీతోపాటు పేపర్ చదువుతూ కూర్చుంటాడు. అతడు సుమారుగా పావు గంటసేపు పేపర్ చదువుతాడు.

పేపర్ చదవడం పూర్తయింది. సోఫాలో రిలాక్సింగా వెనక్కువాలి కన్నులు మూసుకున్నాడు. 'ఈరోజు ప్రోగ్రాము లేమిటి?', 'పది గంటలకు మిల్‌కి వెళ్ళి యూనియన్ లీడర్స్‌తో సమావేశమవ్వాలి. ఆ తర్వాత హాస్పిటల్‌కు వెళ్ళి కార్మికుని పరామర్శించాలి. ఆ పిమ్మట లక్ష్మితో ఈ రోజంతా గడిపేయాలి'

అతడు పైకి లేచాడు. ఫోన్ అందుకుని లక్ష్మికి రింగ్ చేసాడు. ''హలో లక్ష్మీ! నిన్న హాస్పిటల్‌లో అడ్మిట్ చేసిన పేషెంట్ పరిస్థితి ఎలా ఉంది?''

''బాగుంది... ఈరోజు నేను హాస్పిటల్‌కి వెళ్ళడంలేదు. మరో డాక్టర్‌ని రెండు రోజులపాటు క్లినిక్‌ని చూసుకోమని రిక్వెస్ట్ చేసాను. ఈ లోపు అవినాష్ వచ్చేస్తాడు కదా!''

''ఆల్‌రైట్! నేను మధ్యాహ్నం హాస్పిటల్‌కు వెడతాను. అక్కడి నుండి నీ దగ్గరకు వస్తాను''

''ఇప్పుడు ఎక్కడికి వెళుతున్నారు?''

''మిల్‌కి... యూనియన్ లీడర్స్‌తో సమావేశం ఉంది కదా!''

''వెళ్ళే ముందు ఇటు రాకూడదూ... ఎటూ దారే కదా! టిఫిన్ చేసి వెళ్ళిపోవచ్చు''

''అలాగే... మీరు పిలవడమూ, మేము రాకపోవడమా?'' చిలిపిగా అన్నాడు. ''ఇప్పుడే వస్తున్నాను'' అంటూ రిసీవర్ పెట్టేసాడు.

కారు తీసుకుని, పదినిముషాలలో లక్ష్మి ఇంటి ముందు ఆగాడు. అప్పుడు సమయం ఏడున్నరయింది. లక్ష్మి డైనింగ్ టేబుల్ ముందు కూర్చుని అతడి రాకకోసమే ఎదురు చూస్తోంది.

''టిఫిన్ ఏమిటి?'' ఆమె ఎదురుగా కూర్చున్నాక అడిగాడు.

''పెసరట్టు, ఉప్మా''

''వాహ్, చాలా మంచి టిఫిన్ దొరికింది నాకివాళ! సుష్టుగా తినేయాలి'' అతడు ప్లేట్

ముందుపెట్టుకున్నాడు. ''కానివ్వు వడ్డించు''

అతడి హుషారుకు ఆమె తృప్తిగా నవ్వింది. హాట్‌ప్యాక్‌లో ఉన్న పెసరట్టు, ఉప్మాతీసి అతడి ప్లేట్లో వడ్డించింది.

అతడు పెసరట్టు తుంచి నోట్లో వేసుకుని ''అద్భుతంగా ఉంది'' అంటూ పొగుడుతూ ఆమెవంక చూశాడు.

''ఏమిటీ ఈరోజు చాలా హుషారుగా ఉన్నారు?''

''హుషారా?!'' అతడు అదోలా నవ్వాడు. అతడికి ఆ క్షణం రాత్రి ఒంటరితనంతో తను పడిన వ్యధ గుర్తుకువచ్చింది. ''పగలంతా హుషారుగా, గంభీరంగా ఉండే నేను రాత్రులు ఒంటరితనంతో ఎంతగా వ్యధపడుతుంటానో తెలుసా? నాకు భయంగానూ, పిచ్చిపట్టినట్టుగానూ అనిపిస్తుంది... ఎందుకు... ఎందుకు బతుకుతున్నానా అనిపిస్తుంది'' అతడు ఎందుకనో మొట్టమొదటిసారిగా ఆమె ముందు వీక్ అయ్యాడు. అందుకు కారణం ఏమిటో అతడికే తెలియదు.

లక్ష్మి అతడివంక విభ్రమంగా చూసింది. గంభీరత్వం అనే పొలుసు తొలగిస్తే తప్ప మనిషిలోని మనిషివడే వేదన, తపన అర్థంకావు కాని గంభీరత్వపు తెర ఎప్పుడోగానీ తెరుచుకోదు. మనిషి మానసికంగా బాగా బలహీనపడినప్పుడే, అభిమానించే వ్యక్తి ముందు మాత్రమే బయటపడతాడు- ఇప్పటి శ్రీనివాస్‌లా!

అప్పటికే ఆమె టిఫిన్ తినడం పూర్తయింది. మెల్లగా నడుచుకుంటూ అతడి దగ్గరగా వచ్చింది. అతడి తలమీద చెయ్యివేసింది. ఒక తల్లి తన బిడ్డను వాత్సల్యంగా దగ్గరకు తీసుకున్నట్టు.

''శ్రీనివాస్! జీవితంలో మనిషి ఎన్నోమెట్లు పైకి ఎక్కవచ్చు. అది కష్టసాధ్యమే! కాదనను. కాని... ప్రతిమనిషీ ఒకానొకప్పుడు డిప్రెషన్‌కి గురవుతాడు. తనకుతోడు ఎవరూ లేరన్న నిజం ఈ డిప్రెషన్‌ని మరింత పెంచుతుంది. నిశిరాత్రి తలదిండులో ముఖంపెట్టి ఏడవాలనిపిస్తుంది. దీనికంతటికీ కారణం ఏమిటి...? సరయిన జీవితభాగస్వామి లేకపోవడం! పెళ్లి చేసుకోండి... మీరు పెళ్లి చేసుకోండి''

అతడికి నవ్వొచ్చింది. తెలిసీతెలియని వయసులో మగాడు పెళ్లెందుకు చేసుకోవాలి? అనే పిచ్చిప్రశ్న వేసుకోవడం. తర్వాత ప్రేమలో పడటం, ఇప్పుడు పెళ్లియొక్క ఆవశ్యకత తెలిసిరావడం... ప్రతిమనిషికీ పెళ్లి అనేది తప్పనిసరా... తనకి అన్ని విషయాలలోనూ లేట్ రియలైజేషన్!

''వెళుతున్నాను... మధ్యాహ్నం వస్తాను''

''ఆలోచించండి... నేను చెప్పిన విషయం గురించి ఆలోచించండి''

అతడు చెప్పాడు ''ఆలోచిస్తాను''

ఆమె అక్కడే ఆగిపోయింది. అతడు ముందుకు నడిచాడు. కారు తీసుకుని రోడ్డెక్కాడు.

అతడి స్మృతిలోనుండి లక్ష్మి తొలగింది. గాయత్రి గుర్తుకు వచ్చింది. 'నేను లక్ష్మికోసం ఎలా తపిస్తున్నానో, ఆమె నా కోసం అలాగే ఆలోచిస్తుంది. నేను ఆమెకు ద్రోహం చేస్తున్నట్టు కాదా?' అతడికి ఆ క్షణమే కారు ఆపి గాయత్రికి ఫోన్ చేయాలనిపించింది. బలవంతాన ఆ ఆలోచనను ఆపుకున్నాడు. కారణం పదిగంటలకితను మిల్‌కు చేరుకోవాలి. అప్పటికే సమయం తొమ్మిది నలభైనిముషాలైంది.

అతడు కారు వేగం పెంచాడు.



సరిగ్గా తొమ్మిది ముప్పైనిమిషాలకు మిల్‌కి బయలుదేరాడు ఆంజనేయులునాయుడు. తనమీద జరగబోయే అటాక్ గురించి అతడికి

సూచనప్రాయంగా కూడా తెలియదు. అందు వలననే అతడు చాలా రిలాక్సింగ్‌గా ఉన్నాడు. తన వెంట ఎక్కువమంది జనాలను కూడా తీసుకోలేదు. కారులో తను, మరో ఇద్దరు అనుచరులు మాత్రమే బయలుదేరారు.

అక్కడనుంచి పావుగంట ప్రయాణం మిల్కు. అతడు ఆరోజు ఉదయంనుండి చాలా హుషారుగా ఉన్నాడు. అందుకు కారణం- ఉదయమే తనకు హైదరాబాదునుండి ఫోన్ వచ్చింది. త్వరలో జరగబోయే అసెంబ్లీ ఎన్నికలలో పార్టీ తరపున పోటీ చేసేందుకు టిక్కెట్ తనకే ఇవ్వబోతున్నారని- నమ్మకమైన వ్యక్తుల ద్వారా తెలిసింది. రాజకీయాలలో ఇకనుండి తన దశ తిరగబోతున్నట్టుంది. ఈరోజు మిల్ యూనియన్ విజయం, రేపు ఎమ్మెల్యే టిక్కెట్ ఉత్సాహం... అతడి పెదాలమీద మందహాసం కదలాడుతూ ఉంది.

ముందు సీట్‌లో డ్రైవర్ ఏకాగ్రతగా కారు నడుపుతున్నాడు. పదినిమిషాలు ప్రయాణం జరిగింది. మరో అయిదునిమిషాలలో మిల్‌కు చేరుకోవచ్చు. ఆంజనేయులునాయుడు సీట్‌లో వెనక్కువాలి సిగరెట్ వెలిగించుకుని గుండెల నిండుగా పొగపీల్చి వదిలాడు.

మరో కిలోమీటరు వెళ్లింది కారు. అక్కడే చిన్న వంతెన ఉంది. దానిని కొత్తకాలువ అంటారు. ఆ వంతెనమీద ఒక్క వాహనం మాత్రమే వెళ్లగలదు. వంతెన దాటగనే ఒక్కసారిగా టర్న్ చేయాలి.

డ్రైవర్ కారుని వంతెన దాటించాడు. మలుపు తిప్పుతూ ఒక్కసారిగా బ్రేక్ నొక్కాడు. అతడు అరక్షణంపాటు ఆశ్చర్యంగా చూశాడు.

ఎదురుగా రోడ్డుకు అడ్డంగా రెండు కారులు పెట్టబడి ఉన్నాయి. అప్పుడే కారు తలుపులు తెరుచుకుని పదిమంది పరిగెత్తుకు రాసాగారు. వారి చేతులలోని మారణాయుధాలు చూడగనే డ్రైవర్ కన్నులు పెద్దవయ్యాయి. జరగబోయేదేమిటో క్షణంలో గ్రహించాడు. వెంటనే భయంకరంగా ఒక అరుపు అరిచాడు.

ఆ అరుపుకు ఆంజనేయులునాయుడు అదిరిపడ్డాడు. అరసెకనులో జరగబోయేది ఊహించి, డోర్ తెరచుకుని కిందికి దూకాడు. అప్పటికే అతడి వీపుమీద ఒక గండ్రగొడ్డలి దెబ్బపడింది. రక్తం చిమ్మింది.

ఆంజనేయులునాయుడులో చావు తెగింపు వచ్చింది. తగిలిన దెబ్బ గురించి ఆలోచించ లేదు. అరసెకను ఆలస్యమయితే ప్రాణాలు దక్కవని తెలిసి వేగంగా ముందుకు పరిగెత్తాడు- రోడ్డు వెంబడే! అంతలోనే మరో కత్తిపోటు డొక్కలో దిగింది. అతడు ఒంటిలోని శక్తినంతా కాళ్లలోనికి తెచ్చుకుని పరుగెత్తసాగాడు... దూరంగా ఆపోజిట్ డైరెక్షన్‌లో ఒక అంబాసిడర్ కారు వస్తూ ఉంది.

వెనుకనుండి తరుముకువస్తున్న వ్యక్తులు దగ్గరయ్యారు. ఆంజనేయులునాయుడులో శక్తి తగ్గిపోయింది. రక్తం ధారగా కారుతూఉంది. అడుగుతూలింది. ముందుకు పడ్డాడు.

నిర్జనప్రదేశం అది! ఆంజనేయులునాయుడు పెద్దగా అరిచాడు. కాని ఆ అరుపు ఎవరికి వినిపిస్తుంది.

అతడు తనకు ఎదురుగా వస్తున్న కారు వంక చూశాడు. అది ఎవరిది? శత్రువులదయితే- ఇదే అఖరిరోజు. కాకపోతే...? ఆశనిరాశల మధ్య అంతిమక్షణాలు అనుకుంటూ కింద కూలాడు అతడు. జీవితంలో దేవుడిని తలచుకున్న మొదటిక్షణాలు అవి.

అతడికి ఎదురుగా వస్తున్న కారులో శ్రీనివాస్ ఉన్నాడు. రోడ్డువంక చూస్తూ డ్రైవ్ చేస్తున్న అతడి కళ్లు విభ్రాంతిలో తీక్షణమయ్యాయి. గుండె వేగం పెరిగింది. ఏం జరుగుతోంది అక్కడ?

ఎదురుగా ఒకవ్యక్తి రక్తం కారుతూ పరిగెత్తుకొస్తున్నాడు ప్రాణభయంతో? అతడిని తరుముకుంటూ పదిమంది మారణాయుధాలతో వస్తున్నారు. అతడు కారు యాక్సిలేటర్ మరింత కిందికి తొక్కాడు.

ఆంజనేయులునాయుడు కిందపడిన మూడుసెకనులలో వారు అతడిని సమీపించారు. వరుసగా- మూడు కత్తిపోట్లు, ఇంకా పొడిచి ఉండేవారేమో తెలియదు. అప్పటికే ఆ కారు దగ్గరగా వచ్చేసింది. వారి ముందు ఒక్కసారిగా ఆగింది. అడుగుదూరం కూడా లేదు.

వారు కంగారుపడ్డారు. అతడిని వదిలి దూరంగా పరుగెత్తారు.

శ్రీనివాస్ చప్పున డోర్ తెరుచుకుని కిందికి దిగాడు. కిందపడి కొట్టుకులాడుతున్నాడు ఆంజనేయులునాయుడు. అతడెవరో శ్రీనివాస్‌కి తెలియదు. కాని శ్రీనివాస్ అతడికి తెలుసు!

''ఎవరు.. ఎవరు వాళ్లు'' శ్రీనివాస్ అతడి తలను ఒడిలోనికి తీసుకుని అడిగాడు.

''నాకు శత్రువులు''

''మీరు?''

''నేను... నే...ను ఆంజ...నేయు...లు నా...యుడ్ని''

అతడెవరో అర్థమయింది శ్రీనివాస్‌కు. అతడెవరయినా ప్రాణాలు కాపాడే ప్రయత్నం చేయడం తన ధర్మం!

చాలా కష్టంమీద అతడిని కారులో చేర్చాడు శ్రీనివాస్. అప్పటికే అతడు చేతులు జోడించి ఏడుస్తూ ఉన్నాడు. ''నన్ను రక్షించు... రక్షించు''

శ్రీనివాస్ కారు సర్రున వెనక్కు తిప్పాడు. అప్పుడే ఆంజనేయులునాయుడు స్పృహతప్పాడు.

వెనుక ఉన్న మనిషికి చాలా గాయాలయ్యాయి. బతుకుతాడో, లేదో కూడా అనుమానమే...! శ్రీనివాస్ చాలా వేగంగా కారు ముందుకుపోనివ్వసాగాడు. పోతూనే ఆలోచించాడు. ఆ వ్యక్తిని మొదట లక్ష్మీ హాస్పటల్‌కి తీసుకెళదామని అనుకున్నాడు. కాని లక్ష్మి హాస్పిటల్‌కు రావడంలేదు. ఆమెను ఆ పరిస్థితిలో ఇబ్బంది పెట్టడం అతడికి ఇష్టంలేకపోయింది.

అందుకే అతడు కారును తిన్నగా హెడ్‌క్వార్టర్స్ ముందుకు తీసుకెళ్లాడు. క్షణాలలో ఎమర్జన్సీవార్డులో చేర్పించాడు. పోలీసులకు ఇన్‌ఫార్మ్ చేశాడు.

పావుగంటలో పోలీసులు హాస్పిటల్‌కు చేరుకున్నారు. శ్రీనివాస్ వారికి తనను పరిచయం చేసుకున్నాడు. ఆ తర్వాత ఇన్‌స్పెక్టర్‌కు జరిగింది యథాతథంగా వివరించాడు.

ఇన్‌స్పెక్టర్ కేసు వ్రాసుకున్నాడు. ఆ ఇన్‌స్పెక్టర్‌కి అప్పటికే అర్థమయింది. ఈ అటెంప్టెడ్ మర్డర్‌కేసు రేపు చాలా గొడవ సృష్టించబోతుందని! ఎలాగంటే- హత్యాప్రయత్నానికి గురయిన వ్యక్తి పేరున్న ఒక రాజకీయనాయకుడు. రాజకీయనాయకులమీద ఈగవాలినా అతని భక్తబృందం ఒప్పుకోదు. అందుకు ప్రతిగా ఎన్ని దారుణాలయినా చేస్తారు. జనాలు ఇబ్బందిపడ్డా వారు సరకు చేయరు. ఒక ప్రాణానికి పది ప్రాణాలు బలిఅయినా లెక్కలేదు వారికి!

శ్రీనివాస్ పన్నెండింటివరకూ. హాస్పిటల్‌లోనే ఉన్నాడు. అప్పటికే ఆ వార్త చేరవలసిన వారందరికీ చేరిపోయింది. పార్టీ కార్యకర్తలు వందల సంఖ్యలో హాస్పిటల్‌ముందు చేరిపోయారు. నాయకులు డాక్టర్లతో చర్చలు జరపసాగారు. విలేకరులు ఈ వార్తను గురించి వివరాలు శ్రీనివాస్‌ని కూడా అడిగారు. న్యూస్ పత్రికాఫీసులకు కూడా చేరిపోయింది.

ఇక అక్కడ తన అవసరం లేదనుకున్నాడు శ్రీనివాస్. నీరసంగా వచ్చి తన కారులో కూర్చున్నాడు. అతడి బట్టలన్నీ రక్తంతో తడిసి ముద్దయిఉన్నాయి. 'ప్చ్! పాపం ఆ వ్యక్తి బతుకుతాడో- లేదో' బాధగా అనుకున్నాడు అతడు. కుళ్లిన రాజకీయాలమీద అతడికి కోపం వచ్చింది. ఏమీ చేయలేని నిస్సహాయతతో అరచేతిని స్టీరింగ్ మధ్య కొట్టాడు. హారన్ మోగింది. కొంతమంది కారువంక చూశారు.

కారు రివర్స్ చేశాడు. గెస్ట్‌హౌస్ వరకూ వెళ్లే ఓపికలేదు. అక్కడికి వెళ్లినా- ఈ పరిస్థితులలో ఒంటరితనం పిచ్చిపట్టినట్టుగా అనిపిస్తుంది. అందుకే అతడు కారు లక్ష్మి ఇంటివైపు పోనిచ్చాడు.

లక్ష్మి కారు ఆగటంతోనే వాకిలివంక చూసింది. రక్తంతో తడిసిన అతడి బట్టలు చూడగానే ఆమెకు గుండె ఆగినంతపనయింది. ''ఏమిటి...? ఏమయింది?'' కంగారుగా అడిగింది.

శ్రీనివాస్ బలవంతంగా నవ్వాడు. మెల్లగా జరిగింది చెప్పాడు. ఆమె భయంగా చూసింది అతడివంక. ''వాళ్లు పారిపోయారు కాబట్టి సరిపోయింది. మీరు చూశారని మీ మీదకు కూడా దాడికి వచ్చిఉంటే?''

''జరగలేదు. అలాంటివి ఊహించుకుని

భయపడటం మనిషికి మంచిది కాదు'' చెప్పాడు.

''ముందు మీరెళ్లి స్నానం చేసి, బట్టలు మార్చుకోండి. మిమ్మల్ని ఇలా చూడలేకున్నాను'' ఆమె అప్పుడప్పుడే కంగారు తగ్గించుకుంటోంది.

అతడు భుజాలెగరేశాడు. ఆమె అందించిన అవినాష్ బట్టలు తీసుకుని బాత్ రూమ్‌లోకెళ్లాడు. తలస్నానం చేసి బట్టలు మార్చుకునేప్పటికి కాసంత ఫ్రెష్‌గా అనిపించింది. అతడు తల తుడుచుకుంటూ వచ్చి హాలులో కూర్చున్నాడు.

''భోంచేయండి'' అప్పటికే అతడికోసం చాలారకాల వంటకాలు చేసి ఉంచిందామె.

అతడికి భోంచేయాలనిపించలేదు. అతడి కన్నులముందు రక్తపుముద్దగా తన ఒడిలో వాలిన ఆంజనేయులునాయుడు కదలాడుతున్నాడు.

''ఆకలిగా అనిపించడంలేదు లక్ష్మీ!... ఒక కప్పు హార్లిక్స్ ఇవ్వు చాలు''

ఆమె అతడివంక కొద్దిక్షణాలు తదేకంగా చూసి, మాటుమాట్లాడకుండా వంటగదిలోనికి వెళ్లింది. ఆమె తిరిగి వచ్చేసరికి అతడు ఫోన్లో ఎవరితోనో మాట్లాడుతున్నాడు.

''మిస్టర్ చతుర్వేది... జరిగింది మీకూ తెలిసే ఉంటుంది. ఈ రోజుకి యూనియన్ లీడర్ల సమావేశం వాయిదావేయండి''

అవతలివైపు ఏం మాట్లాడారో ఆమెకు వినిపించలేదు. అవతలివైపు మాటలు మౌనంగా విన్నాక, ''ఆల్‌రైట్'' అంటూ ఫోన్ పెట్టేశాడు అతడు.

ఆమె అతడికి హార్లిక్స్ అందించింది. హార్లిక్స్ తాగుతూ దీర్ఘాలోచనలో పడిపోయాడు శ్రీనివాస్. ఆమె అతడి ఆలోచనలకు అంతరాయం కలిగించలేదు. పరీక్షగా, ఆప్యాయంగా, అభిమానంగా అతడి ముఖంలోనికే చూస్తూ ఉండిపోయింది. 'నిన్ను ఎవరు పెళ్లాడబోతారోగానీ, ఆమె చాలా అదృష్టవంతురాలు... ఎందుకో తెలుసా? అన్నిటికన్నా గొప్ప సుగుణం- అవతలవ్యక్తిని అర్థం చేసుకోగలిగిన తెలివితేటలు నీలో ఉన్నాయి' ఆమె అనాలనుకుంది. అనలేక ఆగిపోయింది.

చాలాసేపు హాలులో అటుఇటు పచార్లు చేశాక, ''నేను కాసేపు రెస్ట్ తీసుకుని వస్తాను లక్ష్మీ'' అన్నాడు అతడు.

''ఇక్కడే పడుకోండి కాసేపు'' అంది లక్ష్మి.

''లేదు... నేను గెస్ట్‌హౌస్ కెళ్తాను'' ఆమె జవాబుకోసం ఎదురుచూడకుండా బయటకు నడిచాడు.

మరుక్షణం అతడి కారు స్టార్టయిన శబ్దం! అరనిమిషం తర్వాత ఆ శబ్దం మెల్లగా దూరమయింది.

ఆమె అతడు వెళ్లినవైపే చాలాసేపు చూస్తుండిపోయింది. తర్వాత ఎందుకో తెలియదు. మెల్లగా నిట్టూర్చింది.

శ్రీనివాస్ పదిమినిషాలలో తన గెస్ట్‌హౌస్ చేరుకున్నాడు. అలసటగా బెడ్‌మీద వాలిపోయాడు. బడలికగా అనిపించింది. అందులోనూ కాసింత అనీజీగా ఉంది. తన చేతులలో ఒక మనిషి మరణయాతనపడిన దృశ్యం గుర్తుకు వస్తుంటే, మెటీరియలిస్టిక్ అవుట్ లుక్ కలిగిన అతడు కూడా బాధను ఫీల్ అయ్యాడు. గట్టిగా కన్నులు మూసుకున్నాడు శ్రీనివాస్. ఎన్నడూలేదు, అతడికి నిద్రపట్టేసింది.

మెలకువ వచ్చేసరికి నాలుగయింది. వంటవాడు కాఫీ అందించాడు. తాగి కప్పు కిందపెడుతుండగా ఫోన్ మోగింది. అవతలివైపు మాట్లాడుతోంది తన తల్లి.

''శీనూ! నేను ఈ రాత్రికి బయలుదేరుతున్నాను... రేపు పదింటికి అక్కడికి చేరుకుంటాను. స్టేషన్‌కి కారు పంపించు''

''అలాగేనమ్మా''

''గాయత్రి నువ్వు ఫోన్ చేశావని చెప్పింది. ఏదయినా విశేషమా అంటే లేదని అన్నది... ఇంతకీ ఎందుకు ఫోన్ చేసినట్టు?''

''ఏమీ తోచక''

''సరే... నేను ఉంటాను''

''అలాగే'' ఫోన్ పెట్టేశాడు అతడు. వెంటనే ఏదో గుర్తుకు వచ్చి హెడ్‌క్వార్టర్స్ హాస్పిటల్‌కి ఫోన్‌చేసి అడిగాడు. 'ఆంజనేయులు నాయుడికి ఎలా ఉందని?''

''అతడి పరిస్థితి మరీ సీరియస్‌గా ఉంటే మద్రాసుకు తీసుకువెళ్లారని'' జవాబు అందింది.

అంతేకాదు, మరో విషయం కూడా తెలిసింది అతడికి. 'అంజనేయులునాయుడు మీద హత్యాప్రయత్నాన్ని ఖండిస్తూ, మర్నాడు అతడి పార్టీ 'జిల్లా బంద్ చేయబోతుందట'

అతడికి నవ్వొచ్చింది. అప్రయత్నంగానే అతడి పెదాలు పలికాయి.

''బంద్''

★ ★ ★

ఈ ప్రపంచంలో కొన్ని పెద్ద సమస్యలు చాలా చిన్నవిగానే మొదలవుతాయి. మెల్లగా పెద్దవయి వికృత రూపాన్ని సంతరించుకుంటాయి. ఒక గొప్ప ప్రయోజనంకోసం విదేశీయుల్ని దేశంనుండి వెడలగొట్టేందుకు ఒక మహాత్ముడు సత్యాగ్రహం, నిరాహారదీక్ష మొదలెడితే, ఒక రౌడీని జైలులోనుండి విడుదల చేయాలని నిరాహారదీక్షలు చేసేవారు కూడా బయలుదేరారు. మంచిని, చెడుకు వాడుకోడం స్వార్థపరులకు అలవాటయిన విషయమే! ఈ బంద్ అనే పదం ఎక్కడ, ఎలా మొదలయిందో తెలియదుగానీ, దానియొక్క వికృతరూపం ఈమధ్యకాలంలోనే బయటపడింది. నలుగురిని పోగెయ్యగలిగిన వాడెవడయినా 'బంద్' చేయడానికి అర్హుడే! 'బంద్'కి పెద్ద కారణమే ఉండవలసిన అవసరంలేదు. 'మా నాయకుడి పెళ్లాం ఎదురింటివాడితో లేచిపోయింది. అందుకు విదేశీశక్తులే కారణం'. ఈ కారణం చాలు!బంద్ చెయ్యడానికి

'బంద్'ను జనులు స్వచ్ఛందంగా జరపడంలో ఒక అర్థం ఉంది. కాని కర్రలు పట్టుకొని దుకాణాలు మూయించడమేమిటి? ఈ ప్రజాస్వామ్యదేశంలో జనుల ఇష్టాఇష్టాలతో పని లేదా? పైగా వారు చెప్పినట్టు చేయకపోతే దౌర్జన్యం! ఇదెక్కడి న్యాయం?

అంతేకాదు- ఈ సమయంలో జరిగే లూటీలు, దొంగతనాలు చాలా ఘోరంగా ఉంటాయి. ఒకవ్యక్తి తన జీవితకాలాన్ని వెచ్చించి, ఎన్నో ఆనందాలను త్యజించి పోగుచేసిన ధనం, ఒక్క... ఒక్క గంటలో ఈ అరాచకవాదులు అపహరించుకుపోతారు. జరుగుతున్న చరిత్ర ఇది.

ఈ బంద్‌లను రాజకీయపార్టీలు సగర్వంగా ప్రకటిస్తాయి. మేము ఫలానా కారణాన భారత్ బంద్ చేస్తున్నాం. ఇందుకోసం 'రాష్ట్రబంద్' చేస్తున్నాం అంటూ. ఒక్కరోజు బంద్ జరిగితే దేశంలో ఉత్పత్తి ఎంతగా పడిపోతుందో, జనులు ఎలాంటి ఇబ్బందులకు గురవుతారో ఈ నాయకులకు తెలియదు కాబోలు. వీరికి దేశంపట్ల కొద్దిగానయినా బాధ్యత ఉందా? జనంపడే ఇబ్బందులపట్ల సానుభూతి ఉందా?

బంద్ జరిగితే కూరల ధరలు పెరుగుతాయి. ప్రయాణీకులకు తిండి దొరకదు. ఈ బంద్‌ల కారణంగా విదేశీ ప్రయాణికులకు తిండి దొరకదు. ఈ బంద్‌ల కారణంగా విదేశీ ప్రయాణికులు మెల్లగా భారతదేశం సందర్శించటం అనే కోరిక చంపుకుంటారు. మనకు వచ్చే ఆ కొద్దిపాటి విదేశీమారకద్రవ్యం కూడా రాకుండాపోతుంది. ఇవన్నీ బంద్‌వలన ఏర్పడే కొన్నిరకాల ఇబ్బందులు.

ఏదేమయినా 'బంద్' అనే ఈ సమస్యను గురించి జనం ఆలోచించవలసిన కాలం దగ్గరయింది.

★ ★ ★

అతడు డాబామీద కుర్చీలో కూర్చుని ఆకాశంలో నక్షత్రాలు లెక్కపెట్టసాగాడు. ఒకటీ... రెండు... మూడు... వంద... వెయ్యి... ఊహు! లెక్కపెట్టడం కుదరడంలేదు. అసంఖ్యాకం మరి!

అతడికి తన చిన్నతనం గుర్తుకువచ్చింది. చిన్నప్పుడు కూడా తను అలాగే నక్షత్రాలు లెక్కపెట్టేవాడు. నాన్నమ్మ అలా చేయవద్దంటూ కోపపడేది. 'నక్షత్రాలు లెక్కపెట్టినవాడికి కష్టాలు వస్తాయట'

'ఎలాంటి కష్టాలు నాన్నమ్మా?' అమాయకంగా ప్రశ్నించేవాడు తను.

''నీకు పెళ్లికాదు. అదీ కష్టం''

తనకు బాధనిపించేది కాదు. సిగ్గనిపించేది 'పో నానమ్మా' అనేవాడు. అయితే

చుక్కలు లెక్కపెట్టడం మాత్రం ఆపేవాడుకాదు.

చిన్నతనపుజ్ఞాపకాలు అతడిని మురిపించాయి. అతడి పెదాలమీద సన్నని చిరునవ్వు!

''ఎందుకు నవ్వుతున్నారు?'' లక్ష్మి ప్రశ్న అది.

''పాత జ్ఞాపకాలు''

''ఏమిటో అవి?'' లక్ష్మి పిట్టగోడకు ఆనుకుని ఉంది. పున్నమినాటి చంద్రుడు ఇద్దరినీ చూస్తున్నాడు కుతూహలంగా!

''నాకు నా చిన్నతనం జ్ఞాపకం వస్తోంది లక్ష్మీ''

ఆమె మాట్లాడలేదు. అతడే చెప్పాడు. ''మా నానమ్మ అనేది- చుక్కలు లెక్కపెడితే పెళ్లికాదని! అది నిజమో- నన్ను భయపెట్టేందుకు అలా అనేదో తెలియదుగానీ అది వాస్తవమయి నన్ను వెక్కిరిస్తోంది.

ఆకాశంలోని ఓ నక్షత్రం నేలకు జారి భూదేవిని ముద్దాడాలనుకుంటున్నట్టుంది. నేలకు జారుతున్న ఆ తారవంక నెలరాజు ఆశగా చూస్తున్నాడు. కదలాడే జామచెట్టు ఆకుల శబ్దం, మల్లెల సౌరభాన్ని మెల్లగా మోసుకువచ్చే గాలి, కురిసే వెన్నెల... మనసులో ఆనందం లేనినాడు భావుకత కూడా బాధనే జ్వలింపచేస్తుంది.

నిశ్శబ్దం క్షణాలను లెక్కవేయసాగింది. అర వైక్షణాలు!

ఆ టాపిక్ ఆమెకే కాదు, అతడికి కూడ ఇబ్బందికరంగా తోచినట్టుంది. ఏదో మాట్లాడాలి! మరేదో మాట్లాడాలి.

''రేపుదయం అమ్మ హైదరాబాద్‌నుండి వస్తుంది. నిన్ను చూడాలని ఉందిట''

''స్టేషన్‌కి వెళ్తారా?''

''వెళ్లాలి... ఉదయం తొమ్మిదిగంటలకు మా జి.యమ్. కూతురి పెళ్లికి అటెండ్ అయ్యి, ముప్పావుగంట అక్కడ గడిపాక తిన్నగా స్టేషన్‌కి వెళ్తాను'' అటునుండి అమ్మను నీ దగ్గరకే తీసుకొస్తాను''

''తీసుకురండి... ఆంటీని చూసి చాలాకాలమయిపోయింది''

''అన్నట్టు- నువ్వు హాస్పిటల్‌లో చేరవలసింది ఎప్పుడు''

''రేపే. ఆంటీ వచ్చాక ఇద్దరం కలసి హాస్పిటల్‌కి వెళ్దాం! నేను హాస్పిటల్‌లో అడ్మిట్ అవుతాను. కొద్దిరోజులపాటు ఆంటీని నాతోపాటు ఉంచుకుంటాను''

''అవినాష్ ఢిల్లీనుండి రేపే బయలుదేరుతాడుకదూ?''

''రావచ్చనుకుంటున్నాను''

''ఈరోజే ఫోన్‌లో మాట్లాడుతాను. నీ పరిస్థితి ఇలా ఉంటే అతడలా ఏమీ పట్టనట్టు తిరుగుతుంటే ఎలా? అడిగేస్తాను''

''వద్దొద్దు'' చప్పున అందామె. ''అతడు హర్ట్ అయ్యే అవకాశం ఉంది''

అతడు విసుగ్గా ఏదో అనబోయి ఆమె ముఖం చూసి ఆగిపోయాడు. ''ఆల్‌రైట్! అలాగే కానివ్వు'' అన్నాడు లోగొంతుకతో.

కాసేపటి తర్వాత ఆమె అంది, ''మంచు కురుస్తున్నట్టుంది. కిందికి వెళ్దామా?''

అతడికి ఆచోటు ఎంతో నచ్చింది. వెన్నెలనీడలో డాబా మీద, చల్లని మంచు మెల్లగా ముఖాన్ని స్పృశిస్తుంటే... అయితే ఆమె ఆరోగ్యం దృష్ట్యా మెల్లగా తలూపాడు.

ఇద్దరూ కిందికి దిగారు. అతడు హాలులోని సోఫాలో కూర్చుంటే అతడికి ఎదురుగా కూర్చుందామె.

మాటల మధ్యన ఆమె అంది ''రేపు బంద్ జరగబోతుందని విన్నాను. దానివలన మీకేమీ ఇబ్బంది ఎదురుకాదుకదా!''

అతడు చెప్పాడు. ''నా మిల్ దగ్గర పోలీస్ ప్రొటక్షన్ ఉంది. నా మిల్‌కి ఏమీకాదు'' అని ఆగాడు. ''ఇక ఇబ్బంది అంటే- ట్రాఫిక్ ఆపడంలాంటి వాటివలన అందరిలాగే మనమూ కొద్దిగా ఇబ్బందిపడతాం. అంతేకదా''

ఆమె తలూపింది.

అతడు భోంచేశాక, కారులో గెస్ట్‌హౌస్‌కి వెళ్లిపోయాడు.

★ ★ ★

ఉదయమే అతడు పేపర్ ముందేసుకుని కూర్చున్నాడు.

హెడ్‌లైన్స్‌లోనే ఉంది 'ఆంజనేయులునాయుడి మీద జరిగిన హత్యాప్రయత్నం గురించిన వార్త'

అతడు ఆసక్తిగా ఆ వార్తను చదివాడు. అంతా విపులంగా రాసివుంది. తన పేపర్ మిల్‌లో జరిగిన సస్పెన్షన్స్, జరుగుతున్న సమ్మె, మేనేజ్‌మెంట్‌తో మాట్లాడేందుకు ఆంజనేయులునాయుడు బయలుదేరడం- మధ్యలో జరిగిన హత్యాప్రయత్నం... చివరగా- ఆంజనేయులునాయుడు చావుబ్రతుకుల మధ్య ఉన్నాడట. ఇరవైనాలుగుగంటలు గడిస్తేగానీ ఏ విషయం చెప్పలేరట...''

శ్రీనివాస్ దీర్ఘంగా నిట్టూర్చాడు. ఆ వార్త యొక్క ప్రభావం జిల్లా యువకులమీద ఎంతగా ఉంటుందో అతడూహించాడు. కాని అతడూహించినదానికన్నా బంద్ తీవ్రత ఎక్కువగా ఉందని అతడికింకా తెలియదు.

పేపర్ చదవటం పూర్తయ్యాక లేచి వెళ్లి స్నానం చేశాడు. డ్రస్‌వేసుకున్నాడు అప్పటికి సమయం ఎనిమిదిన్నరయింది.

గెస్ట్‌హౌస్ టౌన్‌కి కాసింత దూరంలో ఉంది. ఆ కారణానే అప్పటికే టౌన్‌లో చెలరేగిన అలజడి అతడికింకా తెలియదు.

డ్రసప్ అయ్యాక వంటమనిషి తెచ్చి ఇచ్చిన కాఫీ తాగాడు. 'సోమనాధ్ కూతురి పెళ్లి తొమ్మిది, తొమ్మిదిన్నర మధ్య. తను తొమ్మిదింటికి పెళ్లి మండపం చేరుకుని తొమ్మిదిన్నరకు వచ్చేయొచ్చు. పదింటికి స్టేషన్ చేరుకుంటే, అమ్మను పికప్ చేసుకుని లక్ష్మి దగ్గర వదిలేయడం! ఆ తర్వాత లక్ష్మిని హాస్పిటల్‌లో చేర్పడమూ... ఈ రోజుకి ఇవీ ప్రోగ్రాములు' అనుకున్నాడు అతడు.

కాఫీ తాగడం అయ్యాక, బయటకు నడవబోతుంటే ఫోన్ మోగింది. అతడు దానివంక అదోలా చూశాడు. ఆ వంక నడిచి రిసీవర్ చేతిలోకి తీసుకున్నాడు. అవతలివైపు మాట్లాడేది సోమనాధ్ ''హలో సోమనాధ్‌గారూ... ఏమిటి విషయం?'' అడిగాడు శ్రీనివాస్.

అవతలివైపు సోమనాధ్ గుటకలు మింగాడు ''సార్! టౌన్‌లో బంద్ ప్రభావం చాలా ఎక్కువగా ఉంది సార్! మేము ఎనిమిదింటికి కల్యాణమండపం చేరుకోవాలని ప్రయత్నిస్తే, దారిలోనే ఆందోళనకారులు మమ్మల్ని ఆపుచేశారు. ఇప్పుడేం చేయాలో తోచడంలేదు''

''మీరు పోలీస్ రిపోర్ట్ ఈయకూడదూ? వారు మీకు ప్రొటెక్షన్ ఇస్తారు''

''ప్రయత్నించాం సార్! కాని ఈరోజు బంద్ కారణాన పోలీస్ బలగమంతా శాంతిని కాపాడేందుకు అన్ని సెంటర్స్‌కూ పంపారట''

''బంద్ ప్రభావం అంత తీవ్రంగా ఉందా?''

''అవును సార్! ఆందోళనకారులు కనీసం సైకిల్‌ని కూడా రోడ్డుమీద వెళ్లనివ్వడం లేదు''

''ఐసీ''

శ్రీనివాస్ రెండు సెకనులు ఆలోచించాక చెప్పాడు. ''ఆల్‌రైట్! నేను మరో పదినిమిషాలలో మీ ఇంటి దగ్గరకు వస్తున్నాను''

''వద్దు సార్! మీరు రావడం ప్రమాదమేమో... సైకిళ్లనే పోనివ్వనివారు కారును వదులుతారా?''

''ప్రయత్నిస్తాను''

అతడు రిసీవర్ పెట్టేశాడు. కొద్దిసేపు అక్కడే నిలబడి ఆలోచించాడు. 'సోమనాధ్ తన మిల్ మేనేజర్! అతడి ఇంటిలో పెళ్లి ఆగకుండా చేయవలసిన బాధ్యత తనమీద ఉంది. తనిప్పుడు ఏం చేయాలి? పోలీస్‌స్టేషన్‌కి వెళ్లి పోలీస్ ప్రొటెక్షన్ కోరితే? ప్రయోజనం ఉండకపోవచ్చు. అందుకే ఎలాగో తను సోమనాధ్ ఇంటికి చేరుకోవాలి. అక్కడికి చేరుకున్నాక ఏదోవిధంగా వారిని కల్యాణమండపం చేర్పించవచ్చు...''

ఆలోచించుకుని బయటకు నడిచాడు. పోర్టికోలో ఉన్న కారు దగ్గరగా వెళ్లి డోర్‌మీద చెయ్యివేశాడు.

''ట్రింగ్... ట్రింగ్'' లోపల ఫోన్ రింగయిన శబ్దం వినిపించింది. అతడు ఆగాడు.

డోర్‌మీదనుండి చెయ్యితీసి వెనుతిరిగాడు. లోపలికి నడిచి రిసీవర్ చేతిలోనికి తీసుకున్నాడు.

"హలో...!"

"శ్రీనివాస్! నేను లక్ష్మి తల్లిని..." ఆమె గొంతు గాభరాగా వినిపించింది. "ఇక్కడ అమ్మాయి నొప్పులతో బాధపడుతోంది. హాస్పిటల్‌కి తీసుకువెళ్లాలంటే- కారును పోనివ్వలేదు. కొద్దిదూరం వెళ్లి తిప్పుకుని వచ్చేశాం..."

అతడు "ఒక్కనిమిషంలో అక్కడికి వచ్చేస్తాను" అంటూ ఫోన్ పెట్టేశాడు. పరుగులాంటి నడకతో కారు దగ్గరికి వెళ్లి కూర్చున్నాడు. ఒక్క జర్క్‌తో ముందుకు కదిలింది కారు.

వీధులన్నీ దాదాపు నిర్మానుష్యంగా ఉన్నాయి. ఒకటీ, రెండు సెంటర్లలో బంద్ నిర్వాహకులు కర్రలు చేతపట్టుకుని నిలబడి ఉన్నారు. ఒక్క వాహనం కూడా రోడ్డు వెంబడి పోవటంలేదు. ఏదయినా ఒక వాహనం పొరపాటున అటుగా వస్తే, దానిని ఆపుచేసేస్తున్నారు వారు.

అప్పటివరకూ సందు గొందులు వెంట అతడి కారు ప్రయాణిస్తోంది. అలా వెళుతూనే దూరంగా కనిపించే సెంటర్లలోని పరిస్థితిని అంచనా వేయసాగాడు అతడు.

ఎట్టి పరిస్థితిలోనూ ఆ మూక కారును రోడ్డుమీద పోనివ్వదని అర్థం అయింది అతడికి. కాని తనిప్పుడు ఆ మెయిన్‌రోడ్ మీద కొద్దిదూరం ప్రయాణించాలి. ఏదో ఒక సెంటర్ క్రాస్ చేయకుండా లక్ష్మి ఇంటికి చేరుకోవడం సాధ్యంకాదు. మరెలా?

రిస్క్ తీసుకోకతప్పదనిపించింది.

అయినా వీళ్లిలా జనాల్ని ఇబ్బందులపాలు చేయడంవలన వీరికి ఒరిగేదేమిటి?

అతడు ఆ సందులోనుండి స్లోగా మెయిన్ రోడ్ మీదకు వచ్చాడు. వందమీటర్లు ప్రయాణించాక ఓ గుంపు కనిపించింది. స్లో చేశాడు. గుంపు దగ్గరయ్యేకొద్దీ మరింత స్లో చేశాడు. కారు రోడ్డుకు రెండో చివర వెళ్లటంలేదు. గుంపు ఏవైపు ఉందో ఆ వైపే... వారి దగ్గరకే వస్తున్నట్టు రాసాగింది. వారూహించారు- తమ పార్టీ నాయకులెవరో తమ దగ్గరకే వస్తున్నట్టుగా!

దాంతో మూక చాలా రిలాక్సింగ్‌గా ఉండిపోయింది.

శ్రీనివాస్ జనానికి పదిగజాల దూరం వచ్చాక చప్పున సైడ్‌కి కోశాడు. గేర్ కూడా మార్చలేదు. అమితవేగంగా ముందుకు లాగించాడు.

అతడు చేసిన ట్రిక్ అర్థమయ్యేందుకు వారికి అరుక్షణాలు పట్టింది. అప్పటికి అతను అరవైగజాల దూరం వెళ్లిపోయాడు.

వెనుకచేరి వారు పెద్దగా అరవసాగారు. అతడు వినిపించుకోలేదు. అతడి మనసంతా లక్ష్మి దగ్గరే ఉంది. ఆమెకిప్పుడు ఎలా ఉందో?

దూరంగా మరో గుంపు కనిపించడంతో మరో సందులోనికి తిప్పాడు. నాలుగుసందులు దాటి తిరిగి రోడ్డెక్కాడు.

అతడు ఇంటికి చేరుకునేసరికి లక్ష్మి తల్లి వాకిట్లో నిలబడి అతడికోసమే ఎదురుచూస్తోంది.

"ఈ సమయంలోనే అవినాష్ లేకపోయాడు. అమ్మాయిని హాస్పిటల్‌కి తీసుకువెళ్లడం ఎలాగో అర్థం కావట్లేదు."

"లక్ష్మి ఏది?"

"బెడ్‌రూమ్‌లోనే ఉంది?"

అతడు ఆ వంక నడిచాడు.

"అమ్మా... అమ్మా..." లక్ష్మి పెద్దగా అరుస్తూ ఉంది. ఆ నొప్పులను భరించడం కష్టంగా ఉన్నట్టుంది.

లోపలికి నడిచాడు అతడు. లక్ష్మి బెడ్‌మీద మెలికలు తిరిగిపోతూ ఉంది. తుఫానుగాలికి గులాబీమొక్కలా కదిలిపోతూంది.

అతడు బెడ్ దగ్గరగా నడిచాడు. "లక్ష్మీ" పిలిచాడు. ఆమెను ఆ పరిస్థితిలో చూస్తుంటే అతడికి చాలా బాధగా ఉంది. సృష్టికి ముందు స్త్రీ పడేవేదన ఎంత భయంకరంగా ఉంటుందోకదా! అనుకున్నాడు అతడు.

ఆమె కన్నులు తెరచి అతడిని చూసింది. ఆ క్షణాన నొప్పులు తగ్గినట్టనిపించాయో లేక అతడి సాన్నిహిత్యం ధైర్యాన్నిచ్చిందేమో తెలియదు. కొద్దిక్షణాలపాటు అరవడం ఆపేసింది.

"డాక్టర్ చెప్పిన డేట్ రేపు కదా లక్ష్మీ?"

"ముందుగానే డెలివరీ అయ్యేలా ఉంది"

''డాక్టర్‌ని రమ్మని ఫోన్ చేసి చెప్పేదా?''

''ఎలా రాగలదు ఆమె? బంద్ కదా! .... మనమే వెళ్ళాలి... ముందుగా ఫోన్ చెయ్యండి'' ఆపేసింది. కడుపు ఒక్కసారిగా మెలితిరిగినట్టుగా ''అమ్మా'' అంది పళ్ళబిగువున బాధను అదిమిపెట్టాలని విఫలయత్నం చేస్తోందామె.

అతడు పైకి లేచాడు ''హాస్పిటల్ నెంబర్ ఎంత?''

''జయప్రద ఆంటీదా?...''

తలూపాడు అతడు.

చెప్పిందామె.

అతడు ఫోన్ దగ్గరగా నడిచాడు. రింగ్ చేసాడు. అవతలి వ్యక్తి లైన్‌లోనికి వచ్చాక చెప్పాడు ''ఆంటీ! లక్ష్మి నొప్పులు పడుతోంది''

''అలాగా!... వెంటనే హాస్పిటల్‌కు తీసుకు రండి''

''కాని ఎలా?''

బంద్ గుర్తుకు వచ్చిందేమో! ''అవును ఎలా?'' అందామె కూడా!

''అంబులెన్స్ ఉందా?''

''లేదు''

అతడు రెండు సెకనుల తర్వాత చెప్పాడు ''ఆల్‌రైట్ ఆంటీ! నేనే కారులో తీసుకువస్తున్నాను''

''రాగలరా?''

''ప్రయత్నిస్తాను''

అతడు రిసీవర్ పెట్టేసాడు. బెడ్‌రూమ్ లోనికి వెళ్ళాడు. ఆలస్యమయ్యేకొద్దీ లక్ష్మి పరిస్థితి ఘోరంగా తయారవుతుందని తెలుసు అతడికి. అందుకే మరేమీ మాట్లాడకుండా ఆమెను కారు దగ్గరకు తీసుకువచ్చాడు. వెనుక సీటులో పడుకోబెట్టాడు.

''బిడ్డ అడ్డం తిరిగినట్టుగా అనిపిస్తోంది'' డాక్టర్‌గా ఆమెకు తన పరిస్థితి ఏమిటో అర్థమయిపోయినట్టుంది.

ముందు సీట్లో తను కూర్చున్నాక లక్ష్మి తల్లిని ''కూర్చోండి ఆంటీ'' అన్నాడు అతడు. ఆమె కూర్చుంది.

కారు కదిలింది.

ఇంతకుముందు సందు, గొందులలోనుండి లక్ష్మి ఇంటికి రాగలిగాడు కాని ఇప్పుడు హాస్పిటల్‌కి వెళ్లాలంటే మెయిన్‌రోడ్‌లో నుండే వెళ్ళాలి. అల్లరిమూకను తప్పించుకునే వెళ్లాలి. ఎలా?!

వెనుక సీటులో లక్ష్మి హృదయం ద్రవించేలా ఏడుస్తోంది. ఓ స్త్రీ! ఈ భూమి మీద కష్టాలన్నీ మీ జాతికేనేమో!... ప్రసవవేదన ఇంత భయంకరంగా ఉంటుందా?!

ఆమె కడుపులోని బిడ్డ అడ్డం తిరిగింది. త్వరగా ఆపరేషన్ చేయకపోతే తల్లిప్రాణం ప్రమాదంలో పడే అవకాశం ఉంది. త్వరగా... వీలయినంత త్వరగా లక్ష్మిని హాస్పిటల్‌కు చేర్చాలి!

యాక్సిలేటర్ బలంగా కిందికి నొక్కాడు అతడు. అతడికి ఆక్షణం మరేదీ గుర్తుకులేదు. సోమనాథ్ ఇంటిలోని వ్యక్తులు తనకోసం ఎదురుచూస్తుంటారని, వారింటిలోని పెళ్ళి 'బంద్' కారణంగా అడ్డంకులు ఎదుర్కొంటుందని మరచిపోయాడు. తన తల్లి హైదరాబాదు నుండి బయలుదేరి వచ్చిందని, ప్రస్తుతం రైల్వేస్టేషన్‌లో తనకోసం ఎదురుచూస్తుంటుందని జ్ఞాపకంలేదు. అది గుర్తుకు వచ్చినా తను చేయగలిగింది ఏమిటి?! అతడి ప్రస్తుత ఆలోచన ఒక్కటే-లక్ష్మిని హాస్పిటల్‌కు చేర్చాలి!

వీధి మలుపు తిరిగాడు. ఎదురుగా సెంటర్‌లో అల్లరిమూక ఉంది. రోడ్డు బ్లాక్ చేసేసి ఉన్నారు వాళ్ళు. తప్పదు. మరో మార్గం లేదు. హాస్పిటల్‌కు వెళ్ళాలంటే అటుగానే వెళ్ళాలి.

వాళ్ళు తన కారును ఆపరని అతడి నమ్మకం. వెనుకసీటులో ప్రసవవేదనపడే స్త్రీని చూసయినా వారు తనను గమ్యం పోనిస్తారనే ఆశ అతడిలో ఉంది.

అల్లరిమూక దగ్గరయింది. వాళ్ళు రోడ్డుకు అడ్డంగా నిలబడి కారును ఆపమన్నట్టుగా చేతులూపారు.

అతడు కారులోనుండే వాళ్ళని గమనించా

డు. వాళ్ళలో ఎక్కువమంది పాతికేళ్ళలోపువారే! వీరికి ఏదయినా ఒక సమస్యపట్ల అవగాహన ఎంతవరకూ ఉంటుంది. వీరేనా ఒక 'బంద్'ను నిర్వహించగల సమర్థులు? కాదు- రాజకీయ నాయకుల చేతిలో పావులు!

కారును వారిదగ్గరగా ఆపాడు. జనం కారు చుట్టూ మూగారు. అందులో ఒకడు కారు లోపలికి తొంగిచూసి "ఏయ్! ఈరోజు బంద్ అని తెలియదా? కారుని ఎలా రానిచ్చావు?" అని దబాయిస్తున్నట్టు అడిగాడు.

అతడు కారు వెనుకసీటులో చూపించాడు. "చూడండి! వెనుక ఓ స్త్రీ ప్రసవవేదన పడుతోంది... తొందరగా హాస్పిటల్‌కు తీసుకువెళ్ళాలి" అతడి కంఠం కొద్దిగా వణికింది.

ఇద్దరు ముగ్గురు వెనుకసీటులోనికి తొంగి చూసారు. లక్ష్మి బాధను భరించలేక అరుస్తోంది.

వాళ్ళు ఆమెను, అతడిని మార్చి చూసారు... "ఎవరికేమయినా సరే ఈరోజు ఒక్క వాహనం కూడా రోడ్డుమీద నడిచేందుకు లేదు"

శ్రీనివాస్ వాళ్ళ వంక అదోలా చూసాడు. సాటి మనిషి ప్రాణాపాయంలో ఉంటే, చూస్తూ ఏమీ పట్టనట్టుగా మాట్లాడే వీరిని ఏమనాలి? శాడిస్టులా?!

అతడు కారు దిగాడు. చాలా జాలిగా, రిక్వెస్టింగ్‌గా అడిగాడు. "చూడండి! ఆమెను హాస్పిటల్‌కు చేర్చడం లేటయితే... బహుశా ఆపరేషన్ చేయాల్సి వస్తుందేమో!... ప్లీజ్! మమ్మల్ని హాస్పిటల్‌కు పోనివ్వండి" అతడి జీవితంలో అవతలివారిని బ్రతిమలాడుకోవడం అదే మొదటిసారి.

అంతలో ఎవరో అన్నారు. ఈయనే మన రాజశేఖరం పనిచేసే పేపర్‌మిల్ ఓనర్.

మాట్లాడుతున్న వారి ముఖాలలో ఒక్కసారిగా మార్పువచ్చింది. "ఓయ్! మర్యాదగా కారును ఆ సైడ్‌కి తీసుకెళ్ళి ఆపు"

అతడు కళ్ళెత్తి తనను అలా అన్న వ్యక్తి వంక చూసాడు. పిడికిళ్ళు బిగుసుకున్నాయి. అయితే అంతలోనే మెదడు హెచ్చరించింది. 'ఇది సమయం కాదు. అనామకులకు, ఎందుకూ పనికిరానివారికి కూడా అధికారం చెలాయించే అవకాశం వస్తూ ఉంటుంది ఒక్కోసారి. ఇది వారి సమయం...' అతడి బిగుసుకున్న చేయి పట్టువదిలేసాడు.

"... చూడండి! ఒక్కసారి మానవత్వంతో ఆలోచించండి... బంద్ పేరుతో ఒక ప్రాణాన్ని బలితీసుకోకండి. ఆలస్యమయితే ఆమె ప్రాణాలకు ప్రమాదం... ప్లీజ్..."

వెనుక సీటులోని లక్ష్మి తల్లి కూడా వారికి చేతులు జోడించింది "మమ్మల్ని పోనివ్వండి బాబూ..."

ఒకరిద్దరు మెత్తబడ్డట్టు కనిపించారు. కాని మరికొంతమంది మాత్రం పట్టిన పట్టు వదల్లేదు. "అక్కడ మా నాయకుడు కూడా చావుబతుకుల్లో ఉన్నాడు" అన్నాడొకడు వ్యంగ్యంగా.

"మీ నాయకుడు చావుబ్రతుకుల్లో ఉంటే, మరో ప్రాణాన్ని చూస్తూ చూస్తూ బలిచేస్తారా?"

"జాతీయస్థాయిలో ఒక నాయకుడిని అరెస్ట్‌చేస్తే, ఆ పార్టీవారు అల్లరిచేసి వంద మందిని చంపడం చాలా సర్వసాధారణమయిన విషయం"

అతడికి చర్చ అనవసరం అనిపించింది. లక్ష్మి అరుపులు అతడి మనసును కలచివేస్తున్నాయి. ఒక్కక్షణం మౌనంగా ఉన్నాడు. కారు గేర్ మార్చాడు. ఏదో రిస్క్ తీసుకోక తప్పదు. చిన్న జర్క్‌తో కారు కదలబోయింది.

అతడి ప్రయత్నం అర్థమవడంతో పది మంది కారు ముందుకు వచ్చి నిలబడ్డారు. వారందరికీ లీడర్‌గా ఉన్న ఓ వ్యక్తి డోర్‌లో నుండి చెయ్యి రానించి అతడి కాలర్ పట్టుకున్నాడు. "ఏయ్! మర్యాదగా కిందికి దిగు" అన్నాడు.

అంతే! చప్పున అతడి చెయ్యి వెళ్ళి కాలర్ పట్టుకున్నవాడి చెంప ఛెళ్ళుమనిపించింది. వాడు అదిరిపడి దూరం జరిగాడు.

శ్రీనివాస్ డోర్ తీసుకుని కిందికి దిగాడు. ఆక్షణం లక్ష్మి అరవడం కూడా మరిచిపోయింది. ఆమె తల్లి నోరు తెరచుకుని ఉండిపోయింది.

అతడి కళ్ళు జేగురురంగులోనికి మారిపో

యాయి. దవడ కండరాలు బిగుసుకున్నాయి. ముడిచిన చేతివేళ్ళు పిడికిలయ్యాయి. అతడి రౌద్రరూపం అక్కడివారందరినీ భయపెట్టింది.

ఎవర్రా! ఎవరనుకుంటున్నారు నన్ను! అయామ్ జె.యస్. నేను తలచుకుంటే రేపుదయానికి నీ శవం పెన్నానదిలో ఉంటుంది. కాని హత్యారాజకీయాలు నడపడం నా వృత్తి కాదు. మెదడును జ్వలింపచేసి ఆ వెలుతురులో మనీ ఏరుకునే వ్యాపారవేత్తను... మీరిప్పుడు 'బంద్' చేస్తున్నారా?! అసలు 'బంద్' అంటే ఏమిటో ఒక్కసారి వివరించండి!... రేయ్! నిర్దయగా మనుష్యులను చంపడం 'బంద్' కాదురా! మీ గొప్పతనం నిరూపించుకోవడం కోసం 'బంద్' జరపడం తద్వారా జనాలను ఇబ్బందిపెట్టడం... ఇదెక్కడి న్యాయంరా?... మీ నాయకుడిని ఎవరో హత్యచేయబోయారని, నా స్నేహితురాలిని నడివీధిలో మీరు హత్యచేయాలనుకుంటార్రా... రేయ్! ఆమెకు ఏదయినా జరిగితే మిమ్మల్ని ఎవర్నీ వదలను...అందర్నీ కలిపిచంపేస్తాను...'' పిచ్చిగా, వెర్రిగా అరిచాడు శ్రీనివాస్.

అంత బాధలోనూ లక్ష్మి ఆశ్చర్యంగా చూసింది అతడి వైపు. పెదవులమీద ఎప్పుడూ కదలాడే చిరునవ్వు తప్ప ఏనాడూ అతడిలోని ఆవేశాన్ని చూసే అవకాశం ఆమెకు కలగలేదు. తొలిసారి... అతడిలోని ఆవేశం చూసి... శ్రీనివాస్ ఇంతగా ఆవేశపడగలడా? అనిపించిందామెకు.

శ్రీనివాస్ ఉగ్రరూపం చూసి వారంతా ఒక్క అడుగు వెనక్కువేసారు. కాని పదిమందిగా ఉన్నప్పుడు ఏ ఒక్కరికీ భయపడే అవసరం ఉండదు. అడుగు వెనక్కు పడిందిగానీ, ప్రయత్నాన్ని విరమించే సూచనలు మాత్రం కనుపించలేదు.

అతడు వారి వాలకం గమనించాడు. వారిలో ఏ ఒక్కరికీ జాలి, దయ అనేవి లేవనుకున్నాడు. ఆ సమయంలో వారిని కొట్టడం వలన కూడా పెద్ద ప్రయోజనం ఉండబోదు. వారితో వాదనతోనే ఇప్పటికే పావుగంట లేటయింది. ఇక వాదన అనవసరం.

క్షణాల్లో అతడో నిర్ణయానికి వచ్చాడు. ''ఆల్ రైట్! ఈ రోడ్డుమీద మీ 'బంద్' సందర్భంగా వాహనాలు వెళ్ళకూడదు. కాని మనుష్యులు పోవచ్చుగదా! ... కాదంటే మాత్రం చాలా అనర్థాలు జరిగిపోతాయి''

అతడు ఏమంటున్నాడో అక్కడ ఉండేవారికి కొద్దిక్షణాలు అర్థంకాలేదు.

శ్రీనివాస్ కారు బేక్‌డోర్ తెరిచాడు ''లక్ష్మి దిగు'' అన్నాడు చెయ్యందిస్తూ. ఆమె వింతగా అతడి వంక చూసింది. అతడు ఏం చేయబోతున్నాడో ఆమెకు అర్థంకాలేదు. అయినా అతి కష్టంమీద, అప్రయత్నంగా, అతడిచేతి ఆసరాతో కిందికి దిగింది.

అతడు క్షణంపాటు కన్నులు మూసుకున్నాడు. తర్వాత తన రెండు చేతుల మధ్య ఆమెను పసిపాపలా ఉంచుకున్నాడు. వారంతా విభ్రాంతితో అతడి చర్యను చూడసాగారు. అతడు తన చేతుల మధ్య ఆమెను ఉంచుకుని ముందుకు అడుగువేసాడు. అతడి వెనుకే లక్ష్మి తల్లి...

అతడి చేతిలోని లక్ష్మి కొద్దిక్షణాలపాటు మైమరచిపోయింది. అతడి చేతులలో తను... పురిటిలోని పాపను తల్లి చేతులలో ఉంచుకున్నట్టు... ఏనాటి బంధమో ఇది! ఎందుకో ఇతడికి తన మీద ఇంత ప్రేమ. మనిషి బిజినెస్‌లో పడితే బంధాలు మరిచిపోతాడు. కాని 'అనుబంధాన్ని మరచిపోలేని ఇతడి వ్యక్తిత్వం ముందు తనెంత అల్పురాలో కదా' అనిపించింది. తనకోసం ఒక అవమానాన్ని ఎదుర్కోవడం, వారిని ఎదిరించి... ఇలా... అతడే కనుక లేకుంటే ఇప్పటి తన పరిస్థితి ఏమిటి?... 'అంతలోనే కడుపులోని బిడ్డ కాళ్లు కదిలించాడేమో తెలియదు... పెద్దగా కేకవేసింది. ఎందుకో తెలియదు... తనకు ఆఖరిక్షణాలు దగ్గరవుతున్న భావన కలిగింది ఆమెకు. డాక్టరుగా కూడా 'తనెంత ప్రమాదంలో ఉందో ఊహించింది. ఆలస్యమయ్యేకొద్దీ తను మరణానికి చేరువవుతుందని అర్థమయిపోయిందామెకు.

ఆక్షణం కూడా ఎందుకో తెలియదు. ఒకరకమయిన ఆనందం కలిగిందామెకు. తనకు ఈ ఆనందం ఎందుకని మనసును ప్రశ్నించు

కుంటే? శ్రీనివాస్ చేతులలో ఉన్నందుకు అని జవాబు వచ్చింది. తనను ఇంత కాలం ప్రేమించిన వ్యక్తికి ఈ కానుక అయినా ఇవ్వగలిగానన్న తృప్తి కాబోలు అది అనిపించింది.

అతడు ముందుకు నడుస్తున్నాడు. అంత బరువు అలసటను కలిగిస్తోంది. అయినా ఆగడంలేదు అతడు.

దారిన వెళ్తున్నవారు అతడి వంక వింతగా చూస్తున్నారు. విషయం అర్థంచేసుకున్నవారు మాత్రం 'బంద్'అనే రాక్షసిని తిడుతున్నారు. 'బంద్' పేరుతో నిర్వాహకులు చేసే ఘోరాలు కథలుగా చెప్పుకుంటున్నారు.

అతడి చేతిలోని ఆమె కాళ్ళు చేతులు కదిలిస్తూ, బాధతో అరుస్తోంది. అతడి నుదుట చెమట కిందికి జారుతూ ఉంది.

ఆకాశంలో సూర్యుడు ఎందుకనో తన ప్రతాపాన్ని కొద్దిగా తగ్గించుకున్నాడు. నల్లని మబ్బులు కొన్ని ఆకాశంలో కదలాడాయి. చల్లగాలి అతడి శరీరాన్ని తాకింది.

హాస్పిటల్‌కు చేరేందుకు అర్ధగంట పట్టింది అతడికి. డాక్టర్ జయప్రద వారికోసమే ఎదురుచూస్తూ ఉంది. లక్ష్మిని స్ట్రెచర్‌మీద పడుకోబెట్టి లోపలకు తీసుకువెళ్ళింది.

శ్రీనివాస్ అక్కడే ఉన్న ఛెయిర్‌లో అలసటగా కూలబడ్డాడు. ముఖాన్నంతా ఇంకా చెమట అలాగే ఉంది. జుట్టంతా చెదిరిపోయి ఉంది. శరీరంలోని సత్తువంతా అయిపోయినట్టనిపించింది.

అతడు కుర్చీలో వెనక్కు వాలాడు. అలసట తగ్గాక ఆందోళన మొదలయింది. 'లక్ష్మికి ఎలా ఉందో?! ఏం జరగబోతుందో' అంతలోనే తల్లి గుర్తుకు వచ్చింది. ఆవిడ ఇప్పుడు రైల్వే స్టేషన్‌కి చేరి ఉంటుంది. ఆమెను తీసుకురావాలి. కాని కారు రోడ్డు మీద వెళ్ళనివ్వరు కదా!

శ్రీనివాస్ గెస్ట్‌హవుస్‌కి ఫోన్ చేశాడు. వంటవాడితో చెప్పాడు. "నువ్వు రైల్వేస్టేషన్‌కి నడిచి వెళ్ళు. అమ్మను ఎలాగోలా గెస్ట్‌హవుస్‌కి చేర్చు"

వెనువెంటనే సోమనాథ్ జ్ఞప్తికి వచ్చాడు అతడి ఇంటిలోని పెళ్ళి ఆగిపోయి ఉంటుందా?! అక్కడికి కూడా రింగ్ చేసాడు

సోమనాథ్ చెప్పాడు "ముహూర్తానికి టైం దగ్గరవుతూ ఉంది సార్! కాని- మమ్మల్ని కళ్యాణ మండపం చేరనిచ్చేలా లేరు. మా మనిషి కళ్యాణమండపం దగ్గరకు వెళ్ళి వచ్చాడిప్పుడే. మగ పెళ్ళివారు కూడా ఇంకా ఆ చోటుకి చేరలేదట... బహుశా! ఈరోజు ఆ ముహూర్తానికి మేము...'

శ్రీనివాస్ రిసీవర్ పెట్టేసాడు. మనసంతా వ్యధ... ఎవరిమీదో చెప్పలేని కసి... ఎందుకని... ఎందుకని ఈ సమాజం ఇంతగా భ్రష్టు పట్టిపోయింది. బలవంతులు బలహీనులతో చెలగాటమాడుతున్నారు. ఈ బలవంతుల ఆటకు బలిపశువులు ఎంతమంది?

లోపల- లక్ష్మి, అక్కడ- సోమనాథ్, మరో చోట- తన తల్లి, వీరంతా 'బంద్' వలన ఇబ్బంది పడినవారే కదా! ఇలా జిల్లాలో, రాష్ట్రంలో, దేశంలో - ఆ సమస్యకు ఎన్ని లక్షల మంది, ఎన్ని రకాలుగా ఇబ్బందికి గురవుతున్నారో!

శ్రీనివాస్ కన్సల్టింగ్ రూంలోనుండి ఇవతలకు వచ్చాడు. మనసంతా టెన్షన్‌గా ఉంది. లక్ష్మి గురించిన ఆలోచనలు కాలు నిలువనీయడంలేదు. లక్ష్మి తల్లి కుర్చీలో కూర్చుని నిశ్శబ్దంగా కన్నులు మూసుకుని ఉంది. మూసిన ఆ కన్నుల వెనుక ఎంత వేదన ప్రవాహంలా సాగుతోందో అతడూహించగలడు.

అంతలో చప్పుడయింది. స్ట్రెచర్ మీద పడుకోబెట్టిన లక్ష్మిని ఆ రూమ్‌లో నుండి ఇవతలకు తీసుకువచ్చారు. ఆపరేషన్ థియేటర్‌వైపు తీసుకువెళుతున్నారు. అతడు చప్పున అటు అడుగువేసాడు. డాక్టర్ జయప్రద వెనుకే వచ్చింది.

"ఏమయింది డాక్టర్?" ఆదుర్దాగా ప్రశ్నించాడు.

"మీరు కాసింత ముందుగా తీసుకువచ్చి ఉంటే బాగుండేది... కేసు చాలా సీరియస్ అయింది"

లక్ష్మిని ఆపరేషన్ థియేటర్‌లోనికి తీసుకు వెళ్ళారు. ఆ గది తలుపులు మూసుకుపోయాయి.

అతడు చిత్తరువులా నిలబడిపోయాడు. 'కేసు సీరియస్ అయింది' అన్న డాక్టర్ మాటలే అతడి చెవిలో మారుమోగుతున్నాయి.

లక్ష్మితల్లి అతడి భుజంమీద చెయ్యివేసింది. అతడు ఆమె మొఖంలోనికి చూసాడు. ఆమె కన్నులలో నీరు సుడులు తిరుగుతోంది "ఊరుకోండి" చెప్పాడు అతడు. కొద్దిక్షణాలు ఇద్దరి మధ్యా నిశ్శబ్దం!

"బాబూ! అవినాష్‌కి ఫోన్‌చేసి త్వరగా రమ్మని చెప్పు"

"అలాగే" అతడు డాక్టర్ కన్సల్టింగ్ రూమ్ లోనికి వెళ్ళాడు. ఢిల్లీకి నంబర్ డయల్ చేసాడు. మూడుసార్లు ట్రై చేసాక లైన్ కలిసింది. ఆవైపు అవినాష్ "హలో" అన్నాడు.

"అవినాష్! నేను జె.యస్.ని మాట్లాడుతున్నాను"

"హలో మిస్టర్ శ్రీనివాస్! ఎక్కడి నుండి?"

"మీ ఊరి నుండే! డాక్టర్ జయప్రదగారి హాస్పిటల్ నుండి... మీరు వెంటనే బయలుదేరి వచ్చేస్తే బాగుంటుంది"

అవినాష్ గొంతులో కంగారు వినిపించింది. "ఏమయింది? ఎనీ ప్రాబ్లమ్ ఈజ్ దేర్?" అడిగాడు.

"లక్ష్మికి ముందుగానే నొప్పులు వచ్చి హాస్పిటల్‌లో చేర్చాం. పరిస్థితి సీరియస్‌గా ఉంది"

"మైగాడ్" అన్నాడతడు "నేను సాయంత్రం బయలుదేరుదామనుకుంటున్నాను. ఆల్‌రైట్! ఇప్పుడే బయలుదేరుతున్నాను. మద్రాసు వరకూ ఫ్లయిట్‌లో వచ్చి, అక్కడి నుండి టాక్సీలో వచ్చేస్తాను"

"వీలయినంత త్వరగా వచ్చేయండి" ఫోన్ పెట్టేసాడు అతడు. రూమ్‌దాటి ఇవతలకు వచ్చాక ఆమె అడిగింది.

అవినాష్ వస్తున్నాడా?"

"ఇప్పుడే బయలుదేరుతున్నాడు"

ఇద్దరూ కారిడార్‌లోని కుర్చీలలో కూర్చున్నారు. ఎదురుగా గోడమీదున్న గడియారం ముల్లు భారంగా కదులుతూ ఉంది.

కొద్దినిముషాల తర్వాత నర్స్ అతడి ముందుకు వచ్చింది. "సార్! లక్ష్మిగారికోసం వారి హాస్పిటల్‌నుండి ఫోన్ వచ్చింది"

"కాని ఆవిడ ఆపరేషన్ థియేటర్‌లో..." ఆగాడతడు.

"పోనీ మీరు మాట్లాడండి సార్! చాలా సీరియస్ విషయమట"

శ్రీనివాస్ పైకి లేచాడు. ఆమె వెనుకే కన్సల్టింగ్ రూంలోనికి వెళ్ళాడు. పక్కనే పెట్టి ఉన్న రిసీవర్‌ని చేతిలోనికి తీసుకున్నాడు. "ఏమిటి విషయం?" ప్రశ్నించాడు.

"సార్!... చాలామంది పెద్దగా నినాదాలు చేసుకుంటూ వచ్చారు. 'జె.యస్.డౌన్ డౌన్' అని అరుస్తూ, హాస్పిటల్‌లోని వస్తువులన్నీ చిందరవందర చేస్తున్నారు. విలువయిన వస్తువులన్నీ పగలగొట్టేస్తున్నారు. ప్లీజ్ సార్! మీరు వెంటనే రండి. లేకుంటే హాస్పిటల్ సర్వనాశనమయిపోయేలా ఉంది" నర్స్ గొంతులో భయం కనిపిస్తోంది.

"వస్తున్నాను ఐదునిముషాలలో అక్కడ ఉంటాను" రిసీవర్ పెట్టేసాడు. అతడి పక్కనే నిలబడి అతడివంకే చూస్తోంది హాస్పిటల్ నర్స్. ఆమెను ప్రశ్నించాడు అతడు "ఆపరేషన్ పూర్తయ్యేసరికి ఎంత సమయం పడుతుంది?"

"తెలియదు సార్"

"సరే! నేను ఆ హాస్పిటల్ వరకూ వెళ్ళొస్తాను. అల్లరి మూకలు అక్కడ అలజడి సృష్టిస్తున్నాయట"

"అలాగే సార్"

అతడు బయటకు నడిచాడు. రోడ్డుమీద ఒక్క వాహనం కూడా వెళ్ళడంలేదు. తప్పదు... కాలినడక తప్పదు సుమారుగా రెండు కిలోమీటర్లదూరం. అందులోనూ త్వరగా చేరాలి.

శ్రీనివాస్ నడవసాగాడు. నడక కాదు అది పరుగు... పరుగులాంటి నడక! అతడి జీవితంలో ఏనాడూ అలా టెన్షన్‌గా పరిగెత్తవలసిన అవసరం కలుగలేదు.

హాస్పిటల్ దగ్గరయ్యేసరికి పూర్తిగా అలసిపోయాడు. ముఖాన్నుండి కారే స్వేదాన్ని ఖర్చీఫ్‌తో తుడుచుకుంటూ హాస్పిటల్‌లో

ఎంటర్అయ్యాడు.

వాకిట విరిగిపోయిన పూలకుండీలు అతడికి ఆహ్వానం పలికాయి. కిటికీ అద్దాలు ముక్కలయి కిందపడి ఉన్నాయి.

అతడు పెదవులు బిగపట్టాడు. లోపలికి అడుగుపెట్టాడు. ''ఏం జరిగింది?'' ఎదురుగా వచ్చిన నర్సుని ప్రశ్నించాడు.

''వాళ్ళెవరో తెలియదు సార్!... మిమ్మల్ని నిందిస్తూ ఈ ఘోరం చేసారు. మీరు వాళ్ళ వ్యక్తిని కొట్టారట. అందుకే ఇలా చేస్తే మీకు తెలిసొస్తుందట...'' అని ఆగి, క్షణం తటపటయించి తర్వాత చెప్పిందామె ''అంతే కాదు సార్! మిమ్మల్ని, లక్ష్మిగారిని కలిపి చాలా అసభ్యంగా మాట్లాడారు. ఆవిడ హాస్పిటల్ని నాశనం చేస్తే ఆ దెబ్బ మీకు తగులుతుందట...''

అతడు నిశ్శబ్దంగా ముందుకు నడిచాడు. నిజంగానే హాస్పిటల్ని సర్వనాశనం చేసారు. ఖరీదయిన ఎక్విప్‌మెంట్‌ని ధ్వంసం చేసారు. అవినాష్, లక్ష్మిలు ఈ నష్టాన్ని భర్తీచేసుకోవాలంటే చాలా కాలం పడుతుంది.

అదికాదు, అతడు ఆలోచిస్తున్నది తన గురించి, లక్ష్మి గురించి వారు చేసిన కామెంట్స్ గురించి, అవి అవినాష్ చెవికి చేరితే చాలా హర్ట్ అవుతాడు. ఛట్!... ఈ దుర్మార్గుల నోటికి కొద్దిగా కూడా అడ్డుఉండదు కాబోలు.

ఉదయం తను కొట్టిన దెబ్బకు వారింత త్వరగా రియాక్ట్ అవుతారనుకోలేదు అతడు.

నర్స్ అతడి వెనుకే వచ్చింది. ''మీరు రాబోయే ముందే వారు వెళ్ళిపోయారు సార్! వారి ఆగడం చూసి భయపడి, ఇన్ పేషెంట్లు కూడా ముగ్గురు పారిపోయారు''

నిశ్శబ్దంగా వినసాగాడు అతడు. ఈ సమయంలో తానేం చేయలేడని అతడికి తెలుసు. 'బంద్ చేసేప్పుడు, ఏ నాయకుడయినా చనిపోయినప్పుడు, కర్ఫ్యూలాంటి సమయాలప్పుడు- అల్లరిమూక ఎటువంటి దుశ్చర్య చేసినా పోలీసుకేసులు పెద్దగా ఉండవు. ఒక నాయకుడు హత్య చేయబడితేనో, మత ఉద్రిక్తతలు చెలరేగినప్పుడో- నగరాలకు, నగరాలే దోచుకోబడతాయి. ఒక కష్టజీవి తన జీవితమంతా శ్రమపడి పైసాకు పైసా కూడబెట్టి ఓ నగరంలో మంచి సెంటర్‌లో బట్టలషాపు తెరిస్తే, పొరపాటున ఆ నగర నాయకులొకరు హత్యకావించబడితే అతడి షాపు లూటీ చేయబడుతుంది. ఆ లూటీకి కారణం ఏమిటి? అతడిదే కాదు ఆ సంఘటన జరిగిన సమయంలో ఆ నగరంలో అరవైశాతం షాపులు లూటీ చేయబడ్డాయి. ఆ షాపుల యజమానులకు ఏ రాజకీయపార్టీకి సంబంధంలేదు. ఆ షాక్ తట్టుకోలేక వారిలో కొంతమంది ఆత్మహత్య చేసుకున్నారు కూడా!

మరో సంఘటన- ఒక జాతీయస్థాయి నాయకుడు చనిపోయినప్పుడు ఆ తర్వాత ఈ మధ్య మత ఘర్షణలు చెలరేగినప్పుడు... ఇలాంటి అవకాశం కోసమే కొంతమంది ఎదురుచూస్తూ ఉంటారు. అవతలివాడు ఆవేశపడుతూ ఉంటే, వీరు స్వంత కక్షలు తీర్చుకోవడమో లేదా చేజిక్కింది దక్కించుకోవడమో చేస్తుంటారు. ఈ లూటీలను, స్వార్థపరుల దుశ్చర్యలను ఆపేవారేలేరా?

ఇప్పుడు మాత్రం బంద్ పేరుతో ఈ హాస్పిటల్‌ను ధ్వంసం చేయడం... అతడికి ఏనాడూ నిస్సహాయస్థితి అనిపించలేదు. బిజినెస్‌లో ఎంత పెద్ద ప్రాబ్లమ్ ఎదురయినా నవ్వుతూనే ఫేస్ చేసేశాడు. అయితే ఈరోజు- ఈ దేశం ఎటువెళుతోందో తలచుకుంటే బాధగా అనిపించింది. ఈ నాయకులు దేశాన్ని నడిపించే విధానం చూస్తే ఏడుపొస్తుంది. ఈ పరిస్థితిని తను ఏమాత్రం మార్చలేనన్న నిజం నిస్సహాయతను కలిగిస్తుంది.

దేవుడా! రక్షించు నాదేశాన్ని! బంద్‌ల పేరుతో మారణహోమం చేసేవారి నుండి, ఆవేశం చాటున లూటీలు చేసేవారినుండి, మతనాయకుల నుండి... రక్షించు నా దేశాన్ని!

అతడు నిస్సత్తువుగా అటు ఇటు తిరిగాడు. ఏమీ తోచక తిరిగి కన్సల్టింగ్ రూంలోనికి వచ్చి కూర్చున్నాడు. అక్కడ కూడా విరిగిన కుర్చీ, పగిలిన స్టెత్- తననే వెక్కిరిస్తున్నట్టుగా తోచింది. నువ్వేం చేయగలవు? అని ప్రశ్నిస్తున్నట్టుగా అనిపించింది. తలపట్టుకున్నాడు.

అలా ఎంతసేపుండిపోయాడో తెలియదు. నర్స్ లోపలికి వస్తున్న చప్పుడుకు తలెత్తి

చూసాడు.

''ఇప్పుడేం చేద్దాం సార్? పోలీస్ రిపోర్ట్ ఇద్దామా?''

అతడు తల అడ్డంగా ఆడించాడు. ''వద్దు... దాని వలన ఎలాంటి ప్రయోజనం ఉండబోదు''

''మరి?'' ఆమె అయోమయంగా చూసింది.

''ఏమీ చేయలేం''

ఈసారి జాలిగా చూసిందామె. ఎదుటివ్యక్తి జాలిచూపులను భరించడం చాలా కష్టం. అందులోనూ ఆ స్థాయిలో ఉన్నవాడికి!

నాలుగు నిముషాలు గడిచాయి. ''కాఫీ తాగుతారా సార్?'' అడిగిందామె.

''లేదు... త్వరగా వెళ్ళాలి''

''డాక్టర్‌గారి పరిస్థితి ఎలా ఉంది?''

''సీరియస్‌గా ఉంది''

అతడు పైకి లేచాడు. ''ఏదయినా అవసరమయితే ఆ హాస్పిటల్‌కు ఫోన్ చెయ్యండి'' చెప్పేసి బయటకు నడిచాడు.

తిరిగి నడక! వచ్చేప్పుడు ఉన్నంత వేగంగా కాదు. నీరసంగా, నిరామయంగా! హాస్పిటల్‌కు చేరుకునేసరికి పదినిముషాలు పైనే పట్టింది.

హాస్పిటల్ చేరుకునేప్పటికి ఆ వాతావరణం ఏదోలా అనిపించింది. మనసు కీడు శంకించింది.

అతడు కారిడార్‌లోనికి వెళ్ళి ఆ దృశ్యం చూసి కట్రాటలా మారాడు. లక్ష్మి తల్లి డాక్టర్ జయప్రదను చుట్టుకుని బావురుమంటోంది. ఆమె ఆ తల్లిని ఓదారుస్తోంది. ''ఊరుకోమ్మా! ఎంత ఏడ్చినా చనిపోయినవాళ్ళు తిరిగిరారు కదా!''

అతడికి ఆ మాటలకు అర్థం బోధపడటంలేదు. అసలు అలా జరుగుతుందన్న ఊహే మనసులోనికి రావడం లేదు. లేదు... ఏమీ జరగలేదు. అదంతా ఏమిటో!... మరేదో!!

శ్రీనివాస్ నెమ్మదిగా అటు అడుగులు వేశాడు. అప్పుడే అతడిని చూసిందావిడ. ఒక్క అంగలో అతడి దరిచేరి, చుట్టేసింది. ఎద మీద తల వాల్చి భోరున ఏడవసాగింది.

''లక్ష్మి... నీ స్నేహితురాలు లక్ష్మి... అందరినీ వదిలి వెళ్ళిపోయింది బాబూ...''

'ఆకాశం విరిగి నేలమీద పడదేం? నాలుగు దిక్కులు ఏకమయిపోవు ఎందుకని? ఆమె... ఆమె చెప్పేది అబద్ధం కదూ?' అతడు అపనమ్మకంగా డాక్టర్‌వంక చూసాడు.

ఆమె అతడివంక చూసి నిశ్శబ్దంగా తలాడించింది. ''సారీ శ్రీనివాస్! అప్పటికీ నేను చాలా ప్రయత్నించాను... పావుగంట ముందుగా తీసుకువచ్చి ఉన్నా ఆమెను బ్రతికించేందుకు ఛాన్సెస్ ఉండేవి''

శ్రీనివాస్ స్తబ్దంగా ఉండిపోయాడు. డాక్టర్! ఇది... ఇది నిజం కాదని ఒక్క మాట... ఒక్క మాట చెప్పండి' అతడి మూసి ఉన్న పెదవుల వెనుక వేదన అది.

అతడు ఆమెను పక్కకు తోసాడు. మెల్లగా ఆపరేషన్ థియేటర్‌వైపు అడుగువేసాడు. అతడి వెనుకే లక్ష్మి తల్లి, డాక్టర్ జయప్రద నడిచారు.

బెడ్‌మీద ప్రశాంతంగా నిద్రపోతున్నట్టుంది లక్ష్మి. ఆమె కిప్పుడు ఏవేదనా లేదు. మరే సంఘర్షణాలేదు.

అసలు చనిపోవడం అంటే ఏమిటి? సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు. చంద్రుడు రాత్రులందు వెలుగుతూనే ఉంటాడు. వసంతం పరిమళాలు కురిపిస్తుంది. పచ్చిక మీద వాలే మంచుముత్యాలు పుడమి తల్లిని మురిపిస్తూనే ఉంటాయి. అయినా ఈ అందాలు ఆస్వాదించేందుకు నువ్వు ఉండవు. అంతే కదా 'చావు' అంటే?

'చావు' అంటే అంతే అయితే 'నాలోని నువ్వు' ఈ ప్రపంచాన్ని నేను ఉన్నంతకాలం చూస్తూనే ఉండొచ్చు కదా! నా కన్నులు నీవి కావా? నా హృదయం నీది కాదా? అసలు నువ్వెవరు- నేనెవరు? కలసిన హృదయాలలో తనువులు వేరయినా మనసు ఒక్కటే కదా! ఈ ప్రపంచాన్ని మనసుతోనే కదా వీక్షించేది.

అతడు బెడ్ పక్కనే శిలలా నిలబ[illegible]డు. లక్ష్మి పసిపాపలా నిద్రపోతూ [illegible].

అయితే ఆ నిద్ర శాశ్వత నిద్ర.

అతడి చెయ్యి ఆమె నుదురు మీద వాలింది. అందాల కురులను మృదువుగా వెనక్కు నెట్టింది. బ్రతికుండగా సంఘం కట్టు బాట్లు ఆప్యాయతను చాటుకునేందుకు... ఓ చేతి స్పర్శకు అనుమతివ్వవు. కాని ఆమె ఇప్పుడు శవం... ప్రాణం లేని జీవం!

మెల్లగా తలవంచాడు అతడు. ఆ నుదు టన పెదవులతో అద్దాడు. అప్పటివరకూ కను రెప్పలచాటున పదిలంగా దాగి ఉన్న ఓ కన్నీటి ముత్యం మెల్లగా ఇవతలకు వచ్చింది. ఆమెను స్పర్శించే భాగ్యం తనకూ కావాలని కాబోలు రెప్పలు దాటి, బుగ్గల మీదుగా వాలి ఆమె నుదుటన చేరింది.

పరలోకం చేరిన ఆమె ఆత్మ మిత్రుని కంట ఒలికిన కన్నీటిని చూసి మురిసిపోయి ఉండొచ్చు. ఏ వ్యక్తి అయినా తన మరణానంతరం తన కోసం స్వచ్ఛంగా రెండు కన్నీటిబొట్లు విడిచే వ్యక్తి కావాలనే కదా కోరుకునేది.

అతడు అలాగే నిలబడి ఆమెనే తదేకంగా చూడసాగాడు. అలా చూస్తుంటే అతడికి తన గత పదేళ్ళ జీవితం కనులముందు కదలాడింది.

తామిద్దరూ కలిసి రోడ్డువెంబడి తిరగడం, జరిగిన ఆమె పెళ్ళి, తనలో కలిగిన కసి, తను కష్టపడి పైకిరావడం... అదంతా ఒక కల! ఇక నుండి అది ఒక స్మృతి!!

ఏదేమయినా ఈరోజు నా ఈ స్థితికి కారణం నువ్వే లక్ష్మీ! మనిషి జీవితానికి ఒక ఇన్‌స్పిరేషన్ కావాలి. నా జీవితానికి ఆ ఇన్‌స్పిరేషన్ నువ్వే!

డాక్టర్ జయప్రద అతడి భుజంమీద చెయ్యివేసింది "బీబ్రేవ్ మై బోయ్"

అతడు కన్నులు తుడుచుకున్నాడు. అప్పుడే నర్స్ ఒక పసికందును తీసుకొచ్చి డాక్టర్ చేతిలో పెట్టింది. డాక్టర్ పొత్తిళ్ళలోని పాపను అతడికందించింది.

శ్రీనివాస్ తన చేతిలో పసిపాపవంక అయోమయంగా చూసాడు. "లక్ష్మి కూతురు" చెప్పింది డాక్టర్.

"వాట్" అదిరిపడ్డాడు శ్రీనివాస్.

"యస్... ఈ పసికందును ప్రసవించాకే లక్ష్మి చనిపోయింది"

అతడు ఆ పసికందును గుండెలకు హత్తుకున్నాడు.



లక్ష్మి మరణవార్త టౌన్ మొత్తం పాకిందో లేదో తెలియదు. బంద్ లేకుండా ఉండి ఉంటే ఈ వార్త చాలా త్వరగా అందరికీ తెలిసిపోయి ఉండేది.

ఒక్కొక్కరే హాస్పిటల్‌కు వస్తున్నారు. అదీ కాలినడకన రాగలిగిన వారు. అదే మరో రోజయి ఉంటే ఆ హాస్పిటల్ ఆవరణ కారులతో నిండిపోయి ఉండేది.

శ్రీనివాస్ పసికందును చేతులలో ఉంచుకుని నిస్త్రాణగా కుర్చీలో కూర్చుండి పోయాడు. అతడి మెదడు పనిచేయడం మానేసి చాలా సమయం అయింది. అతడి కనులముందు చీకటి తప్ప మరేమీ లేదు.

కొద్దిసమయం తర్వాత పసికందు ఏడ్చింది. ఆకలి వేసిందేమో! కాని పాలివ్వల సిన తల్లి, లాలించే అమ్మ శవంగా మారి ఉంది. స్వార్థపరుల ఘోరకృత్యానికి బలయి ప్రాణాలు కోల్పోయింది.

ఆ పసిపాపను ఎలా ఓదార్చాలో తెలియలేదు అతడికి. అతడి వేదనచూసి కాబోలు నర్స్ ఆ పసికందును అందుకుని అవతలకు తీసుకువెళ్ళింది.

మధ్యాహ్నమయింది.

వచ్చినవారు చెప్పారు 'బంద్ ఇంకా జరుగుతూనే ఉందట'

లక్ష్మి తల్లి 'బంద్'ను తిట్టిపోసింది. ''దిక్కుమాలిన 'బంద్'. వాడెవడినో చంపబోతే, ఈ వెధవలు నా కూతుర్ని చేతురాలా చంపేసారు... ఈ ప్రపంచానికి పొయ్యేకాలం వచ్చింది. అందుకే బంద్‌లని, గింద్‌లని జనాలను చంపుకు తింటున్నారు...''

డాక్టర్ జయప్రద ఆపరేషన్ థియేటర్‌లోనే అటుఇటు తిరుగాడుతోంది.

అది గవర్నమెంట్ హాస్పిటల్ కాదు. ప్రైవేట్ హాస్పిటల్! ఆ హాస్పిటల్‌లో శవాన్ని ఎక్కువసేపు ఉంచడం శ్రేయస్కరం కాదు. అంతేకాదు ఇన్ పేషెంట్స్ కూడా భయపడేందుకు అవకాశం ఉంది. శ్రీనివాస్ ఆమె తపనను అర్థంచేసుకున్నాడు. అంతేకాదు, అతడికి కూడా హాస్పిటల్‌లోనే శవాన్ని ఎక్కువ సమయం ఉంచడం ఇష్టంలేదు. కాని... ఇప్పుడీ శవాన్ని ఇంటికి తీసుకువెళ్లడం ఎట్లా? బయట 'బంద్' జరుగుతూ ఉంది కదా?

అంత వేదనలోనూ అతడికి నవ్వొచ్చింది. 'శవాలను కూడా వీరు బంద్ పేరుతో ఆపుతారా?'

అతడో నిర్ణయానికి వచ్చాడు ''డాక్టర్! మీ కారివ్వండి''

''ఎందుకు?''

''లక్ష్మిని ఇంటికి తీసుకెళ్ళిపోతాను''

''వ్వాట్'' అదిరిపడిందామె. ''బయట బంద్ జరుగుతూ ఉంది''

''తెలుసు...'' చెప్పాడు అతడు. ''అయినా సరే! నేను ఇప్పుడే లక్ష్మిని ఇంటికి తీసుకువెడతాను''

అతడు స్వశక్తితో పైకి వచ్చినవాడు. చాలా తెలివయినవాడు. ఆ విషయం ఆమెకు తెలుసు. అందుకే మరోమాట మాట్లాడకుండా కారు కీస్ అతడి చేతిలో పెట్టింది.

శ్రీనివాస్ శవాన్ని తనే స్ట్రెచర్ మీద పడుకోబెట్టాడు. తనే స్ట్రెచర్‌ను నెట్టుకుంటూ పోర్టికోలోనికి తీసుకువెళ్లాడు. కారు డోర్ తెరచి, శవాన్ని వెనుక సీటులో పడుకోబెట్టాడు.

''రండమ్మా! ముందు కూర్చోండి''

పసిపాపను దగ్గరుంచుకుని ఆవిడ కారెక్కింది. అతడు డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు.

పోర్టికోలో నిలబడిన జనం అతడివంకే వింతగా చూడసాగారు. ఏమిటి ఇతడి ధైర్యం? ఎలా ఇంటికి చేరగలనని అనుకుంటున్నాడు?!

కారు స్టార్ట్ అయింది. 'వచ్చేప్పుడు జీవం ఉన్న లక్ష్మిని తీసుకువచ్చాను. వెళ్ళేప్పుడు ప్రాణం లేని లక్ష్మిని తీసుకువెళుతున్నాను' అతడి చేతులు స్టీరింగ్ వీల్ చుట్టూ బిగుసుకున్నాయి. ఒక్క జర్క్‌తో కారు ముందుకురికింది.

అతడి చూపులలో ఏకాగ్రత ఉంది. కాని మెదడు బద్దలవుతున్నట్టుంది. ఏదో కసి... మరేదో చేసేయాలన్న తపన...

రోడ్లు ఇంకా నిర్మానుష్యంగానే ఉన్నాయి. బంద్ నిర్వాహకులు ఇంకా సెంటర్లలోనే ఉన్నట్టున్నారు. వాహనాలు ఏవీ తిరగడంలేదు.

శ్రీనివాస్ కారు మెయిన్‌రోడ్ ఎక్కింది. సెంటర్‌లో నిలబడి ఉన్న జనం అతడి కళ్ళబడ్డారు. అతడికి అరక్షణంపాటు అనిపించింది. కారు ఆపకుండా ఆ అల్లరిమూకను తొక్కించేసి వెళ్ళిపోదామా అని! నిజంగానే ఈ ప్రపంచంమీద అంత కసిగా ఉంది అతడికి. కాని మనస్సాక్షి అంగీకరించలేదు.

ఆ అల్లరిమూకను చూడగానే లక్ష్మి తల్లి కొద్దిగా కంగారుపడింది. వారిలో ఒకరిని శ్రీనివాస్ ఇంతకుమునుపు కొట్టాడు. ఆ కక్షతో వారిప్పుడు తమమీద దాడి చేస్తే?!

శ్రీనివాస్ కారు వేగం మరింత పెంచాడు. అతడి వేగం చూసి ఆ కారు అక్కడ ఆగబోదని తెలిసింది కాబోలు ఆ మూక భయంగా పక్కకు తప్పుకుంది. వారిలో కొందరు కర్రలు పైకెత్తుకుని నిలబడ్డారు.

అతడు కారు వేగంగా పోనిచ్చి ఆ చోట చప్పున బ్రేక్ నొక్కాడు. కీచుమన్న చప్పుడుతో కారు ఆగింది.

కారు వెళ్ళిపోతుందేమో, వెనుక నుండయినా కారుమీద రెండు దెబ్బలు వేయాలనుకుని కర్రలు ఎత్తుకుని నిలబడినవారు అలాగే ఉండిపోయారు.

శ్రీనివాస్ కారులోనుండి దిగాడు. అతడి తలంతా చెదిరిపోయిఉంది. చూపులలో నిప్పులు కురుస్తున్నాయి. అతడి ఆకారమే భయం కలిగిస్తోంది.

అతడు కారు డోర్ మూసాడు. ఒక్కో అడుగు వేసుకుంటూ వారి దగ్గరకు వచ్చాడు. అతడిని చూడడంతోనే వారు బిత్తరపోయారు.

"ఎవర్రా మీలో నా కారు ఆపగలిగిన మగాడు"

అవతలి వ్యక్తుల చేతులలోని కర్రలు కిందికి దిగిపోయాయి. వారిలో ఒక్కరి నోట కూడా మాట రాలేదు.

అప్పటివరకూ లారీలు ఆపుకుని దూరంగా నిలబడి ఉన్న డ్రైవర్లు, క్లీనర్స్ ఆ చోటుకి రాసాగారు.



కొద్ది గంటలక్రితం అతడు తమలో ఒకరిని కొట్టడం, తాము ప్రతీకారంగా అతడి ప్రియురాలి హాస్పిటల్ నాశనం చేయడం గుర్తుంది. కాని అతడిప్పుడు తమదగ్గరకే వచ్చాడంటే... పారిపోయేవాడిని తరిమే మనస్తత్వం వారిది. ఎదురుతిరిగిన వారిని ఏమీ చేయలేని శుంఠలు వారు.

"ఏరా! నువ్వే కదూ వెళ్ళేప్పుడు నా కారును ఆపి కాలర్ పట్టుకుంది" లాగి అతడి చెంప మీద కొట్టాడు. దూరంగా పడ్డాడు వాడు.

మిగిలిన అల్లరిమూక షాక్ తిన్నట్టుగా ఉండిపోయారు. వారికేమీ అర్థంకావడంలేదు. కొద్ది గంటలక్రితం ప్రియురాలిని చేతులమధ్య తీసుకువెళ్ళినవాడు ఇంతలోనే తిరిగి వచ్చి, తమ వాడిని కొడుతున్నాడంటే- ఏ ధైర్యంతో? ఏ అండా లేకుండానే అతడు అలా ఎలా రెచ్చిపోగలుగుతున్నాడు?!

వారికి తెలిసింది- తమ వెనుక నలుగురు ఉంటే, ముందు గొడవ చేయడం మాత్రమే. సిసలైన ధైర్యం వారిలో మచ్చుకి కానరాదు. నలుగురు వెనుక ఉంటే బస్సులాపి రాళ్ళు వేసే వ్యక్తులు పోలీసులు వస్తున్నారని తెలిస్తే పారిపోతారు. ఇది చాలా సర్వసాధారణమయిన విషయం.

"ఎవడ్రా ఇప్పుడు నా కారుని అడ్డుకొనే దమ్ము కలవాడు. రండిరా... లక్ష్మి బతికి ఉన్నప్పుడు కారు ఆపి, ఆలస్యంచేసి ఆమె ప్రాణాలు తీసారు. ఇప్పుడు ఆమె శవంగా మారింది. ఇప్పుడు... ఇప్పుడు కూడా ఆపండ్రా. మీరు 'బంద్' పేరుతో శవాలను కూడా ఆపగలరు కదూ! ఆపండ్రా... ఎవడో ఒక కిరాతకుడిని హత్యచేయబోతే, మీరు దానిని పెద్ద సమస్యగా చిత్రిస్తూ, మంచి మనుష్యుల్ని చంపుతారట్రా!... ఎవడ్రా మీ నాయకుడు?- ఆంజనేయులునాయుడు! అతడు ఎంతమందిని హత్య చేయించాడో మీకు తెలియదా? తన స్వార్థంకోసం, పలుకుబడికోసం విద్యార్థినాయకులను హత్యచేయించినవాడు, అతడు చనిపోతే దేశానికేమీ నష్టం లేదు. కాని లక్ష్మి... ఈవిడకు ప్రాణాలు తీయించడం తెలియదు. కేవలం ప్రాణాలు కాపాడటమే తెలును. బంద్ పేరుతో ఈరోజు మీరు ఆవిడని చంపేసారు. ఒక పసికందును తల్లి లేనిదానిని చేసారు. ఛట్! ..." అతడు వారి ముఖాన ఉమ్మాడు. "ఎందుకురా మీ బ్రతుకులు కుక్కల్లా, నక్కల్లా, సందుల్లో పందుల్లా! మీలాంటివారు చావడం మేలు. దానివలన దేశానికి ఎంతో లాభం"

అప్పటివరకూ మౌనంగా అతడి మాటలు వింటున్న డ్రైవర్లలో కొద్దిగా చలనం కలిగింది. ఆ కుర్రాళ్ళు చేసిన దుశ్చర్య ఏమిటో అర్థమయింది. ఆ కారులో ఒక శవం ఉందని తెలిసి బాధ కలిగింది. ఆ కారునే వారు ఆపబోయారని తెలిసి కోపం కలిగింది. వారిలో ఒకడు అప్పటివరకూ కోపాన్ని బిగపట్టిన వాడు ఇక ఆవేశాన్ని అణుచుకోలేకపోయాడు. బంద్ పేరుతో వారు చంపింది ఒక ఆడబిడ్డను కాదు, దేశంలోని మానవుల మనుగడను, మానవత్వాన్ని! అందుకే అతడు అన్నాడు "దొంగనాకొడుకులు సార్ వీరు! నలుగురు వెంట ఉంటే వీరు ఏమయినా చేస్తారు. నలుగురిని వెంటేసుకుని దుకాణాలమీద పడతారు. బలవంతంగా మూసేయమంటారు. వీరిని కాదంటే షాపులోని ఫర్నిచర్ పాడుచేస్తారని ఇష్టంలేకపోయినా షాపు మూస్తారు. ఒకరోజు బిజినెస్ జరిగేందువలన వచ్చే లాభం కన్నా, వీరి వలన జరిగే నష్టం ఎక్కువ కదా! మాకు కూడా లారీలు ఆపుకోవడం ఇష్టం ఉండదుసార్. కాని ఏం చేస్తాం?!... మాకు లారీలు ఆపుకున్నందువలన ఒకరోజు బాడుగ నష్టం! అయితే వీరు మనిషి ప్రాణాలే తీస్తున్నారని తెలిసాక... కొడుకుల్ని చంపాలనిపిస్తోంది"

"మీరెంతమంది ఉన్నారు?"

అతడు ఆ ప్రశ్న ఎందుకడిగాడో అర్థంకాలేదు "యాభైమందిమి ఉన్నాం సార్" జవాబు చెప్పాడు.

"ఈ అల్లరిమూక సంఖ్య ఎంత?"

"పదిమంది" బదులు వచ్చింది.

"ఆంజనేయులు నాయుడి మీద జరిగిన హత్యాప్రయత్నంమీద మీకు సానుభూతి ఉందా?"

అవతలివ్యక్తి వ్యంగ్యంగా నవ్వాడు. "దొంగ సార్ వాడు. ఎంతమందిని చంపించాడో లెక్కే లేదు. వాడు బ్రతికి ఉండడం కన్నా చావడమే మేలు"

"అయితే మీరు యాభైమంది, ఈ పదిమందికీ భయపడి లారీలు ఆపుకోవడం ఏమిటి? నాన్సెన్స్"

అనేసి అతడు కారువైపు వెళ్ళిపోయాడు. కారు స్టార్ట్ అయింది. ఏ ఒక్కరూ కారుకి అడ్డం

రాలేదు. రారని అతడికి తెలుసు.

తను కదిలాక ఆ చోట జరగబోయేది కూడా తెలుసు అతడికి. తన మాటల ప్రభావం వారిని తిరగబడేలా చేస్తుంది.

పది గజాలు ముందుకు వెళ్ళాక అతడు వెనుతిరిగి చూశాడు. అతడి అంచనా తప్పు కాలేదు. ఆవేశపడ్డ ఆ భారతప్రజలు అల్లరి మూకను తరిమి తరిమి కొడుతున్నారు. అదే... అదే ఈ దేశానికిప్పుడు కావలసింది! అతడి పెదాలమీద బాధతో కూడిన చిరునవ్వు!

కారు ఇంటివైపు వెళుతూ ఉంది. వెనుకసీటులో లక్ష్మి నిశ్చింతగా ఉంది. ఆమెకిప్పుడు ఈ దేశంలోని ఏ సమస్యతో అవసరం లేదు. ఏ బాధా ఆమెను భయపెట్టలేదు. చావుకన్నా ఈ దేశంలో మరేసుఖం గొప్పది?!

"బాబూ!"

అతడు తలతిప్పి ఆవిడవంక చూసాడు.

"ఈరోజు నువ్వే కనుక లేకపోయి ఉంటే మా పరిస్థితి" గాద్గదికంగా అంది ఆమె. కూతురి మరణం, సమస్యల వలయం ఆమెను బాగా కుంగదీసింది.

"నేనేం చేయగలిగానమ్మా! నేను ఉండీ, లక్ష్మి మరణాన్ని ఆపలేకపోయాను కదా! నన్ను అందరూ సమర్థుడనేవారు. కాని ఈ విషయంలో తలచుకుంటే ... నేనెంత అసమర్థుడినో అర్థమవుతుంది"

"ఇంతకన్నా ఈ సమయంలో ఎవరేం చేయగలరు?"

"అవును... ఇలాంటి సమయంలో ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు" ఒత్తిపలుకుతూ అన్నాడు అతడు. అలా అనడంలో మనసులో రగులుతున్న వేదన ఆమె గుర్తించింది. మౌనంగా, నిశ్శబ్దంగా మనసులోనే రోదించసాగింది.

కారు ఇల్లు చేరింది.

★ ★ ★

జనం చాలామందే వచ్చారు.

టౌన్‌లోని డాక్టర్లు, లక్ష్మి బంధువర్గం, ఆమెకు పరిచితులు.

లక్ష్మి శవాన్ని ఐస్‌ముక్కలమధ్య పెట్టారు. ముఖాన పసుపు, వళ్ళంతా పూలు. అవినాష్ ఇంకా రాలేదు. అతడి రాక కోసమే ఎదురు చూస్తున్నారు వారంతా.

రాధమ్మ కొడుకు దగ్గరగా వచ్చింది "బాబూ" పిలిచింది.

"ఏమిటమ్మా" తలెత్తి చూసాడు అతడు.

"కాస్తన్ని కాఫీ తాగు బాబూ! ఉదయం నుండి ఏమీ తీసుకోలేదని అంటున్నారు" చేతిలోని గ్లాసు అతడి ముందుంచిందామె.

"వద్దమ్మా! నాకు ఇష్టం లేదు"

ఆమె బలవంతం చేయలేదు. ఆమెకు అతడి మనసులోని వేదనస్థాయి తెలుసు. లక్ష్మి అంటే అతడికి చాలా ఇష్టం. ఆమెను పెళ్ళిచేసుకోవాలనుకున్నాడు. ఆమె తనను కాదని మరొకరిని పెళ్ళాడినా, తాను ఆమెమీద కోపం పెంచుకోలేదు. తనమీదన్నే కసిగా మార్చుకుని కష్టపడ్డాడు. ఊహించని స్థాయికి ఎదిగాడు. అయినా ఆమెమీద మమకారం చంపుకోలేదు. ఆమెను చూసేందుకు అప్పుడప్పుడూ ఈ ఊరు వచ్చేవాడు. ఇక్కడికి వచ్చేందుకు సాకు కోసమే ఈ చోట ఓ పేపర్‌మిల్ కట్టించాడు. అంతలా ఇష్టపడిన లక్ష్మి ఇప్పుడు శవంలా తనముందే ఉంటే అతడు విరాగిలా మారకుండా ఉంటాడా? పిచ్చివాడు కాకుండా పోతాడా?

సంధ్య చీకట్లు ముసురుకుంటున్నాయి. ఈరోజు కూడా రాత్రి వస్తుందా? చంద్రుడు కనిపిస్తాడా? నక్షత్రాలు ఉదయిస్తాయా? ప్రపంచ గమనంలో ఏ మార్పూ ఉండదా?... మరి నా లక్ష్మి చనిపోయింది కదా!? ఈ చావుతో ఎవ్వరికీ సంబంధంలేదా?!

ఒక జీవిని మురిపించి, కలలు కనిపించి, అతడినో ఉత్తముడిగా మార్చి... వెళ్ళిపోయిన ఆమె... ఛట్! ఆమెతోపాటు నేనెందుకని వెళ్ళిపోలేకపోతున్నాను.

రాత్రి పదింటికి అవినాష్ వచ్చాడు. భార్య శవాన్ని చూసి బావురుమన్నాడు. డాక్టర్ జయప్రద అతడిని ఓదారుస్తోంది. లక్ష్మి తల్లిదండ్రులు అల్లుడిని సముదాయిస్తున్నారు. చాలామంది అతడిని జాలిగా చూస్తున్నారు.

శ్రీనివాస్‌కి తను కూడా అలాగే లక్ష్మిని

పట్టుకుని ఏడవాలనిపించింది. అయితే తనకు ఆ హక్కు లేదు. ఆమెకోసం అంతలా ఏడిస్తే, ఆ అనుబంధం ఏమిటో అర్థంకాక చాలామంది జుట్టుపీక్కుంటారు. అందుకే వేదనను మనసులోనే దిగమింగుకున్నాడు అతడు. కన్నీరు బయటపడిపోతే, మనసులోని వేదన తగ్గుతుంది. అదిమిపెడితే అది మనిషిని బాధపెడుతూనే ఉంటుంది.

తనకు ఏడుపు రావడం లేదు. మనసులోని వేదన తగ్గడంలేదు. తనకూ ఏడవాలని పిస్తుంది. కాని ఏడ్చాక మిగిలిన ఆనందం కన్నా మనసులో మిగిలిపోయే వేదనే సంతోషాన్ని కలిగిస్తుంది.

అతడిలోని సంఘర్షణను, వేదనను అక్కడి వారెవరూ గుర్తించలేదు. అతడు అక్కడివారికి లక్ష్మి స్నేహితుడిగా మాత్రమే తెలుసు. అయితే అతడేమిటో పూర్తిగా తెలిసిన వ్యక్తి రాధమ్మ! ఆమెకు లక్ష్మి విషయంలో కొడుకు పడే వేదన అర్థమయింది కాబట్టి అతడినే నిశ్శబ్దంగా గమనిస్తోంది.

అందరికీ దూరంగా పెద్దగా వ్యధ చెందని వాడిలా కనుపించే అతడిలో అగ్నిపర్వతాలు బద్దలవుతున్నాయని ఆమెకు తెలుసు.



ఆ రాత్రంతా ఎవ్వరూ నిద్రపోలేదు. అందరూ శవం చుట్టూనే ఉండిపోయారు. వారిలో కొంతమంది కునికిపాట్లు కూడా వడ్డారు.

అతడు మాత్రం అర్ధరాత్రి వరకూ ఉండక అమ్మను తీసుకుని గెస్ట్‌హవుస్‌కి వెళ్ళిపోయాడు. ఆ చివరి రాత్రి లక్ష్మితోనే గడపమని మనసు ప్రాధేయపడింది. అయితే తనలా చేస్తే అది అపోహలకు దారితీస్తుందని మనసు చెప్పిన మాట మెదడు కొట్టిపడేసింది. ఉదయం హాస్పిటల్ నాశనం చేస్తూ అల్లరి మూక అన్న మాటలు అతడి మెదడులో మెదులుతున్నాయి.

తల్లీకొడుకులు గెస్ట్‌హవుస్ చేరారు. అతడికి ఎవ్వరితో మాట్లాడాలనిపించడంలేదు. అందుకే కారు పోర్టికోలో నిలిపాక తిన్నగా బెడ్‌రూమ్ లోనికి వెళ్ళిపోయాడు. అలసటగా బెడ్‌మీద వాలిపోయాడు.

రాధమ్మ అతడి వెనుకే బెడ్‌రూమ్‌లోనికి వచ్చింది ''బాబూ శ్రీనివాస్''

తల్లి పిలుపుకు తలతిప్పి చూసాడు అతడు.

''బాధపడుతున్నావా?''

బలవంతంగా నవ్వాడు. జవాబు మాత్రం చెప్పలేదు.

ఆమె బెడ్‌మీద ఓ మూలగా కూర్చుంది. అతడిక తప్పదన్నట్టుగా లేచి కూర్చుని ఆమె వంక చూడసాగాడు.

''శ్రీనూ! నువ్వు కొన్ని విషయాలలో చాలా అదృష్టవంతుడివి. మరికొన్ని విషయాలలో చాలా దురదృష్టవంతుడివి''

ఆమె ఆ మాట ఏ ఉద్దేశ్యంతో అన్నదో తెలియదుగానీ, అది నిజమని అనిపించింది అతడికి. అందుకే ''అవునమ్మా'' అన్నాడు.

''నీకు తెలుసా! నేను హైదరాబాదునుండి ఎందుకు వచ్చానో''

అతడు ప్రశ్నార్థకంగా ఆమెవంక చూసాడు.

''గాయత్రిని పెళ్ళిచేసుకునేందుకు నిన్ను ఒప్పించేలా చేయమని లక్ష్మిని అడుగుదామని వచ్చాను. అయితే అది 'చివరిచూపు'కోసం మాత్రమే అయింది''

అతడు మాట్లాడలేదు.

''లక్ష్మి మరణం నాకూ చాలా బాధగా ఉంది. అయితే ఈ మరణాన్ని డిప్రెషన్‌గా మార్చుకోకు. అలా చేస్తే లక్ష్మి ఆత్మకు శాంతి ఉండదు''

తలూపాడు శ్రీనివాస్.

"ఇంతే! ఇంతకన్నా నేను నీకేం చెప్పలేను"

రాధమ్మ తలుపు దగ్గరగా లాగి వెళ్ళిపోయింది. శ్రీనివాస్ తిరిగి బెడ్‌మీద వాలాడు. వెల్లకిలా పడుకుని సీలింగ్‌వంక చూడసాగాడు.

ఆ రాత్రి అతడికి నిద్రలేదు. ఆలోచనలు... జ్ఞాపకాలు సుడులుగా, కంటి ముందు సినిమా రీళ్ళుగా... ఆ రాత్రి గాలి నిశ్శబ్దంగా అతడి బాధను వీక్షించింది. చీకటి మౌనంగా వ్యధపడింది.

ఏమీ ఎరుగని దానిలా వేకువ వచ్చేసింది. ఒకరోజు గతించిపోయింది. గతించిన రోజు జ్ఞాపకాలు మాత్రం చాలా భయంకరమయినవి. ఈ వేకువకూడా భయంకరమయినదే! నా స్నేహితురాలిని 'నా నుండి విడదీసి భౌతికంగా కూడా కనుపించనివ్వకుండా చేయబోతోంది' అనుకున్నాడు.

అతడు లక్ష్మి ఇంటికి బయలుదేరాడు "అమ్మా! నువ్వూ వస్తున్నావుగా"

"వస్తున్నాను బాబూ" రాధమ్మ కూడా బయటపడింది. కారెక్కబోతూ కొడుకువంక చూసింది. అతడి కళ్ళు ఎర్రగా ఉన్నాయి- నిద్రలేమితో! ముఖం మాత్రం గంభీరంగా ఉంది. అగాధమైన చోట సముద్రం కూడా అలాగే ఉంటుంది.

వాళ్ళు వెళ్ళేసరికే శవదహనానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. లక్ష్మికి స్నానంచేయించారు. కొత్తబట్టలు చుట్టారు. ముఖానికి పసుపు కుంకుమలు పూసారు. పూలతో అలంకరించారు. పాడె కట్టారు.

బంధువులంతా భోరున ఏడుస్తున్నారు. శవాన్ని పాడెమీదకు ఎక్కించారు.

శ్రీనివాస్ శవం దగ్గరగా నిలబడ్డాడు. ఆమెను కళ్ళారా చూసుకున్నాడు.

ఎవరో అవినాష్ చేతికి నిప్పందించారు. నలుగురు కలిసి పాడెను పైకెత్తుకున్నారు. స్మశానంవైపు సాగారు. వెనుకే అతడు.

స్మశానం చేరాక పేర్చిన కట్టెలమీద శవాన్ని ఉంచారు. అవినాష్ శవం చుట్టూ ప్రదక్షిణ చేస్తున్నాడు.

అతడు ఆ తంతుకు కాసింత దూరంగా నిలబడ్డాడు. వారి చుట్టూ సమాధులు! ప్రతి సమాధి వెనుకా ఒక కథ!! ప్రతి చావూ కొంత మంది శోకానికి కారణం!! కాకుంటే ఆ సంఖ్య కాసింత ఎక్కువ- తక్కువ అంతే!

అలాంటి చావులను ఎన్ని చూసి ఉన్నాయో ఆ ఆవరణలోని చెట్లు జరుగుతున్న తంతును మౌనంగా వీక్షిస్తున్నాయి. ఈ ప్రపంచంలో నుండి మరో జీవి నిష్క్రమణ జరిగే క్షణాలు అవి!

అవినాష్ చితికి నిప్పంటించాడు. శ్రీనివాస్ కన్నులు మూసుకున్నాడు. ఒకటీ... రెండు... మూడు... పది... క్షణాలు గడిచాయి. అతడు బలవంతంగా కన్నులు తెరిచాడు.

ఎదురుగా ఉవ్వెత్తున చితిమంటలు! ఒక అందమయిన ఆకృతిని దహించివేస్తూ... ఒక మనసున్న మనిషిని భౌతికంగా అందరికీ దూరం చేస్తూ... ఒకరి కలలను మరొకరి జీవితాన్ని పండించిన ఆమె అందరికీ దూరంగా వెళ్ళిపోతూ...

అప్పటివరకూ దాచుకున్న దుఃఖం బయటకు పొంగింది. కంటిలో నుండి రెండు నీటి ముత్యాలు 'మిత్రమా! నీ బాధను తగ్గించాలని మేము బయటపడుతూన్నాం' అంటూ బయటకు వచ్చాయి.

ప్రతి మనిషికీ ఏదో సమయంలో శ్మశానవైరాగ్యం కలుగుతుంటుంది. ముఖ్యంగా ఆప్తులు మరణించినప్పుడు ఈ స్థితి తప్పక కలుగుతుంటుంది. అతడికి ఆ క్షణం కలిగిన స్థితి అదే!

చాలాసేపు అతడు దుఃఖమయ స్థితిలో ఉండిపోయాడు. చుట్టూ శూన్యం బ్రతుకే వ్యర్థం...

చితిమంటలు ఆరిపోయాయి.

వచ్చినవారు వెనుతిరిగారు. అతడికి మాత్రం ఆ చోటునుంచి కదలాలనిపించడంలేదు. 'అందరూ... అందరూ లక్ష్మిని ఈ చోట వదిలిపోతే ఆమెకు తోడెవరు? ఈ రాత్రి ఆమెకు భయం వేయదూ?'

అవినాష్ అతడి దగ్గరగా వచ్చాడు. భుజంమీద చెయ్యివేసాడు. ''పద శ్రీనివాస్'' అన్నాడు.

తెప్పరిల్లి చుట్టూ చూసాడు అతడు. అందరూ చాలా ముందుకు సాగిపోయారు. చివరగా తామిద్దరే!

అతడు ముందుకు నడిచాడు. పదడుగులు వేసాక మెల్లగా తలతిప్పిచూసాడు... చితి మంటలు ఆరిపోయాయి.

లక్ష్మి మాత్రం బూడిదగా...

చప్పున తలతిప్పి, ముందుకు నడిచాడు అతడు.

★ ★ ★

చతుర్వేది, సోమనాథ్ ఇద్దరూ కలసి గెస్ట్‌హవుస్‌కు వచ్చారు. ఆ సమయంలో శ్రీనివాస్ హాలులో కూర్చుని ఏదో దీర్ఘంగా ఆలోచించుకుంటున్నాడు. వారిని చూసి ''రండి... కూర్చోండి'' అంటూ కుర్చీలు చూపించాడు.

వారిద్దరూ అతనికి ఎదురుగా కూర్చున్నారు.

శ్రీనివాస్‌కి వెంటనే నిన్నటి సంఘటన గుర్తుకువచ్చింది. ''సారీ మిస్టర్ సోమనాథ్, నిన్న పెళ్ళికి హాజరవ్వాలనుకున్నాను. బట్...''

''తెలుసు సార్! లక్ష్మిగారికి జరిగిన అన్యాయం కూడా తెలుసు. ఆ స్థితిలో మీరు రాగలరని ఎలా అనుకుంటాం''

చతుర్వేది చెప్పాడు ''మేము ఉదయమే మిమ్మల్ని కలవాలనుకున్నాం సార్! మీరు ఆవిడ అంత్యక్రియలకు వెళ్ళి ఉంటారని రాలేదు''

అతడు తలెత్తి వారి వంక చూసాడు. ''ఏమిటి విషయం?''

''నిన్న 'బంద్' రోజు మన పేపర్‌మిల్ మీద దాడి జరిగింది సార్! ఆ పార్టీ కార్యకర్తలు నినాదాలు చేసుకుంటూ చాలా మెషినరీని పాడుచేసారు''

''పోలీస్ ప్రొటక్షన్ లేదా?''

''నిన్న బంద్ కారణాన తక్కువమందిని పంపారు''

అతడు మౌనంగా ఉండిపోయాడు.

అరనిముషం మౌనం సాగాక సోమనాథ్ చెప్పాడు. ''ఆంజనేయులునాయుడు క్షేమంగానే ఉన్నాడట సార్! ఓ వారం, పదిరోజులు బెడ్ రెస్ట్ తర్వాత డిశ్చార్జ్ చేసేస్తారట''

అతడు నిశ్శబ్దంగా తలాడించాడు.

ఈసారి చతుర్వేది చెప్పాడు. ''ఆంజనేయులు నాయుడికి ఈ సంఘటనతో రాష్ట్రవ్యాప్తంగా పాపులారిటీ పెరిగిపోయింది సార్! అతడి మీద హత్యాప్రయత్నం జరిగిందని తెలిసాక జనాలలో సానుభూతి కూడా వచ్చింది. నెక్స్ట్ టైమ్ అతడు సులభంగా ఎమ్మెల్యేసీటు కొట్టేస్తాడని జనాలు అంటున్నారు''

అతడికి నవ్వాలనిపించింది. ఈ జనం చాలా అమాయకులు! వీరి అమాయకత్వాన్ని రాజకీయనాయకులు కేష్ చేసుకుంటూ ఉంటారు.

''మీరోసారి మిల్‌కు వచ్చి పరిస్థితి చూస్తే బాగుంటుందని మేము అనుకుంటున్నాం సార్''

''ఇప్పుడు కాదు, నేను వెళ్ళేముందు మిల్‌కు వస్తాను''

''ఎప్పటివరకు ఉంటారు సార్?''

మరో రెండు రోజులు మాత్రమే''

వారు పైకి లేచారు ''వెళ్లొస్తాం సార్''

అతడు తలాడించాడు, వారిద్దరూ వెళ్లిపోయారు.

శ్రీనివాస్ సాఫాలోనుండి పైకి లేచాడు. మెల్లగా నడుచుకుంటూ కిటికీ దగ్గరగా వెళ్ళాడు.

ఆకాశంలో సంధ్య చీకట్లు ముసురుకుంటున్నాయి. అతడికి తిలక్ కవిత 'సంధ్య' గుర్తుకు వచ్చింది.

'గగనమొక రేకు, కన్నుగవసోకు
ఎరుపెరుపు చెక్కిళ్ల విరిసినది చెంగల్వ'

ఫోన్ రింగు కావడంతో మనసులో కదలాడుతున్న కవిత, మధ్యలోనే ఆగిపోయింది. సంధ్యలో కనుపిస్తుండిన లక్ష్మి రూపు చెదిరిపోయింది. శ్మశానంలో ఉదయం కాలిన చితిలోని బూడిద కూడా గాలికి ఎగిరిపోయే ఉండొచ్చు.

అతడు అటుగా నడిచాడు. రిసీవర్ చేతిలోనికి తీసుకున్నాడు. "హలో" అన్నాడు బలపీనంగా.

"నేను గాయత్రిని"

అతడు ఆ సమయంలో ఊహించని ఫోన్ "ఏమిటి విషయం?"

"రాత్రి ఆంటీ ఫోన్ చేసి చెప్పింది. జరిగింది చాలా దారుణమయిన విషయం" శ్రీనివాస్ నిశ్శబ్దంగా ఉన్నాడు.

"నాకు చాలా బాధ కలిగింది. రాత్రంతా ఆలోచిస్తూనే గడిపాను"

అతడు అప్పటికీ మాట్లాడకపోయేసరికి ఆమె విసుగ్గా "ఏమిటీ నా మాటలు అబద్ధంగా అనిపిస్తున్నాయా?... నిజంగా నేను చాలా బాధపడుతున్నాను" అంది.

శ్రీనివాస్ బలవంతంగా నవ్వాడు "నీ మాటలు అబద్ధాలని నేను అనడం లేదు. కాకపోతే మాట్లాడే ఓపిక నాలో లేదు"

"ఆంటీ ఉందా?"

"పిలుస్తాను..."

"పిలిచే ముందు ఒక మాట చెప్పు... మీరు హైదరాబాదు ఎప్పుడు వస్తున్నారు?"

"మరో రెండు రోజులలో"

ఆల్‌రైట్! ఇప్పుడు ఆంటీని పిలవండి"

అతడు రిసీవర్ పక్కన పెట్టేసి, తల్లిని కేకేసాడు. "వస్తున్నా బాబూ" అంటూ ఆవిడ బెడ్‌రూమ్‌లో నుండి వచ్చింది. "గాయత్రి నుండి ఫోన్" అంటూ అతడు అవతలికి వెళ్లిపోయాడు.

రాధమ్మ, గాయత్రితో ఏదో మాట్లాడుతోంది . అతడు వారి మాటలు ఆలకించటం లేదు. టేబుల్ మీది పేపర్ చేతిలోనికి తీసుకున్నాడు.

క్రితం రోజు టౌనులో జరిగిన 'బంద్' తాలూకు వార్త ప్రచురింపబడి ఉంది. అందులో ఒక సెంటర్‌లో ఉద్రేకపడిన జనం 'అల్లరిమూక'ను తరిమికొట్టడం కూడా రాసి ఉంది.

అతడి కన్నుల ముందు అదే దృశ్యం!... జనం అల్లరిమూకలను తరమడం! దేశమంతా అలా జరిగిననాడు ఈ 'బంద్' అనే సమస్య ఇలా వికృతంగా నృత్యం చేయదు.

శ్రీనివాస్ పేపరు మూసాడు. కుర్చీలో వెనక్కువాలి 'లక్ష్మి' గురించి ఆలోచించసాగాడు.

లక్ష్మి మరణానికి కారణం ఏమిటి? ఆమెను సమయానికి హాస్పిటల్‌కు తీసుకువెళ్ళలేకపోవడం. ఆమెను సమయానికి హాస్పిటల్‌కు తీసుకువెళ్లి ఉంటే తప్పక బ్రతికి ఉండేది. లక్ష్మిని తను ముందుగా హాస్పిటల్‌కి ఎందుకు తీసుకువెళ్ళలేకపోయాడు?!

'బంద్!'

అవును! బంద్ పేరుతో కొందరు 'అల్లరి జనం' కారును ఆపారు. ఆ ఆలస్యం ఆమె మరణానికి కారణమయింది.

ఛట్! ఈ 'బంద్'లు అనేవి దేశంమీద వికృతంగా పరచుకున్న పెనుభుతాలు. ఈ పిశాచానికి ఎంతమంది బలవుతున్నారో?!

ఈ బంద్‌లను ఆపడం సాధ్యం కాదా?!

రాధమ్మ ఫోన్‌లో మాట్లాడటం అయిపోయినట్టుంది. రిసీవర్ క్రెడిల్‌మీద ఉంచి అతడి దగ్గరగా వచ్చింది. మరో ఛెయిర్‌లో కూర్చుంది.

"గాయత్రి ఫోన్ చేసింది"

"తెలుసు"

"లక్ష్మి మరణంపట్ల ఆమె చాలా బాధపడుతోంది "

అతడు జవాబుగా ఏమీ మాట్లాడలేదు. అతడు ఈ సమయంలో ఏమీ మాట్లాడడని తెలిసి ఆమె లోపలికి వెళ్ళిపోయింది. అతడు తన ఆలోచనలలో తాను మునిగిపోయాడు.

★ ★ ★

ఆరోజు సాయంత్రం శ్రీనివాస్ హైదరాబాదు వెళ్ళిపోవాలనుకున్నాడు.

ఉదయమే అతడు మిల్‌కు బయలుదేరాడు.

అతడు బయలుదేరబోతుంటే రాధమ్మ చెప్పింది "బాబూ! ఎందుకయినా మంచిది, ఎస్కార్ట్ తీసుకుని వెళ్ళకూడదూ?"

"పిచ్చితల్లి" ఆమెవంక జాలిగా చూసాడు శ్రీనివాస్ "నాకేమవుతుందమ్మా! నన్ను నమీపించడం ఎవ్వరికయినా చాలా కష్టం"

"అదికాదు బాబూ..." ఆమె మరేదో చెప్పబో

యింది.

"ప్లీజ్! మరేం మాట్లాడవద్దు" అతడు బయటకు నడిచాడు. కారు తీసుకుని ఒంటరిగానే మిల్‌కు బయలుదేరాడు.

పది నిముషాల ప్రయాణం తర్వాత 'ఆ చోటు' రాగానే ఆటోమేటిగ్గా అతడి కారు స్లో అయింది. అక్కడే... అక్కడే ఆంజనేయులు నాయుడిని తాను కాపాడింది. ఒకవేళ అతడు అక్కడే చనిపోయి ఉంటే... బహుశా తన లక్ష్మి కాపాడబడి ఉండేది కాబోలు. ఒకరికి బదులు మరొకరు.

తిరిగి వేగం పెంచాడు శ్రీనివాస్. మిల్ చేరేసరికి చతుర్వేది, సోమనాథ్‌లు అతడి కొరకే ఎదురుచూస్తున్నారు. వారి వెంట మిల్ మొత్తం తిరిగి చూసాడు. కొద్ది సమయం తర్వాత తిరిగి ఆఫీసులోకొచ్చి కూర్చున్నారు.

వారిద్దరూ జె.యస్.వంక పరిశీలనగా చూసారు. ఈ నాలుగు రోజులలోనే అతడిలో మార్పు కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. ముఖం పీక్కుపోయి ఉంది. కళ్లు ఎర్రగా ఉన్నాయి. చాలా దిగులుగా కనిపిస్తున్నాడు అతడు. సామ్రాజ్యం కోల్పోయిన చక్రవర్తిలా అగుపిస్తున్నాడు.

ఆఫీసులో కూర్చున్న కొద్దిక్షణాల తర్వాత అతడు అడిగాడు.

"ఇప్పుడు మిల్ పరిస్థితి ఎలా ఉంది"

"చాలా బాగుంది సార్! కార్మికులు సమ్మె మానేసారు. అందరూ డ్యూటీలకు హాజరవుతున్నారు"



శ్రీనివాస్ ఆరు సెకనులపాటు మౌనంగా ఉన్నాక అన్నాడు "నేను... నేను ఈ మిల్ మూసేయాలనుకుంటున్నాను"

"వాట్" తాము విన్నది నిజమో, అబద్ధమో అర్థంకాక అతడి ముఖంలోనికి చూసారు వారు.

"నిజమే!... ఈ మిల్‌ను మూసేయాలనుకుంటున్నాను"

వారు గొంతు పెగల్చుకుని అడిగారు "ఎందుకని సార్?"

"నాకు ఇష్టం లేదు కాబట్టి"

"కానీ... మనం ఇలా మూసేస్తే కార్మికులు గొడవ చేస్తారేమో!"

"లెట్ దెం గో టు హెల్... నాకు వారెవరితో అవసరం లేదు"

ఇక అతడికి ఎదురు మాట్లాడే ధైర్యం వారిలో లేదు. మౌనంగా ఉండిపోయారు వారిద్దరూ. అయితే వారి మనసులలో మాత్రం అప్పటికే బతుకు భయం ఏర్పడిపోయింది.

"రేపు ఒకటవ తారీఖున వర్కర్స్ శాలరీస్ క్లియర్ చేసేసి మిల్‌ను మూత వేసేయండి. మన మిల్‌కు నష్టాలు వస్తున్నాయని చెప్పేయండి"

అతడి నోటి వెంట వచ్చే ప్రతివాక్కూ వేదవాక్కు. ఎదురు చెప్పేసాహసం చేయలేరు వారు.

మరో పదినిముషాలు కూర్చున్నాక, లేచి వచ్చేసాడు అతడు.

మిల్‌నుండి తిన్నగా అవినాష్ ఇంటికి వెళ్ళాడు. అతడు వెళ్ళేసరికి అవినాష్ హాలులో కూర్చుని మెడికల్ జర్నల్స్ తిరగేస్తున్నాడు. శ్రీనివాస్‌ని చూసి "హలో రండి! కూర్చోండి" అన్నాడు.

శ్రీనివాస్ అతడి ఎదురుగా కూర్చున్నాడు. "ఈరోజు సాయంత్రం హైదరాబాదు వెళుతున్నాను. చెప్పి వెళ్దామని వచ్చాను"

"ఐసీ" అన్నాడు అవినాష్. "వచ్చి చాలారోజులు అయింది కదూ?"

"అవును"

"మీకు చాలా థాంక్స్ చెప్పాలి. ఎందుకంటే- ఆరోజు మీరు చాలా రిస్క్ తీసుకున్నారని ఆంటీ చెప్పింది"

అతడు నవ్వి ఊరుకున్నాడు.

"అన్నట్టు ఈ పాంప్లెట్ చూసారా? అతడు ఒక మెడికల్ జర్నల్‌లో పెట్టి ఉన్న పాంప్లెట్ ఒకదానిని తీసి అతడికి అందించాడు అది అందుకుని హెడ్డింగ్ చూసాడు శ్రీనివాస్.

'ప్రశాంతంగా బంద్ జరుపుతున్నవారిమీద విద్రోహశక్తుల దాడి'

నాలుగు వాక్యాలు చదివేసరికి అతడి ముఖం ఎర్రబడింది. అతడు అవినాష్ కన్నులలోకి చూసి సిగ్గుపడ్డాడు. అవినాష్ మాత్రం అతడివంకే చిరునవ్వుతో చూస్తున్నాడు. అతడి చూపులు తిరిగి పాంప్లెట్ మీదకు మళ్ళాయి.

'...శ్రీ ఆంజనేయులునాయుడిమీద జరిగిన హత్యాప్రయత్నానికి నిరసనగా 9వ తేదీ పార్టీ కార్యకర్తలు పట్టణంలో ప్రశాంతంగా బంద్ జరుపుతున్నారు. ఆ సమయంలో జె.యస్. పేపర్‌మిల్ ఓనర్ శ్రీనివాస్ తన ప్రియురాలు లక్ష్మి అనే ఆవిడను హాస్పిటల్‌కు తీసుకువెళ్ళాడు. ప్రసవసమయంలో ఆమె మరణించడంతో అతడి మతిభ్రమించింది. శవాన్ని తీసుకువచ్చేటప్పుడు అతడు కారాపి బంద్ నిర్వాహకులమీద చెయ్యి చేసుకున్నాడు. ఆ అదనుకోసమే ఎదురుచూస్తున్న విద్రోహశక్తులు కొన్ని నిర్వాహకులుమీద దాడి జరిపాయి. కొంతమంది గాయపడ్డారు. ఈ దుశ్చర్యను ఖండిస్తూ 13వ తేదీన జిల్లావ్యాప్తంగా బంద్ జరపాలని నిశ్చయింపబడింది. అన్ని వర్గాలవారూ ఈ బంద్‌కు మద్దతు తెలిపి సహకరించాలని..."

శ్రీనివాస్ అయోమయంగా అవినాష్ వంక చూశాడు. అవినాష్ పెదాలమీద చిరునవ్వు మాత్రం చెరిగిపోలేదు.

"ఈ పాంప్లెట్..."

"టౌన్ మొత్తం పంచారు"

"బాస్టర్డ్స్" కసిగా పలికాడు శ్రీనివాస్.

కొద్దిక్షణాలపాటు ఏం మాట్లాడాలో అర్థంకాలేదు అతడికి. నిశ్శబ్దంగా ఉన్నాడు. అవినాష్ కొద్దిసేపటికి తనే మాట్లాడాడు.

''బాధపడుతున్నారా?''

ఆ ప్రశ్నకు బదులేం చెప్పాలి?

''ఆ పాంప్లేట్ చూడగానే నేనూ మొదట హర్ట్ అయ్యాను. కాని ఆలోచిస్తే నా బాధ అర్థం లేనిదిగా అనిపించింది. లోకం ఎన్నిరకాలుగా నయినా అనుకుంటుంది. అవన్నీ పట్టించు కుంటే మనకు బాధ మాత్రమే మిగులు తుంది. లక్ష్మి ఎలాంటిదో నాకు తెలుసు. ఇక స్నేహం అంటే- ఆడా, మగా స్నేహాన్ని అపార్థం చేసుకునేంత కుత్సిత మనస్తత్వం నాలో లేదు.

అవినాష్ వంక కళ్లింతలు చేసుకుని చూస్తూ ఉండిపోయాడు శ్రీనివాస్. ఆ క్షణం అతడికి చేతులెత్తి నమస్కరించాలని పించింది. అవినాష్ ఆ టాపిక్ అక్కడితో కట్ చేశాడు.

''రండి! పాపాయిని చూద్దురు''

అతడు పైకి లేచాడు. ఇద్దరూ అటుగా నడిచారు.

బెడ్‌రూమ్‌లో ఉయ్యాలలో పడుకోబెట్టి ఉంది పాపాయి. ముద్దుగా; బొద్దుగా ఉన్న అమ్మాయి. అతడికి పార్క్‌లో తామిద్దరూ పుట్ట బోయే పాపాయి గురించి చర్చించుకోవడం జ్ఞప్తికి వచ్చింది. పాపాయి పుట్టింది. లక్ష్మి మాత్రం అందనంత దూరానికి ఎగిరిపో యింది.

శ్రీనివాస్ పాపాయిని చేతులలోనికి తీసుకు న్నాడు. మృదువుగా నుదుటన పెదవులతో తాకాడు. పాపాయి ఏడ్చింది. అవినాష్ అత్తగా రు వచ్చి పాపాయిని అందుకుంది.

కాసేపు ఆచోట నిలబడ్డాక, వారిద్దరూ హాలు లోనికి తిరిగివచ్చారు.

''పాపాయికి మీచేత పేరు పెట్టించాలని లక్ష్మి కోరిక''

అతడు అవినాష్ వంక అదోలా చూశాడు. ''అలా అని లక్ష్మి మీకు ఎప్పుడు చెప్పింది''

''చెప్పలేదు. తెలుసుకున్నాను'' నవ్వాడు అతడు.

''ఎలా?'' ఆశ్చర్యపోయాడు శ్రీనివాస్.

''ఎలా అయితేనేం? అధి ఆమె కోరిక.. ఆమె కోరికను మీరు తీర్చాలి. ఇప్పుడు కాదు, బట్ ఎప్పుడయినా పాపాయికి పేరుపెట్టే అర్హత మాత్రం మీకే ఉంది''

మౌనంగా ఉండిపోయాడు. కొద్దినిమిషాలు గడిచాక అన్నాడు. ''నేనిక వెళ్తాను'' పైకి లేచాడు అతడు.

''భోంచేసివెళ్లండి... ప్లీజ్''

కాదనలేకపోయాడు. లక్ష్మి తల్లి డైనింగ్‌టే బుల్‌మీద అన్నీ సర్దింది.

ఆ ఇంట ఒకరకమైన గంభీరత్వం కదలా డటం గమనించాడు శ్రీనివాస్. వారంతా ఏ పనిచేస్తున్నా వారి మనసులలో లక్ష్మి మెదులు తోందని అర్థమయింది. వారు ఏదో బతకలేక బ్రతుకు వెళ్లదీస్తున్నట్టుంది. వారు భోంచే యడం కూడా అయిష్టంగానే! లక్ష్మి వెళుతూ- ఆ ఇంట్లోని ఆనందాన్ని ప్రశాంతతను తీసుకె ళ్లిపోయిందేమో!

అవినాష్‌కి నలుగురిలో పేరు తెచ్చుకోవాల న్న కోరికతోపాటు, లక్ష్మి అంటే విపరీతమయిన ప్రేమ కూడా ఉంది. లక్ష్మి వచ్చాక జీవితంలో అసలు ఆనందం అంటే ఏమిటో తెలిసింది. కానీ మీటింగ్‌లు- పబ్లిసిటీ మేనియాలమీద వ్యామోహం మాత్రం చంపుకోలేకపోయాడు. లక్ష్మి ప్రసవించే సమయంలో తాను దగ్గర లేకపోయానే అనే బాధ అతడు అనుక్షణం అనుభవిస్తూనే ఉన్నాడు.

భోంచేస్తుంటే అవినాష్ చెప్పాడు. ''ఈరోజు సాయంత్రం రైల్వేస్టేషన్‌కి నేనూ వస్తున్నాను- సెండాఫ్ ఇచ్చేందుకు. అక్కడ మీకో మంచి ప్రజంటేషన్ ఇస్తాను... చాలా గొప్ప బహు మతి''

''ఏమిటది?''

''చెప్పను సాయంత్రం అందుకుంటా రుగా'' అదోలా నవ్వాడు.

''ఏమిటో అంత గొప్ప బహుమతి?'' మన సులో ఊహించేందుకు ప్రయత్నించాడు అత డు. అయితే సరయిన సమాధానం తోచలేదు.

భోంచేశాక ''వెళ్ళొస్తాను'' అనేసి బయటకు నడిచాడు. కారు స్టార్ట్ చేసుకుని గెస్ట్‌హౌస్‌వైపు పోనిచ్చాడు.

అప్పటికి మూడయింది. ''అమ్మా! గాయత్రికి ఫోన్‌చేసి చెప్పు. రేపుదయం స్టేషన్‌కి కారు పంపమని''

''అలాగే'' అంది రాధమ్మ.

అతడు బట్టలు సర్దుకున్నాడు. అవసరమయిన వారికి ఫోన్‌చేసి చెప్పాడు. హైదరాబాద్‌కి ఫోన్‌చేసి తన బిజినెస్ వ్యవహారాలు కనుక్కున్నాడు.

సాయంత్రమయింది. కారులో తల్లీకొడుకులు స్టేషన్‌కు చేరుకున్నారు. సోమనాథ్, చతుర్వేదిలు కూడా స్టేషన్‌కు వచ్చారు.

ట్రెయిన్ మరో పదినిమిషాలలో కదులుతుందనగా, అవినాష్ స్టేషన్‌కి వచ్చాడు. శ్రీనివాస్ అతడి కోసమే ఎదురుచూస్తున్నాడు.

అవినాష్ చేతిలో ఓ ప్యాకెట్ ఉంది. శ్రీనివాస్‌ని చూడటంతోనే అతడు పలకరింపుగా నవ్వాడు.

''ట్రెయిన్‌కి మరో పావుగంట టైం ఉందికదూ?''

''అవును''

''ఇదిగోండి. మీకు ఇస్తానన్న గొప్ప బహుమతి''

''ఏమిటిది?'' అతడు అందించిన ప్యాకెట్ అందుకున్నాడు.

''లక్ష్మి డైరీలు... చాలాకాలం నుండి భద్రంగా దాచుకుంది. జీవితకాలంలో అవి ఎవ్వరూ చూడకూడదు. బట్ వ్యక్తి మరణం తర్వాత ఆప్తులకు వాటిమీద అధికారం ఉంటుంది. అందులోనూ ఆ పాంప్లెట్ చూశాక- అసలు లక్ష్మి మనసు ఏమిటో తెలుసుకోవాలనిపించింది. అందుకే లక్ష్మి డైరీలు తీశాను చదివాను...'' అతడు బలంగా ఊపిరిపీల్చాడు. ''లక్ష్మికి మీరంటే చాలా ఇష్టం శ్రీనివాస్! ఎంత ఇష్టం అంటే ఆమె తన డైరీలో ఎక్కువగా మీ గురించే వ్రాసుకుంది. మీతో తిరిగినరోజులు, మీ మీదున్న అభిమానం, చివరికి తనకు పుట్టబోయే పాపాయికి మీ చేతనే పేరు పెట్టించాలన్న కోరికతోసహా వ్రాసుకుంది. ఆవిడ నాకన్నా మీ సన్నిధిలోనే ఎక్కువ ఆనందాన్ని పొందేదట... భర్తగా ఆమెకు నామీద అభిమానం ఉంది. అయితే భర్తగా నామీద ఉన్న అభిమానానికన్నా మీ మీద ఉన్న ఇష్టమే ఎక్కువ. ఇందుకు నేను ఈర్ష్యపడటంలేదు. లక్ష్మిమీద కోపపడటంలేదు. మీరు, నేను ఒకచోట నిలబడితే ఏ ఆడదయినా మిమ్మల్నే ఇష్టపడుతుంది. ఉన్నతమయిన మీ వ్యక్తిత్వాన్ని అభిమానిస్తుంది. మీ సమర్థతపట్ల ఆకర్షితురాలవుతుంది. అందుకే- నేను మీలా కాకపోయానే అని బాధపడుతున్నాను తప్ప, మీ స్నేహంపట్ల అసూయపడటం లేదు. పైగా లక్ష్మిమీద నాకు పూర్తి నమ్మకంఉంది. ఆ నమ్మకాన్ని చివరివరకూ కాపాడింది లక్ష్మి... ఐయామ్ వెరీమచ్ ప్రౌడ్ ఆఫ్ మై వైఫ్...''

అవినాష్ కన్నులలో అప్పుడు... అప్పుడు కదలాడాయి కన్నీరు.

శ్రీనివాస్‌కి ఏం మాట్లాడాలో అర్థంకాలేదు. ''ప్లీజ్... ప్లీజ్ అవినాష్! అందరూ చూస్తున్నారు'' అన్నాడు. అతడు కన్నులు తుడుచుకున్నాడు.

''లక్ష్మి లేదని మీరు మమ్మల్ని మరచిపోకండి. ఇక్కడికి వచ్చినప్పుడు మా ఇంటికి వస్తుండండి''

''అలాగే''

''రైలు వస్తున్నట్టు అనౌన్స్‌మెంట్ వినిపించింది. పోర్టర్ సామాను నెత్తికి ఎత్తుకున్నాడు. జనంలో కలకలం మొదలయింది.

''మరొక్కమాట శ్రీనివాస్''

''లక్ష్మి చివరికోరిక మీరు తీర్చాలి''

''ఏమిటది?''

''మీరు పెళ్లిచేసుకోవాలి... లక్ష్మి అది తన కోరికగా డైరీలో వ్రాసుకుంది... ప్లీజ్! ఆవిడ చివరి కోరికగా దానిని తీర్చరూ?''

దూరంగా రైలు కూతవేసింది. ''వెళ్లొస్తాను అవినాష్''

అతడు నిశ్శబ్దంగా తలాడించాడు.

రైలు వచ్చి ప్లాట్‌ఫారంమీద ఆగింది. పోర్టర్ సామాను కంపార్ట్‌మెంట్‌లో పెడుతున్నాడు. రాధమ్మ రైలెక్కి తన సీటులో కూర్చుంది.

చతుర్వేది, సోమనాథ్‌లు జె.యస్. దగ్గరగా

వచ్చారు. ''చూడండి! మీరు ఓ పదిరోజుల తర్వాత హైదరాబాద్ రండి. మిల్ విషయం మరింత విపులంగా మాట్లాడుకుందాం. లాయర్‌తో మాట్లాడి మిల్ మూసేయడంలో ఎలాంటి ప్రాబ్లమ్స్ ఉన్నాయో చర్చించు కుందాం''

''అలాగే సర్''

''అతడు రైలెక్కాడు. కిటికీ పక్కగా ఉన్న తన సీటులో కూర్చున్నాడు. అవినాష్ అతడి చేతిలో చెయ్యి ఉంచాడు. ''గుడ్‌బై''

''బై'' చెప్పాడు అతడు. రైలు కదిలింది ముందుకు.

అవినాష్ చెయ్యి ఊపాడు. అతడూ చెయ్యి ఊపాడు. ఇద్దరిమధ్యా దూరం ఎక్కువయింది. అతడు ఒక్కసారి వెనక్కు తిరిగి దూరమవుతు న్న పట్టణాన్ని చూశాడు.

''తను ప్రశాంతంగా గడపాలని ఆ పట్టణం రావడం, తన మిల్‌లో ఒక కార్మికునికి, సూపర్ వైజర్‌కి మొదలయిన గొడవ జిల్లా బంద్‌గా మారడం, ఆ బంద్ సమస్యకు తనకిష్టమ యిన లక్ష్మి బలికావడం...

దీర్ఘంగా నిట్టూర్చాడు అతడు.

అతడికి అవినాష్ అందించిన పాంప్లెట్ గుర్తుకు వచ్చింది. 'రేపు కూడా పట్టణ బంద్ కదూ?' అనుకున్నాడు. బంద్ అన్నపదం తల చుకుంటే అతడి వళ్లు జలదరించింది. ఆ పదం ఈ దేశంలో ఎన్ని ఘోరాలు సృష్టిస్తోంది' అనుకున్నాడు అతడు.

రైలు పెన్నేరుమీద పరిగెడుతోంది. 'దడ్... ధడ్... ధడ్...' మనేశబ్దం. అతడు తన చేతి లోని ప్యాకెట్ చూశాడు.

లక్ష్మి డైరీలు అవి!

ప్యాకెట్ విప్పాడు. అందులో పైనే ఉన్న డైరీ తీశాడు.

మే, 2.

ఈరోజు మధ్యాహ్నంవేళ శ్రీనివాస్ వచ్చా డు. అతడి పెదాలమీద ఎప్పుడూ అదోలాటి చిరునవ్వు కదలాడుతూ ఉంటుంది. అవినాష్ ఊరెళ్ళాడని తెలిసి బాధపడ్డాడు. అతడి కా రులో ఇంటికి వచ్చాం. అతడిలో ఎంత హుందాతనం! కేవలం స్వయంకృషితో పైకి వచ్చినవాడు.

అతడు నా దగ్గరగా ఉంటే నాకెంతో ఆనందంగా ఉంటుంది. నేను పెళ్లయినదా న్ని. అతడు పరాయివాడు. అతడి సన్నిధిలో నాకీ ఆనందం ఎందుకంటే నేనేమీ చెప్పలేను. ఆకాశంలోని చంద్రుడిని చూసి 'కలువ' మురి సిపోతుంది. ఎందుకని? నేనూ అంతేనేమో!

అంత పెద్ద బిజినెస్ మాగ్నెట్ నాకోసం పావుగంట వెయిట్ చేయడం... నాలాంటివా రిని పదిమందిని చుట్టూ పెట్టుకోగలస్థితి అత డిది. అతడికి స్నేహితురాలిని కావడం నేను చేసుకున్న అదృష్టమేమో!

ఆంటీని గురించి అడిగాను. మరో కొద్దిరోజు లలో నన్ను చూడాలని రాబోతుందట. ఆంటీ వస్తే నన్ను ఏమడుగుతుందో తెలుసు? తన కొడుకుని పెళ్లికి ఒప్పించమని బ్రతిమిలాడు తుంది. ఇంతకుమునుపు ఓసారి కూడా ఈ విషయమే ఫోన్‌లో మాట్లాడింది. అప్పుడు శ్రీనివాస్ ఇక్కడే ఉన్నాడు. ఇప్పుడు కొడుకు ఇక్కడ ఉన్నప్పుడు తనూ వస్తుందట! అంటే నా పరిస్థితి మరీ ఇరకాటంలో పడుతుంది. అప్పటికీ శ్రీనివాస్‌ని పెళ్లి చేసుకోమని బ్రతి మిలాడితే తనది అడ్జస్ట్ అయ్యే మెంటాలిటీ కాదన్నాడు. ఏం చేయను?

అన్నట్టు- ఈరోజు రాష్ట్రవ్యాపితంగా బంద్. 'బంద్'వలన జనంపడే ఇబ్బందులు అతడు వివరించబోతుంటే ఫోన్ మోగింది- అవినాష్ నుంచి ఫోన్. మామధ్య బంద్ గురించిన మాటలు కట్ అయ్యాయి.

ఇలాంటి టాపిక్‌లు వచ్చినప్పుడే అతడి లోని అసలు మనిషి కనిపిస్తాడు. శ్రీనివాస్‌కి ఈ దేశమంటే చాలా అభిమానం. అతడు ఈ డబ్బు సంపాదనమీద కసి పెంచుకోనట్టయితే, ఒక మంచి సంఘసేవకుడు అయిఉండేవా డు. నాయకత్వలక్షణాలు అతడిలో ఉన్నాయి.

శ్రీనివాస్ ఇక్కడ వారంరోజులపాటు ఉంటాడట. ప్రశాంతత కోసం వచ్చాడట! ఈ వార్త నాకెంత సంతోషాన్ని కలిగిస్తోందో చెప్పలే ను. ఒకనాటి తీపిగుర్తులు తిరిగి గుర్తు చేసుకో

వచ్చు. అతడి సన్నిధిలో మనసు ఊహాలోకంలో విహరిస్తుందన్నమాట మాత్రం నిజం!

మే, 3.

ఉదయమే శ్రీనివాస్‌నుండి ఫోన్ వచ్చింది- ఆదివారం కాబట్టి కంపెనీ ఇవ్వమని. ఆనందంగా అంగీకరించాను. మధ్యాహ్నంనుంచి అతడికోసం ఎదురుచూపులు మొదలయ్యాయి. అతడికిష్టమయిన గులాబీ రంగు చీర కట్టుకున్నాను.

కారులో అతడి పక్కనే కూర్చుంటే ఏమిటో చెప్పలేని అనుభూతి? ఈ అనుభూతికి నేను ఏం పేరు పెట్టేది? అతడికింకా చిన్నపిల్లాడిలా ఐస్‌క్రీం తినే అలవాటు పోలేదు. నేను చెపితే ఆపేస్తాడు. మనిషి జీవితంలో ఉండే చిన్న చిన్న ఆనందాలు బలవంతంగా ఆపేయడం ఎంతవరకూ సబబు? అందులోనూ అది పెద్దగా హానికరమయిన అలవాటు కాదుకదా!

ఇద్దరం పార్కుకి వెళ్ళాం. అతడి ప్రతి మాటలోనూ నా పట్ల ప్రేమ కనిపిస్తుంది. అలాగే నా మదిలోనికి నేను తొంగి చూసుకుని ప్రశ్నించుకుంటే నాలోనూ అదే భావమేమో. కాని బయటపడటం సబబు కాదుకదా!

ఈరోజు కూడా మా ఇద్దరి మధ్యా బంద్ గురించి చర్చ జరిగింది. ఆ సమస్యను స్వార్థపరులే క్రియేట్ చేస్తున్నారట. ఆ సమస్య మనలను ఇబ్బందికి గురిచేస్తే తప్ప, మనం ఆ సమస్య గురించి సీరియస్‌గా ఆలోచించమట. నాకు నవ్వొచ్చింది.

పార్కులో ఒక పాపాయిని చూసి శ్రీనివాస్ ముచ్చటపడ్డాడు. నాకు పుట్టబోయేది ఆడపిల్లేనని డిసైడ్ చేశాడు ఏమో! నాకూ ఆడపిల్ల పుడితేనే బాగుంటుందనిపిస్తుంది. శ్రీనివాస్ మాట నిజం చేసినట్టుంటుంది. 'పాపాయికి పేరు చెప్పమని' బలవంతం చేశాను. ఆ అర్హత తనకు లేదని తప్పించుకున్నాడు అతడు. ఏదేమయినా నా తొలిపాపాయికి శ్రీనివాస్‌కి ఇష్టమయిన పేరే పెట్టాలి. ఈ విషయంలో అవినాష్‌ని కూడా ఒప్పించాలి.

ఇద్దరం కలిసి హొటల్‌లో డిన్నర్ తీసుకున్నాం. మా ఇద్దర్నీ చూసి హొటల్ స్టీవార్డ్ ఏమనుకుని ఉంటాడు? ఆ ఆలోచనే నాకు ఆనందాన్ని కలిగిస్తుంది.

నాలో ఇలాంటి ఆలోచనలు మెదులుతున్నాయంటే- ఎవరికయినా తెలిస్తే ఏమనుకుంటారు? నీతిలేని ఆలోచనలు అంటారు. బట్- నేనేమీ తప్పు చేయాలని అనుకోవడంలేదు. శ్రీనివాస్ కూడా అత్యున్నతమైన సంస్కారం కలవాడు. కాని ఎవరు కూడా ఆనందంగా సాగే ఈ తరహా ఆలోచనలను అడ్డుకోలేరని నాకు తెలుసు.

శ్రీనివాస్ కారులో నన్ను ఇంటిముందు దించాక ''చాలాకాలం తర్వాత ఈరోజు నాకెంతో ఆనందంగా ఉంది'' అన్నాడు. నా మనసులో మాటను అతడే చెప్పాడు. నేను మాత్రం ఏమీ చెప్పలేకపోయాను.

ఈ రాత్రి నాకు నిద్రరావటంలేదు. అది బాధో- ఆనందమో అర్థంకావడంలేదు. ఒక గొప్పవ్యక్తి ప్రేమను పొందగలిగినందుకు ఆనందం కలుగుతుంది. కాని నా కారణాన అతడు బ్రహ్మచారిలా మిగిలిపోయాడన్న నిజం మాత్రం బాధను కలిగిస్తుంది. ఏదేమయినా శ్రీనివాస్‌ని పెళ్లికి ఒప్పించాలి. అది నా బాధ్యతగా భావించాలి.

''శీనూ! నా మాట వినుకోవూ?''

''నువ్వు మంచివాడివి. నా మాట తప్పక వింటావు... ప్లీజ్...

..............

..............

శ్రీనివాస్ బాధగా కన్నులు మూసుకున్నాడు. 'లక్ష్మి... లక్ష్మి' మనసులో అనుకున్నాడు. 'నా గురించి ఎంతగా ఆలోచించావూ...?'

రైలు ఎప్పటిలా శబ్దం చేసుకుంటూ వెళుతూనే ఉంది. ఆ కంపార్ట్‌మెంట్‌లో కొందరు తిండిమీద పడితే, మరికొందరు పడక సర్దుకుంటున్నారు.

రాధమ్మ అతడిని అడిగింది. ''రెండు పూరీలు తిను బాబూ''

''వద్దమ్మా! నాకు ఆకలిగా లేదు. నువ్వు తినేసెయ్యి''

''ఆమె కొడుకువంక అదోలా చూసి తలతిప్పుకుని కిటికీలోనుండి బయట ప్రకృతిని చూ

స్తూ ఉండిపోయింది.

శ్రీనివాస్ తిరిగి డైరీ చదవడంలో మునిగి పోయాడు.

మే, 4.

నేనెక్కడో చదివాను. ''ప్రేమంటే సాయంత్రంనీడ లాంటిదట'' నిజమే! అది మనిషి వయసుతోపాటే పెరుగుతూ ఉంటుంది. అస్తమయంతో (చావుతో)నే దానికి అంతం!... శ్రీనివాస్‌మీద నా ప్రేమ కూడా అలాగే పెరుగుతూనే ఉంది. అయితే మనసులో ఎక్కడో గిల్టీఫీలింగ్! నేను అవినాష్‌కి ద్రోహం చేస్తున్నానా? నిజాయితీగా చెప్పాలంటే- మనసు శ్రీనివాస్‌దయితే, తనువు మాత్రమే అవినాష్‌దయింది. హిపోక్రసీ లేకపోతే- ప్రతి మనిషిలో ఎప్పుడోకప్పుడు, కనీసం కొద్దికాలంపాటయినా ఇలాంటి భిన్న ప్రవృత్తి కలుగుతూనే ఉంటుందనుకుంటా.

ఈరోజు నేనూ, శ్రీనివాస్ ఎక్కువ సమయం ఇంటిలోనే గడిపాం. ''హాస్పిటల్‌కి రమ్మని పిలిచాను'' కొద్దిసేపు కూర్చొని వచ్చేశాడు. నాకూ హాస్పిటల్‌లో ఏమీ తోచలేదు. శ్రీనివాస్‌తో కబుర్లు చెప్పాలనిపించింది. హాస్పిటల్‌నుండి ఇంటికి వచ్చేశాను. శ్రీనివాస్ నాకోసమే ఎదురుచూస్తున్నాడు.

ఇద్దరం కలిసి ఏ.సి.పి.లో 'దేవదాసు' సినిమా చూశాం. నాకెందుకో ఆ సినిమాలో 'పార్వతి' పాత్ర విపరీతంగా నచ్చింది. పాతకాలంలో సాంప్రదాయాలు, పెద్దలు కట్టుబాట్ల మధ్య స్త్రీ తన మనసు ఎంతగా మార్చుకోవలసివస్తుందో తెలియచేసే పాత్ర అది. అది సరే! పాతకాలంలో స్త్రీ పెద్దలకు భయపడి మనసు చంపుకుంది. కాని నేను- ఆ రోజుల్లో శ్రీనివాస్ మీది ప్రేమను ఎందుకు డైవర్ట్ చేసుకున్నాను. ఇష్టపూర్వకంగానే అవినాష్‌ని ఎందుకు పెళ్లాడాను? ఈనాటి అమ్మాయిలు అత్యాశలతో మనసులను డైవర్ట్ చేసుకుంటున్నారు. ఆస్తి, అంతస్తు కుదిరాక జీవితంలో తాము పోగొట్టుకున్నదేమిటో తెలిసివస్తుంది. అప్పుడు దాని కోసం పరితపిస్తారు. అందుకు ప్రత్యక్షసాక్షిని నేను.

ఈ లోకంలో మెటీరియలిస్టులతోపాటు సెంటిమెంటలిస్టులూ ఉన్నారు. శ్రీనివాస్ మెటీరిలిస్ట్‌లా కనిపించే సెంటిమెంటలిస్ట్! శ్రీనివాస్ సెంటిమెంట్‌ని నేను డైవర్ట్ చేశాను. అతడు మెటీరియలిస్ట్‌గా మారడం కూడా ఒకవిధంగా మంచిదే! ఒక మంచి బిజినెస్ మాగ్నెట్ కాగలిగాడు అతడు. చాలా గొప్పస్థితికి ఎదిగాడు. ప్రతి మగాడి విజయం వెనుకా ఒక స్త్రీ ఉంటుందట! 'శ్రీనివాస్ విజయం వెనుక ఉన్న స్త్రీని నేను' అన్న నిజం నాకెంతో సంతోషాన్ని కలిగిస్తుంది. ఆ సంతోషమే నన్ను అతడివైపు ఆకర్షింపబడేలా చేస్తోంది.

అతడు ఇలా విజయం సాధించి ఉండకపోతే, ఇప్పటిలా నేను అతడికోసం ఇంతగా పరితపించి ఉండేదాన్నా? ప్రేమ కూడా అవతలివ్యక్తి విజయాన్ని బట్టి ప్రభావితం అవుతూ ఉంటుందా? ఏమో! ఒక్కోసారి నాకీ మానవ సంబంధాలన్నీ అయోమయాన్ని కలిగిస్తాయి.

ఏదేమయినా నేను శ్రీనివాస్‌ని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నానన్నది మాత్రం వాస్తవం! ఈ వాస్తవం అవినాష్‌ని బాధపెడుతుందని కూడా తెలుసు. కాని డైరీలో అబద్ధాలు వ్రాయలేంకదూ!

చాలా పొద్దుపోయేంతవరకూ శ్రీనివాస్ నాతోనే ఉన్నాడు. ఆ తర్వాత విడవలేక విడిచి వెళ్లాడు. నన్ను విడిచి వెళ్లేప్పుడు అతడి కళ్లలో మెదలాడే వేదన నేను స్పష్టంగా చూశాను. అతడిలో 'తొలిప్రేమ' తాలూకూ స్పందన ఇంకా తొలగిపోలేదు. అదే నా అదృష్టం! దురదృష్టం కూడా...

మే ఐదవతారీఖు ఏమీ వ్రాసిలేదు. ఎందుకనో తెలియదు.

మే, 6.

ఈరోజే హాస్పిటల్‌కు వెళ్లడం ఆఖరిరోజు. రేపటినుండి హాస్పిటల్‌కు వెళ్లకూడదనుకున్నాను. ఉదయంనుండి నొప్పులుగా ఉన్నాయి. నాకెందుకో అనిపిస్తుంది. డెలీవరీ ముందుగానే కావచ్చుని. జయప్రద ఆంటీ కూడా ఆ మాటే అన్నది. వీలయినంత త్వరలో అంటే రెండురోజులలో హాస్పిటల్‌లో చేరిపోవాలి. నొప్పులు స్టార్ట్ అయ్యాక హాస్పిటల్‌కు బయలుదేరడం అంత మంచిదికాదు.

శ్రీనివాస్‌కి కూడా చెప్పాను. "హాస్పిటల్‌కు వెళ్లడం ఈరోజే చివరిరోజని" తనేమో అవినాష్‌కి ఫోన్ చేసి పిలిపిస్తానన్నాడు. నేను వద్దన్నాను. ప్రేమనేది మనసులో నిద్రాణమయిఉండాలి. అంతే తప్ప పిలిస్తే వచ్చి, బాధపడటం ప్రేమనిపించుకోదు.

ఈ విషయంలో శ్రీనివాస్ ఒక 'ఐడియల్ మాన్' ఏ స్త్రీ అతడి భార్య అవుతుందోగానీ ఆమె చాలా అదృష్టవంతురాలు. ఎంతో బిజీగా ఉండే అతడు తను ప్రేమించే వ్యక్తిని గురించి ఎప్పుడూ ఆలోచిస్తుంటాడన్నదానికి నిదర్శనం- ఈరోజు జరిగిన చిన్న సంభాషణ చాలు. నేను బిందె ఎత్తుకుంటుంటే, అతడు నన్ను వద్దని వారించాడు. ఎందుకని? అంటే 'గర్భిణీ స్త్రీలు బరువులు ఎత్తకూడదన్నాడు. 'మీకెలా తెలుసు?' అంటే 'ఒక మేగజైన్‌లో చదివాడట' 'ఎందుకు చదివారది?'అని ప్రశ్నిస్తే 'ఆ హెడ్డింగ్ చూడగానే నువ్వే గుర్తుకు వచ్చావు లక్ష్మీ' అన్నాడు. ఆ క్షణం నా మనసులోని భావాలు ఎలా వ్రాయాలో తెలియడంలేదు.

అవినాష్‌నుండి రెండురోజులయింది ఫోన్ వచ్చి! అతడిలో నాకు నచ్చనిగుణం అదే! అడుగు బయటపెడితే అన్నీ మరచిపోతాడు. ఏ స్త్రీ కూడా ఇలాంటి నిర్లక్ష్యభావాన్ని సహించలేదు. చాలాసార్లు ఈ విషయం అవినాష్‌కి చెప్పాలనుకున్నాను. కానీ చెప్పలేకపోయాను. మనసులోని ఏ ఘర్షణో నన్నీమాట బయటపెట్టనీయడంలేదు. పోనీ- నేను అవినాష్‌లోని నచ్చని గుణాలను అతడికి విప్పి చెపితే, అతడు మారుతాడా అంటే- మారడుగాక మారడు. ఈ విషయం నాకు బాగా తెలుసు. మా ఇద్దరి మధ్యా ఈవిధమైన కమ్యూనికేషన్ గ్యాప్ బాగా పెరిగిపోయింది. పుట్టబోయే పాపాయి మాత్రమే మా ఇద్దరిమధ్య పేరుకుపోయిన నిశ్శబ్దాన్ని బద్దలుచేయాలి.

రాత్రి పదకొండింటికి టేబుల్‌లైట్ ముందు కూర్చుని ఇలా డైరీ వ్రాస్తుంటే కడుపులోని పాపాయి అల్లరి స్పష్టంగా తెలుస్తోంది. తన బుల్లి పాదాలతో నన్ను కొడుతోంది. ఇంతకీ నా కడుపులోని ఆ పాపాయి ఆడా?- మగా?... ఆడపిల్లయితేనే బాగుణ్ను. శ్రీనివాస్ మాట నిజమవుతుంది. అతడిమాట నిజం చేయాలనే నా కోరిక!

మే, 7.

హాస్పిటల్‌కు వెళ్లకూడదన్న నిన్నటి నిర్ణయం, అతిక్రమించవలసివచ్చింది. ఉదయమే ఫోన్ రింగ్ అయితే అవినాష్ దగ్గర నుండేమోననుకున్నాను. కాని అది హాస్పిటల్ నుండి. శ్రీనివాస్ పేపర్ మిల్‌లో పనిచేసే వ్యక్తికి నెత్తుటిగాయాలు, శ్రీనివాస్ మిల్ మనిషి అంటే నేను వెళ్లక తప్పదు. అతికష్టం మీదనే వెళ్లాను. అతడికి ప్రాణాపాయం ఏమీలేదు. ఈ విషయాన్ని శ్రీనివాస్‌కి తెలియచేశాను.

ఈరోజే శ్రీనివాస్‌లోని బిజినెస్‌మెన్‌ని తొలిసారిగా చూశాను. సమస్యను ఎంత త్వరగా పరిష్కరిస్తాడో తెలిసింది. అతడి మాటలలో కరకుదనం, చూపులలో గాంభీర్యం. అతడు మాట్లాడే సమయంలో అవతలివ్యక్తికి ఏం మాట్లాడాలో కూడా అర్థం కాదనుకుంటా. అతడిముందు ఎవరూ మాట్లాడలేరు. అతడు ఈరోజు నాకో కొత్త విషయం చెప్పాడు. బిజినెస్‌లో 'బి' అన్న అక్షరానికి అర్థం 'బ్రీఫ్ టాకింగ్' అట. అంటే క్లుప్తంగా మాట్లాడటం!

రేపు శ్రీనివాస్ మిల్‌కి వెళుతున్నాడు. యూనియన్ లీడర్లతో సమావేశం. నాకెందుకో- అతడు రేపు మిల్‌కి వెళ్లడం ఇష్టంలేదు. అతడు అక్కడికి వెళ్లకుండా ఆపాలని వుంది. కాని ఎందుకు ఆపాలి?... కొన్నిరకాల ఫీలింగ్స్‌కి అసలు ఆధారమే ఉండదుకదూ? నాలోని ఈ ఆలోచన అతడికి చెపితే, నవ్వుతాడు. 'పిరికిదానివని' ఎగతాళి చేస్తాడు.బిజినెస్‌మాన్ ఎలాంటి భ్రమలకూ భయపడకూడదంటాడు. అదీ నిజమేకదా! ఏమిటో నా పిచ్చి నమ్మకాలు...

యూనియన్ మీటింగ్ గురించి చెప్పేసి శ్రీనివాస్ వెళ్లిపోయాడు. నేను మాత్రం అతడి గురించి ఆలోచిస్తూ ఉండిపోయాను. అప్పుడప్పుడూ అనుకుంటుంటాను- అతడి గురించి నేను ఎందుకిలా వ్యర్థంగా ఆలోచిస్తుంటానని! మనసు పిచ్చిది ఆలోచిస్తూ ఆనందించడమే దానిపని!!

అందుకే ఈ పిచ్చిదాన్ని చూసి భూమ్మీదకు

ఒరగా వంగిన ఓ నక్షత్రం నవ్వుతుంది. జాజి మల్లె పళ్లికిలిస్తుంది. వాటిమీద నాకు కోపం వచ్చింది. కాని వాటిని ఏమీచేయలేని నిస్సహాయురాలనుకదా! అందుకే ఈ డైరీ మూసేశాను.

మే, 8.

ఈరోజు సూర్యోదయం ఎంత అందంగా ఉంది! సూర్యాస్తమయం కూడా అద్భుతంగా అనిపించింది. అయితే ఆ మధ్యకాలంలో జరిగిన సంఘటనలే భయం కలిగించాయి.

ఉదయం శ్రీనివాస్ టిఫిన్‌కి వచ్చాడు. నేను చేసిన టిఫిన్ లొట్టలు వేస్తూ తిన్నాడు. మధ్యాహ్నం కూడా వచ్చాడు. అప్పుడు అతడి శరీరంనిండా రక్తం మరకలు. అవి చూసి నా గుండె ఆగిపోయినట్టనిపించింది. ఆంజనేయులునాయుడు అనే లీడర్‌మీద ఎవరో హత్యాప్రయత్నం చేస్తే ఇతడు కాపాడాడు. రాత్రి తాలూకూ నా భయానికి కారణం తెలిసింది. ఒకవేళ ఆ దుండగులు ఆవేశంమీద శ్రీనివాస్‌ని ఏదయినా... నేను తట్టుకోగలిగి ఉండేదాన్నా?''

ఈ రాత్రి ఎంత అద్భుతంగా ముగిసిపోయిందోకదా! చక్కని వెన్నెలనీడలో, పలుచగా పరచుకున్న మబ్బులమధ్య ఆకాశంలో చుక్కలు చూస్తూ- మేమిద్దరమే! కాలేజీ జీవితం గుర్తుకు వచ్చింది. అప్పుడు కూడా ఇంతే- హాస్టల్ డాబామీద పడుకుని 'చలాన్ని' చదువుకునేదాన్ని. పెళ్లయ్యాక ఆ అనుభూతులన్నీ మరచిపోయాను. ఇదిగో- ఈరోజు రాత్రి బాల్యంనుండి ప్రతి స్మృతి మనసులో మెదలాడుతూ ఉంది. కష్టపడి చదువుకోవడం, స్నేహితురాళ్లతో చెమ్మచెక్క ఆట. సంక్రాంతికి ఇంటిముందు గొబ్బెమ్మలు, శ్రీనివాస్‌తో కలసి రోడ్డమ్మట నడవడం, అతడు చెప్పిన విజ్ఞాన విషయాలు కళ్లింతలు చేసుకుని వినడం. హాస్టల్‌లో చిలిపి చేష్టలు. దొంగతనంగా గోడ దూకి సినిమాలకు వెళ్లడం, అవినాష్‌తో పెళ్లి... అన్నీ గుర్తుకువస్తున్నాయి.

ఈ ఆలోచనల మధ్య డామినేటింగ్ స్మృతులు మాత్రం శ్రీనివాస్‌వే! అతడు నన్ను చాలా ప్రభావితం చేశాడు. మనసు మూలలను కదిలించాడు. అంతేకాదు- నా వలన బాధపడినవాడు, బాధపడుతున్నవాడు ఇతడికి నేనేం చేయగలను? పెళ్లి చేసుకోమని నా 'చివరికోరిక'గా కోరగలిగితే ఎంత బాగుణ్ణు. అడగాలి... వీలు చూసుకుని అతడిని ఈ కోరిక తీర్చమని అడగాలి. నాకున్న ఒకేఒక కోరికగా 'తీరని కోరిక'ను తీర్చమని అర్థించాలి.

చాలా పొద్దుపోయాక శ్రీనివాస్ గెస్ట్‌హౌస్‌కి వెళ్లిపోయాడు. ఈ రాత్రి అతడితోడు ఉంటే బాగుణ్ణనిపించింది. అయితే అడగటం సభ్యత కాదని ఆగిపోయాను.

ఏమయినా ఈ రాత్రి నన్ను కదిలించింది. ఏదో సినిమాపాట గుర్తుకువస్తోంది నాకు. ఏం పాట అది?

'ఈ రేయి చల్లనిది... ఈ చిరుగాలి మనసైనది'

ఈ చల్లనిరేయి ఇలాగే ఉండిపోతే బాగుండును. కాని కాలచక్రాన్ని ఆపడం ఎవరికి సాధ్యం?

అన్నట్టు వ్రాయడం మరిచాను-

రేపు బంద్ అట.

బంద్ అంటే శ్రీనివాస్ ఆవేశపడటమే గుర్తుకువస్తుంది నాకు. ఆ పదం అంటే అతడికి ఎంత అసహ్యమోకదా!

ఆ తర్వాత పేజీలన్నీ ఖాళీయే! ఆమె జీవితపుస్తకం అంతటితో ఆగిపోయింది.

శ్రీనివాస్ డైరీ మూసేశాడు. బాధగా కన్నులు మూసుకున్నాడు.

రైలు శబ్దం చేస్తూ ముందుకు వెళుతూనే ఉంది. కంపార్ట్‌మెంట్‌లో చాలామంది అప్పటికే నిద్రకు ఒరిగారు.

అప్పటివరకూ ఎదురుచూస్తున్నట్టున్న రాధమ్మ అడిగింది. ''బాబూ! కాసింత ఏదయినా తిను''

''వద్దమ్మా! ఆకలిగా లేదని చెప్పానుకదా''

అతడిని మరీ విసిగించడం ఇష్టంలేక కాబోలు, తనూ భోంచేయకుండా అలాగే ముసుగుతన్ని పడుకుందామె.

చిమ్మచీకటిని చీల్చుకుంటూ రైలు ముందుకుపోతోంది.

అతడి చూపులు మాత్రం కిటికీలోనుండి ఆ చీకటిలో ఏదో వెతుకుతూ ఉన్నాయి. ఏమిటది?



ఉదయం ఎనిమిదిగంటలకు రైలు నాంపల్లి స్టేషన్‌లో ఆగింది.

గాయత్రి ప్లాట్‌ఫారంమీద నిలబడి వారికోసమే చూస్తోంది. వారిని చూడగనే ''ఆంటీ'' అంటూ చెయ్యి ఊపింది. రాధమ్మకు ఆమెను చూడడంతోనే ముఖంలోనికి వెలుగు వచ్చింది. అతడి కన్నులు మాత్రం నిస్తేజంగా ఉన్నాయి. వారి వెనుకే పోర్టర్ లగేజీ తీసుకురాసాగాడు.

''ఎలా ఉన్నారాంటీ?''

''బాగున్నానమ్మా... నువ్వెలా ఉన్నావు?''

''ఐ యామ్ ఫైన్'' అంది గాయత్రి. తర్వాత అతడివంక చూసింది. ''మీరు బాగా డల్‌గా కనిపిస్తున్నారు'' అతడితో అందామె.

అతడు బలవంతంగా నవ్వి ఊరుకున్నాడు.

వారంతా కారు దగ్గరకు వచ్చారు. పోర్టర్ సామాను కారులో సర్దాడు. శ్రీనివాస్ అతడికి పర్స్‌లోనుండి డబ్బు తీసిచ్చాడు.

గాయత్రి డ్రైవింగ్ సీట్లో కూర్చుంది. ఆమె పక్కనే రాధమ్మ. శ్రీనివాస్ వెనుకసీటులో కూర్చున్నాడు. కారు ముందుకు కదిలింది.

''ఆంటీ! అక్కడ జరిగింది విని నేను షాక్ తిన్నాను. ఆ రాత్రి నాకు అన్నం నయించలేదు... చాలా... చాలా బాధాకరమయిన విషయం''

''అవునమ్మా! అంత మంచి అమ్మాయి. ఇలా అర్ధాంతరంగా మరణించడం... ఏమిటో ఈ దేశంలో సహజమరణాలకన్నా యాక్సిడెంట్స్‌లోనో, మతఘర్షణల వల్లనో, బంద్‌లవల్లనో మరణించడమే ఎక్కువయిపోయింది. పాపం! ఆ అవినాష్‌ని చూస్తుంటే చాలా బాధ కలిగింది. ఆ పసిది తల్లిలేని బిడ్డ అయింది. ఆ కుటుంబంలో ఆనందం కరువయిపోయింది''

రాధమ్మ చెప్పుకుపోతూనే ఉంది. ఆ టాపిక్ చాలా ఇబ్బందిగా అనిపించింది అతడికి. వ్యూమిర్రర్‌లోనుండి అతడి ఇబ్బంది, గమనించింది గాయత్రి. గాయాన్ని కెలకడం ఎవరికి మాత్రం ఇష్టం ఉంటుంది. అందుకే టాపిక్ మార్చింది.

''ఆంటీ! మీరు మా ఇంటికి రండి. అమ్మ మిమ్మల్ని చూడాలంటోంది'' చెప్పింది గాయత్రి.

''అలాగేనమ్మా... సాయంత్రం మీ ఇంటికి వస్తాను''

''మీరూ వస్తారా?'' శ్రీనివాస్‌ని ప్రశ్నించింది గాయత్రి.

అతడు ఆలోచనలలోనుండి తేరుకుంటూ ''లేదు... ఆఫీసుకు వెళ్లి చాలారోజులయింది. అకౌంట్స్ ఒకసారి వెరిఫై చేసుకోవాలి'' అన్నాడు.

'ఓ.కే.' అంది గాయత్రి. ''ఆంటీని పంపించండి''

''అలాగే''

కారు విశాలమయిన ఆవరణతో మోడ్రన్‌గా కట్టబడిన ఓ బిల్డింగ్ ముందు ఆగింది. పనికుర్రాడు కారు దగ్గరకు పరిగెత్తుకుంటూ వచ్చాడు. సామాను అందుకున్నాడు.

వారిద్దరూ కారు దిగాక ''ఆంటీ! నేను వెళ్లొస్తాను'' అంది గాయత్రి.

''కాఫీ తాగి వెళ్దువురా'' అంది రాధమ్మ.

గాయత్రి క్షణం ఆలోచించి, డ్రైవింగ్ సీట్ లోనుండి దిగింది. ముగ్గురూ ఇంటిలోపలకి వెళ్లారు. రాధమ్మ తిన్నగా వంటింట్లోకెళ్లింది.

హాలు మధ్య వారిద్దరే మిగిలారు. ''కూర్చో

గాయత్రి'' సోఫాలో తను కూర్చుంటూ, ఎదురు సోఫా చూపించాడు శ్రీనివాస్. గాయత్రి కూర్చుంది.

''వెళ్ళేప్పుడు నాకు చెప్పకుండానే వెళ్లిపోయారు''

''చెప్పాలనిపించింది. కాని టైం చాలలేదు''

బాధపడే వ్యక్తికి ఓదార్పు మాటలు చెప్పడంకన్నా ఆ బాధనుండి అతడిని డైవర్ట్ చేయడం ముఖ్యం.

''ఈరోజు ఆఫీసునుండి వచ్చాక సినిమాకెళ్దామా?''

''నా మనసేమీ బాగులేదు''

''అందుకేగా సినిమాకి వెళ్దామని చెప్పేది''

''చూడలేను''

''చూడొచ్చు. ప్లీజ్ రండి! మీతో కలిసి సినిమా చూసి చాలా కాలమయింది''

''ప్లీజ్ గాయత్రి... ఈరోజుకు నన్ను వదిలేసేయ్. నాకు చాలా బడలికగా ఉంది''

''ఆల్‌రైట్! ఈరోజు కాకపోతే రేపు వెళ్దాం... అంతేకదా!''

''అలాగే'' మరో ధ్యాసలో అన్నాడు అతడు.

''థాంక్స్'' ఆమె పైకి లేచింది. ఆంటీ కోసం వంటింటివైపు వెళ్లింది.

అతడు తన చుట్టూ నిశ్శబ్దాన్ని గోడలుగా కట్టుకుని కూర్చున్నాడు చాలాసేపు. గాయత్రి కాఫీ పట్టుకుని వచ్చి ''ఇదుగోండి కాఫీ'' అనేవరకూ అతడిలోకంలో లేడు. ఉలికిపడి ఈ లోకంలోనికి వచ్చి ఆమె అందించిన కాఫీ చేతిలోకి తీసుకున్నాడు.

''చాలా పరధ్యానలో ఉన్నారే''

అతడు నవ్వాడు. బదులివ్వలేదు.

''మీకో విషయం చెప్పనా?''

అతడు కళ్లెత్తి ఆమె ముఖంలోకి చూశాడు.

''జీవితమంటే ఒకరి మరణంతో ఆగిపోయేది కాదు. ఆప్తుల మరణంవైరాగ్యాన్ని కలిగించేమాట నిజమే! బట్ వైరాగ్యమే జీవితమంటే ఈ ప్రపంచమే ఆగిపోతుంది. అప్పుడు ప్రపంచంలో ఈ అభివృద్ధి ఎక్కడ ఉంటుంది? ఆలోచించండి! ప్రతి మనిషీ తన జీవితకాలంలో కొన్ని మరణాలు చూసి ఉంటాడు. ప్రతి మరణం మనిషిని ఎంతో కొంత కదిలిస్తుంది. కాని ఆ కదలిక మన జీవితాన్ని ఆపేదిగా ఉండకూడదు. తెలివయినవాడివి. జీవితమంటే తెలిసినవాడివి. నీకు చెప్పగలిగినదానిని కాదు. అయితే ప్రస్తుతం మీ మెదడును కమ్మిన వైరాగ్యపు పొరలను వదిలించాలన్నదే నా ప్రయత్నం... ఆలోచించండి. ఒక రాత్రి నిద్రపోకుండా ప్రశాంతంగా ఆలోచించండి. మీరీ వైరాగ్యపు మత్తునుండి త్వరగా కోలుకోవాలని ఆశిస్తాను''

చెప్పేసి బయటకు నడిచిందామె. అరుక్షణాల తర్వాత కారు స్టార్ట్ అయిన చప్పుడు అతడు తిరిగి చూస్తే- కారుగేటు దగ్గర మలుపు తిరుగుతూ కనిపించింది.

ఆ రాత్రి అతడు నిద్రపోలేదు. ఆలోచించాడు... తల పగిలేలా ఆలోచించాడు. బట్, ఏమీ తోచలేదు.

కాని, గాయత్రి చెప్పిన దాంట్లో ఏదో నిజం ఉంది అని మాత్రం అనిపించింది. అంతే!

* * *

పనిలో పడితే మనసు కాస్త ప్రశాంతంగా ఉంటుంది. అందుకే నీరసంగా అనిపించినా అతడు ఆరోజు ఉదయమే ఆఫీసుకు వెళ్ళాడు.

తమ కంపెనీ లాయర్‌కి ఫోన్ చేసి పిలిపించాడు. అతడు వచ్చాక పేపర్ మిల్ మూసేయడం వలన, లీగల్‌గా ఎలాంటి సమస్యలు వస్తాయో చర్చించసాగాడు. ఆ చర్చమధ్య గాయత్రి అక్కడికి వచ్చింది.

గాయత్రి అప్పుడప్పుడూ అతడి ఆఫీసుకు వస్తుంటుంది. ఆమె ప్రవర్తన ఒక్కొక్కసారి ఒక్కోవిధంగా ఉంటుంది. ఒకసారి చిలిపిగా మాట్లాడి ఆహ్లాదకర వాతావరణాన్ని సృష్టిస్తే, మరోసారి సీరియస్‌గా ఉండి ఆసక్తిని కలిగిస్తుంది.

శ్రీనివాస్ ఆమె వచ్చాక ఛెయిర్ చూపించి కూర్చోమని తన డిస్కషన్‌లో తాను మునిగిపోయాడు. ఆమె మౌనంగా వారి డిస్కషన్

విన్నది. లాయర్ వెళ్ళిపోయాడు. ఆఫీస్ రూంలో వారిద్దరే మిగిలారు.

''పేపర్ మిల్ మూసేస్తున్నారా?'' ఆమె ప్రశ్న.

''అవును'' బదులిచ్చాడు అతడు.

''ఎందుకని... మిల్‌లో లాభాలు రావడం లేదా?''

''లాభాలు వస్తున్నాయి. బట్... ఆ మిల్ ఉండటం నాకిష్టంలేదు''

ఆమె కొద్దిక్షణాలు మౌనంగా ఉన్నాక అన్నది ''చూడండి! మీరు ఆ మిల్ ఎందుకు మూసేయాలనుకుంటున్నారో తెలియదుగానీ, మీరు ఆ మిల్ మూసేయడం వలన ఎన్ని కుటుంబాలు వీధిన పడతాయో ఒక్కసారి ఆలోచించండి.''

''నాకు అదంతా అనవసరం. నాకా మిల్ ఉండడం ఇష్టంలేదు అంతే''

''మీరిప్పుడు పక్కా కేపిటలిస్ట్‌లా మాట్లాడుతున్నారు... మీరు చాలా చిన్నస్థాయి నుండి పైకి వచ్చారు. ఈరోజు కార్మికుల బాధలేమిటో మర్చిపోతున్నారు''

అతడు కాసింత ఆవేశపడ్డాడు. ''నాకు... నాకు కార్మికుల బాధలు తెలుసు. అందుకే సస్పెండ్ చేసిన కార్మికుడిని వర్క్‌లోనికి తీసుకోమని చెప్పాను. వారి కోర్కెలు తీర్చాలనే మిల్‌కి వెళ్ళబోయాను... ఇంతలో హత్య! ఆ రోజు 'బంద్'కి నా మిల్‌లోని వర్కర్సే కారణం అని తెలిసాక, నాకు ఆ మిల్‌మీద ఇంట్రస్ట్‌పోయింది. ఇక నేను ఆ మిల్ రన్ చేయలేను...''

''రన్ చేయకూడదనుకుంటే, మరెవరికయినా అమ్మేసేయండి. అంతే కానీ, మిల్ మూసేసి వర్కర్స్‌ని రోడ్‌మీద పడేయడం మంచిదికాదు. అది మనిషిలో అంతర్గతంగా ఉండే శాడిస్టిక్ నేచర్‌ని బయటపెడుతుంది. ఆలోచించండి''

అతడు తలపట్టుకు కూర్చున్నాడు. మనసులో ఏదో ఘర్షణ! మిల్ మూసేయాలనుకోవడం గాయత్రి అన్నట్టు చాలా శాడిస్టిక్ ఆలోచన అని అతడికి తెలుసు. కాని మనసులోని కసి అలాగే చేయమని కోరుతోంది. నో! నేనీ కసి నుండి బయటపడాలి... మనసులోనే అనుకున్నాడు అతడు.

''ఎక్కడికెళుతున్నావు?'' టాపిక్ మారుస్తూ అన్నాడు శ్రీనివాస్.

''ఇలా మీ దగ్గరకే వచ్చాను. మీరు వస్తానంటే మా ఇంటికి వెళదాం''

''ఆల్‌రైట్! అలాగే వెళ్దాం''

సీటు మీద ఉన్న కోటును అందుకుని చేతిమీద వేసుకున్నాడు. ''పద'' అంటూ ఆమె వెనుకే కదిలాడు.

తను అడగగానే అతడు అంగీకరించడం ఆమెకు ఆశ్చర్యం కలిగించింది. ఎప్పుడూ 'నాకు తీరిక లేదనో- ఇప్పుడు కాదనో అనేవాడు. మరి ఇప్పుడు?! అతడిలోని సంఘర్షణ 'వీక్ పాయింట్'కి వచ్చిందని అర్థమయిందామెకు.

ఇద్దరూ ఆమె కారులోనే బయలుదేరారు.

ఆమె ఇల్లు హిమాయత్‌నగర్‌లో ఉంది. తన ఆఫీసు నుండి పదినిముషాల ప్రయాణం అంతే!

కారు ఇంటికి చేరేసరికి అనంతరాజుగారు ఎక్కడికో బయలుదేరబోతున్నారు. శ్రీనివాస్‌ని చూసి ''హలో మై బోయ్! వెల్‌కమ్'' అంటూ ఆహ్వానించారు.

ఇద్దరూ హాలులో కూర్చున్నారు. ''చాలారోజులయింది నువ్వు మా ఇంటికి వచ్చి'' అన్నాడాయన.

''పనుల వత్తిడివలన రాలేకపోయాను''

''నాకు తెలుసు... రోజుకి ఇరవై గంటలు కష్టపడకపోతే నువ్వీ స్థితికి రాలేవని నాకు తెలుసు... ఐయామ్ వెరీ మచ్ ప్రౌడ్ ఆఫ్ యూ మై బోయ్''

నిజంగానే ఆయనకు శ్రీనివాస్ అంటే చాలా ఇష్టం. కష్టపడి పైకొచ్చిన వ్యక్తులంటే ఎవరికిమాత్రం ఇష్టం వుండదు?!

''ఆంటీ ఎలా ఉన్నారు?''

''ఎప్పటిలానే'' విషాదంగా నవ్వారాయన.

ఆయన మిసెస్ పార్వతమ్మగారికి పెరాల

సిస్ స్ట్రోక్ వచ్చి సంవత్సరం అయింది. ఒక కాలు, ఒక చెయ్యి పడిపోయాయి. ఆమె ఎప్పుడూ వీల్ ఛెయిర్‌లోనే తిరుగుతూ ఉంటుంది. ఆమె పక్కనే ఒక ఆయా ఎప్పుడూ ఉండాలి.

"ఈ మధ్య పదిరోజులపాటు సిటీలో లేవట కదా!" అన్నారాయన

అవును అంకుల్! పేపర్ మిల్ చూసుకు నేందుకు వెళ్లాను. అక్కడో ఫ్రెండ్ చనిపోయాక, మరో నాలుగురోజులు ఉన్నాను"

"చనిపోయారా?! ఎందుకని?"

శ్రీనివాస్ లక్ష్మి చనిపోయిన విధానం చెప్పాడు.

"పాపం! ఆ అమ్మాయిని సరయిన సమయంలో హాస్పిటల్‌కు తీసుకువెళ్లి ఉంటే బతికి ఉండేది కదూ?" అంతా విన్నాక ప్రశ్నించారాయన.

"అవును అంకుల్"

వారిద్దరూ మాట్లాడుకుంటుంటే ప్రకాశరావు కారు దిగడం కనిపించింది.

ప్రకాశరావు అనంతరాజుగారికి చిన్ననాటి స్నేహితుడు. ఆయన ఓ ప్రముఖ వారపత్రికకు సంపాదకులు కూడా! అప్పుడప్పుడూ ఆ ఇంటికి వస్తుంటాడు.

ఆయన లోపలికి వచ్చి "ఏమిటి! మీ ఇద్దరూ సీరియస్‌గా మాట్లాడుకుంటున్నారు. కొంపదీసి- అమెరికా అధ్యక్షులు భారతదేశం మీద యుద్ధం ప్రకటించబోతున్నట్టు మీకు వార్త అందలేదు కదా!" అన్నాడు జోక్‌గా.

"అమెరికా భారతదేశంమీద యుద్ధం ప్రకటించలేదు. అనలు ఆ మాట అనవలసివస్తే భారతదేశానికి ఏ ఇతర దేశం వలనా ప్రమాదంలేదు. మనదేశానికి జరిగే ప్రమాదం, నష్టం మన దేశంలోని స్వార్ధపర శక్తుల వలననే! ఈ శక్తుల్ని అరికట్టేందుకు మీ పేపర్‌వాళ్ళు ఏమీ చేయలేకపోతున్నారు" అనంతరాజుగారు ఆయన వంక ఓరగా చూస్తూ పలికారు.

"ఏమిటీ నన్నే దెబ్బకొట్టావు..." అని ఆగి "ఇంతకీ అనలు కారణమేమిటో చెప్పండి! సమయానికి కనిపించాను కదా అని నన్ను పట్టుకుని దులిపేస్తే ఎలా? మా పేపర్‌వాళ్లే లేకపోతే ఈ దేశంలో ఇంకెన్ని ఘోరాలు జరిగేవో మీకు తెలియదు. మదమెక్కిన గజాలకు అంకుశంలా మా పేపర్స్ పనిచేస్తున్నాయి కాబట్టే ఈ దేశంలో ఇంకా ఆమాత్రమయినా నీతి నిజాయితీ బతికి ఉన్నాయి. పోలీసులకు కూడా భయపడని నాయకులు ప్రెస్‌కి భయపడతారు తెలుసా?"

"సొంతడబ్బా ఆపుకో సామీ" నవ్వారు అనంతరాజుగారు.

ప్రకాశరావుగారు కూడా నవ్వి "ఇంతకీ అసలు విషయమేమిటో చెప్పనేలేదు" అడిగారు ఆరాగా.

అప్పుడే గాయత్రి కాఫీ పట్టుకుని వచ్చింది. తలో కప్పు అందిస్తూ "మీరెప్పుడొచ్చారు అంకుల్" ప్రకాశరావు గారిని అడిగింది.

"ఇదిగో మీ నాన్నగారేదో తీవ్రసమస్య గురించి చర్చిస్తుండగా వచ్చాను" ఆమె వంక ఆప్యాయంగా చూస్తూ పలికాడాయన.

"ఏమిటట ఆ తీవ్ర సమస్య?" ఆమె ఆయన పక్కనే సోఫాలో కూర్చుంది.

"అదే ఇంకా తెలియలేదు" అని అనంతరాజుగారి వంక తిరిగి "చెప్పరా! మిమ్మల్ని అంతగా ఇబ్బందిపెట్టే ఆ తీవ్ర సమస్య గురించి చెప్పండి" అన్నాడు.

శ్రీనివాస్ అనంతరాజుగారివంక ఓసారి చూసి, ఆ తర్వాత ఆయన ముఖంలోకి చూస్తూ చెప్పాడు

"బంద్"

గాయత్రి ముఖంలో రంగులు మారాయి. అనంతరాజుగారు మౌనంగా ఉన్నారు.

ప్రకాశరావుగారు మాత్రం "బందా? అది మిమల్ని ఎలా ఇబ్బందిపెట్టింది?" అని ప్రశ్నించాడు.

ఈసారి అనంతరాజుగారు లక్ష్మి బంద్ కారణాన ఎలా బలయిపోయిందో వివరించాడు. చివరగా మొదటిలానే 'ఈ సమస్యపట్ల మీ పేపర్ వాళ్ళు ఏమీ చెయ్యలేకపోతున్నార'న్నాడు!

ప్రకాశరావుగారు అదోలా నవ్వాడు. "ఆవిడెవరో చనిపోతే, దానికి బంద్ కారణమయితే,

నువ్వేమో మా పేపర్‌వాళ్ళను నిందిస్తుంటే నాకు శ్రీశ్రీ గుర్తుకువస్తున్నాడు''

''ఎందుకు?'' కనుబొమలు ముడిచాడు అనంతరాజుగారు.

''ఆయన కూడా ఇలాగే బాలగంగాధర్ తిలక్ చనిపోతే, పేపర్‌వాళ్ళమీద విరుచుకుపడ్డాడు.

ఇప్పుడు కూడా నాకు ఆ సందర్భమే గుర్తుకు వస్తుంది. ప్రతి సమస్యనూ పేపరు వాళ్ళు పరిష్కరించగలగడం ఎలా సాధ్యం? పేపర్ వాళ్ళు సమస్యను ప్రకటించ గలరే గానే, దానిని పరిష్కరించడం వారి చేతులలో లేదు. అలా మేము ప్రతి సమస్యనూ పరిష్కరించగలిగితే ఈ దేశంలో సమస్యలనేవి లేకుండా చేసి ఉండేవాళ్ళం!''

''యూ ఆర్ రైట్ అంకుల్'' గాయత్రి ప్రకాశరావుగారిని సపోర్ట్ చేసింది. అనంతరాజుగారు, శ్రీనివాస్ మరోవైపు అయ్యారు.

శ్రీనివాస్ అన్నాడు ''అంకుల్! మీరీ సమస్యను పరిష్కరించగలిగీ, చేయడంలేదని మేము అనడంలేదు. కాకపోతే ఈ సమస్యకు ప్రాముఖ్యత కల్పించి ప్రజలదృష్టికి తీసుకువెళ్ళొచ్చు కదా! అని మాత్రమే అడుగుతున్నాం''

''ఈ సమస్యను మేము ప్రజల దృష్టికి తీసుకువెళ్ళలేదని మీరు ఎందుకు అనుకుంటున్నారు? ముఖ్యంగా -1989వ సంవత్సరం డిసెంబర్ నెలలో ఒక నగరంలో ఏడు రోజులపాటు బంద్ జరిగింది. ఒకరోజు ఒక పార్టీచేస్తే, మరోరోజు మరో పార్టీ! అలా నెలలో ఏడురోజులు ఆ నగరంలో బంద్ జరిగితే, జనం ఎంతగా ఆ సమస్యపట్ల విరక్తిచెంది ఉంటారో ఆలోచించు. ఆ సమయంలో ప్రతి పేపర్ 'బంద్' సమస్య గురించి కార్టూన్స్ ద్వారా, కథల ద్వారా, వ్యాసాల ద్వారా, వార్తా ప్రచురణలద్వారా ప్రజల దృష్టిని ఆ సమస్య వైపు మళ్ళించాయి. బట్, ప్రజలలో మార్పులేనప్పుడు ఎవరు మాత్రం ఏం చేయగలరు?'' నిరాశగా పలికారాయన.

''ప్రజలలో మార్పు అంటే ఎలా రావాలి?''

''ఇదిగో ఇప్పుడు సారా ఉద్యమంలా- జనం తిరగబడాలి 'ఇది' మాకొద్దు అని నిరసన వ్యక్తం చేయాలి. బంద్‌లు చేసే పార్టీలకు మేము ఓటువేయం అని నిక్కచ్చిగా చెప్పాలి. ఆరోజు మేమంతా ఆ ఉద్యమం వెనుక నిలబడతాం... మీకు తెలుసా! నేడు ఈ సారా ఉద్యమాన్ని నడిపిస్తున్నది ఒక దినపత్రిక! ఆ పత్రిక అండదండలే లేకపోతే సారా ఉద్యమం ఎప్పుడో చప్పబడిపోయి ఉండేదన్నది మాత్రం ఒక వాస్తవం! జనంలో మార్పు వచ్చి ప్రతిఘటన ప్రారంభమయితే మేమూ అండగా నిలబడతాం... ఇక ఆ మార్పు ఎలా వస్తుందంటే- ఎక్కడో చిన్న కదలిక చాలు జనం ప్రభావితం అవుతారు...''

అతడి కనుల ముందు ఓ దృశ్యం కదలాడింది. తను వారికి చెప్పాడు- 'మీరు ఎంతో మంది ఉన్నారు. ఆ కొద్దిమందిని ఎదుర్కోలేరా?' జనం తిరగబడ్డారు. పది మంది అల్లరి మూకను యాభైమంది బాధితులు తరిమికొట్టారు... అది ఎక్కడో జరగలేదు. తన కన్నుల ముందే- లక్ష్మి శవాన్ని ఇంటికి తీసుకువచ్చేప్పుడు జరిగింది. ఆ చిన్న కదలిక వల్ల జనం ప్రభావితమయితే?

అంతలోనే అతడిలో నిరాశ! 'బంద్' భగ్నం చేసారన్న కసితో వారు మరో రోజు బంద్ జరపడం! అంతే కాదు, క్రోధంతో తన కేరక్టర్‌ని కించపరచడం...

అయినా సరే! ఈ సమస్య పరిష్కారానికి తాను వీలయినంతవరకూ కృషి చేయాలి. తన లక్ష్మి ఆత్మకు శాంతి కలిగించాలంటే తను ఈ మాత్రం చేయాలి.

శ్రీనివాస్ కొద్దినిముషాలు మౌనంగా ఉన్నాక అన్నాడు ''అంకుల్! మీ వారపత్రికలో నాకోసం ఒక శీర్షిక ప్రవేశపెట్టగలరా?''

''ఏమిటా శీర్షిక?''

''ఆ శీర్షిక పేరు 'సమస్యలూ- పరిష్కారాలు' అనే చర్చావేదిక. ఆ చర్చావేదికలో మనం ఒక సమస్యను ప్రకటిస్తాం. ఆ సమస్యకు పరిష్కారాలు పాఠకులు చెపుతారు. ఎలా చేస్తే ఆ సమస్యను రూపుమాపవచ్చో లేఖలద్వారా తెలుపుతారు. అలా ప్రచురింపబడిన ప్రతి లేఖకూ వంద రూపాయల బహుమానం. ఈ

లఖలను ఖండిస్తూ, లోటుపాట్లు వివరిస్తూ మరొకరు రాయొచ్చు. అలా కొద్దికాలం సాగాక అత్యున్నత పరిష్కారంగా అనిపించిన లేఖకు పదివేల రూపాయల బహుమానం! ఈ బహు



మతులు జె.యస్. ఇండస్ట్రీస్ తరపున మేము అందిస్తాం. ఏమంటారు?''

''బహుమతులు మీరిస్తామంటే మేము కాదనము. కాని... దీని వలన ప్రయోజనం ఏముంటుందబ్బాయ్?''

''ప్రజలను కాస్త ఆలోచింపచేద్దామని! కదలిక అన్నది ఎక్కడో ఒకచోట మాత్రమే పుడుతుంది. ఆ కదలికకు ఏదో ఇన్స్పిరేషన్ కంపల్సరీ కావాలి. నా ఈ ప్రయత్నం ఏ ఒక్కరికైనా ఇన్స్పిరేషన్ అవుతుందేమోనన్న ఆశ! ప్రతి ప్రయత్నం విజయవంతం అవుతుందని అనుకోవడం లేదు. అలా అని ప్రయత్నించకుండా ఊరుకోవడం విజ్ఞుల లక్షణం కాదు... ఏమంటారు అంకుల్''

''నువ్వన్నది నిజమేనబ్బాయ్''

అప్పటివరకూ గాయత్రి, అనంతరాజుగారులు మౌనంగా ఉన్నారు. అప్పుడే గాయత్రి అన్నది ''అయితే ఈ చర్చావేదికకు మొదటి ఉత్తరం నాదే అవుతుంది. ఇంతకీ మొదటగా మీరు ప్రకటించబోయే ఆ సమస్య ఏమిటి?''

''బంద్'' చెప్పాడు శ్రీనివాస్.

గాయత్రి అతడి వంక అదోలా చూసింది. ఆ చూపులలో ఎన్నో భావాలు.



అనంతరాజుగారికి శ్రీనివాస్ మనసులోని ఘర్షణ తెలియదు. అందుకే ఆయన చాలా మామూలుగా ''నువ్వే కాదమ్మాయ్! నేనూ ఈ చర్చావేదికకు లేఖ రాస్తాను'' అన్నాడు.

''అయితే ఇంకేం ఈ శీర్షిక విజయవంతం అవుతుందని నేను ఇప్పుడే ప్రకటించగలను'' నవ్వుతూ అన్నాడు ప్రకాశరావు.

''మరి దానిని ఇంట్రడ్యూస్ చేసింది ఎవర నుకుంటున్నావు? -ది గ్రేట్ బిజినెస్ మాగ్నెట్ శ్రీనివాస్. అతడు ఇంట్రడ్యూస్ చేసినదేదీ ఇంతవరకూ ఫెయిల్ కాలేదు'' శ్రీనివాస్ భుజంమీద చెయ్యివేసారు అనంతరాజుగారు.

ఆ ప్రశంస అతడి మనసుకు అంతగా ఆనందాన్ని ఇవ్వలేదు. ''అంకుల్! ఆంటీని చూసి వస్తాను'' పైకిలేచాడు అతడు.

''లోపలికెళ్ళు'' చెప్పారాయన.

అతడు ముందుకు నడిచాడు. గాయత్రి కూడా అక్కడి నుండి లేచి అతడి వెనుకే అడుగులు వేసింది. పక్కపక్కనే నడుస్తున్న ఆ ఇద్దరినీ అనంతరాజుగారు అదోలా చూసారు. ఆయన కన్నులలో అదోలాటి సంతృప్తి!

బెడ్‌రూమ్‌లో, వీల్‌ఛెయిర్‌లో కూర్చొని ఏదో పురాణగ్రంథం చదువుకుంటోంది పార్వతమ్మ. ఆమె అంటే శ్రీనివాస్‌కి ఎంతో అభిమానం. హైదరాబాదు చేరిన కొత్తల్లో ఆమె కన్నతల్లిలా చూసింది.

'ఆంటీ'' పిలిచాడు వాకిట నిలబడి అతడు.

పుస్తకంలో నుండి తలెత్తి చూసిందామె. ఆ సమయానికి గాయత్రి కూడా అతడి పక్కనే నిలబడి ఉంది.

వారిద్దరినీ చూసి ఆమె పెదవులు విచ్చుకున్నాయి. ''రండి'' పిలిచింది.

అతడు వెళ్ళి బెడ్ మీద కూర్చున్నాడు. అతడికి కాసింత దూరంలో గాయత్రి కూడా కూర్చుంది.

''ఎలా ఉన్నారాంటీ?'' అడిగాడు.

''చూస్తున్నావుగా బాబూ నా ఆరోగ్యం!'' పేలవంగా నవ్విందామె.

''లేదు ఆంటీ మీరు త్వరలోనే కోలుకుంటారు'' తనవి కేవలం ఓదార్పు మాటలనే అతడికీ తెలుసు.

అది ఆమెకూ తెలుసు. అందుకే నిట్టూర్చింది.

''నువ్వెలా ఉన్నావు?''

''బాగున్నాను ఆంటీ... అమ్మ నిన్న వచ్చింది కదూ?''

''ఆఁ! వచ్చింది. కాసేపు కూర్చుని వెళ్ళిపోయింది. ఊరెళ్ళి వచ్చారట కదా!''

''అవును''

ఆమె దగ్గర కాసేపు కూర్చుని ఇవతలకు వచ్చేసాడు అతడు.

అతడు హాలులోకొచ్చేసరికి ప్రకాశరావు, అనంతరాజుగారులు ఎక్కడికో వెళ్ళిపోయారు.

''వెళ్తాను'' అన్నాడు శ్రీనివాస్.

''ఎక్కడికి?''

''ఆఫీసుకు'' బదులిచ్చాడు.

''ముందు భోంచేయండి- ఆ తర్వాత...'' ఆగిందామె.

''ఊఁ!... ఆ తర్వాత?''

''నిన్న నాకు మాటిచ్చారు సినిమాకెళ్దామని''

''నేనా?'' ఆశ్చర్యపోయాడు అతడు.

''అవును మీరే - ఈరోజు కాదూ అంటే 'రేపు వెళ్దామా?' అనగానే సరే అన్నారు''

''ఓహో అదా!... సరే వెళ్దాంలే''

''అబ్బా! ఎంత సుదినం'' ఆనందపడిపోయిందామె.

ఇద్దరూ భోంచేసాక కారు తీసిందామె ''ఏ సినిమాకి?''

''నీ ఇష్టం'' బదులిచ్చాడతడు.

''ఈరోజు మిమ్మల్ని ఓ మంచి ప్రేమ సినిమాకు తీసుకువెళ్తాను''

''అంతా తమరి దయ''

కారు ఓ థియేటర్ ముందు ఆగింది. ఆమె టిక్కెట్లు తీసుకోలేదు. మేనేజర్ రూమ్‌లోనికి వెళ్ళింది. ఆ థియేటర్ మేనేజర్ అనంతరాజుగారికి ఒకప్పటి పి.ఎ. ఆ అమ్మాయిని చూడ

గానే మర్యాదలు చేసి టిక్కెట్స్ తీసుకువచ్చి చేతిలో పెట్టాడు. డబ్బులివ్వబోయినా తీసుకోలేదు "మీరు ఎప్పుడో గానీ సినిమాకు రారు కదమ్మా" అన్నాడు.

ఆమె అయిష్టంగానే ఆ రూమ్ నుండి ఇవతలకు వచ్చింది. "రండి" అతడి చెయ్యి పట్టుకుని థియేటర్లోనికి నడిచింది.

సినిమా ఇంకా బిగిన్ కాలేదు. అతడు తన ఆలోచనలలో తాను ఉన్నాడు. ఆమె మాత్రం అతడి ముఖాన్నే చూస్తూ ఉంది. ఎందుకనో తెలియదు- ఆమె అతడిని చూస్తూ గడిపేయమంటే, ఆకలిని కూడా మరచిపోతుంది. అది నాలుగురోజుల కోరిక కాదు. నాలుగేళ్ళుగా మానుకోలేకపోతున్న అలవాటు.

అతడు తన ధ్యాసలోనుండి ఎందుకనో తలతిప్పాడు. గాయత్రి తన వంకే తదేకంగా చూడడం కనిపించింది.

"ఏమిటలా చూస్తున్నావు?"

"ఏమీ లేదు" తల తిప్పుకుందామె.

సినిమా మొదలయింది. 'అందమైన ప్రేమకావ్యం' అది. టీనేజిలోని ఒక ఆడపిల్ల, కుర్రాడు ప్రేమించుకోవడం! మంచి సంగీతం జతకూడడంతో బాగా హిట్ అయింది. పాటలు బాగున్నాయి.

'సినిమా ప్రేమలు' చాలా బాగుంటాయి. ప్రేమించుకోవడం, పాడుకోవడం, పెద్దలు ఒప్పుకోకపోవడం, ఎదిరించడం, పారిపోవడం, ఎలాగయితేనేం పెద్దలు చివరికి అంగీకరించేస్తారు' చాలా నూటిగా ఉంటుంది కథ!

ప్రేమలో ఎస్కేపిజాలు సినిమా కథకు పనికిరావు. బట్, నిజ జీవితంలోని ప్రేమలలో ఎస్కేపిజాలే ఎక్కువ! సినిమాలలో చూపించేంత గాఢమైన, నిస్వార్థమైన ప్రేమలు చాలా... చాలా అరుదుగా మాత్రమే కనిపిస్తాయి.

ఇంటర్వెల్లో కూల్డ్రింక్స్ తాగారు. డ్రింక్ సిప్ చేస్తుంటే ఆమె ఫ్రెండ్ కనిపించింది. వారిద్దరూ మాట్లాడుకుంటుంటే అతడు మేనేజర్ రూమ్లోని ఫోన్ దగ్గరకు నడిచాడు. మేనేజర్ పర్మిషన్ తీసుకుని ఆఫీసుకు ఫోన్ చేసాడు. 'ఆరోజుకు తను ఆఫీసుకు రావడం లేదని' తెలియజేసాడు.

అతడు వచ్చాక గాయత్రి ప్రశ్నించింది "ఎక్కడికెళ్ళారు?"

"ఆఫీసుకు ఫోన్ చేసి వస్తున్నాను"

"ఏమని?"

"ఈరోజు ఆఫీసుకు రావడం లేదని, క్లోజ్ చేసుకు వెళ్ళిపొమ్మని"

ఇద్దరూ వెళ్ళి హాలులో కూర్చున్నారు.

"ఇందాక నాతో మాట్లాడిన అమ్మాయెవరో తెలుసా?"

"తెలియదు" అతడి జవాబు.

"ఓ ప్రముఖ రచయిత్రి"

"అలాగా" అనేసాడు.

"పోనీ ఈ సినిమాలో హీరోహీరోయిన్ల పేర్లు తెలుసా?"

"టైటిల్స్లో చూడలేదు"

"టైటిల్స్లో చూసి చెప్పేంత అనామక యాక్టర్స్ కారు వారు. చాలా ఫేమస్ యాక్టర్లు"

"అయి ఉండవచ్చు. కాని నాకు తెలియదు"

"మరి మీకేం తెలుసు?"

"బిజినెస్"

అతడివంక చూసిందామె- ఏదోలా కాదు. అభినందనగా! లీనమయి పని చేయడం అంటే ఏమిటో ఆమెకు అతడిని చూసాకే తెలిసింది. ఏదోలా చేయడం కాదు. ఒక లక్ష్యాన్ని పెట్టుకుని, ప్రపంచాన్ని మరిచి పని చేయడం కొందరికే సాధ్యం... ఇటువంటివాడు ఏదయినా ఒక సమస్యను పరిష్కరించాలని ఆలోచించడం మొదలెడితే...? ఆమెకు మధ్యాహ్నం ప్రకాశరావుగారితో అతడి సంభాషణ గుర్తుకు వచ్చింది. అందుకే అతడితో చెప్పింది

"మధ్యాహ్నం మీరు అంకుల్కి చెప్పిన శీర్షిక ఐడియా చాలా బాగుంది"

"థాంక్స్" క్లుప్తంగా అన్నాడతను.

"అంతపెద్ద పొగడ్తకి ఇంత చిన్న కృతజ్ఞతా?! ఇంతకన్నా పెద్ద ప్రజంటేషన్ ఏదయినా

ఇస్తారనుకున్నాను''

''ఏం కావాలి?''

ఆమె ఏదో అడగబోయి ''ఊహుఁ! ఇప్పుడు కాదులే. ఇప్పుడడిగితే కసురుకుంటారు. అసలే మీ మూడ్ బాగాలేదు'' ఆగిపోయింది.

గాయత్రి అడగబోయిందేమిటో అర్థమయింది అతడికి. అతికష్టంమీద నవ్వు పెదాల మీదకు రాకుండా చేయగలిగాడు.

సినిమా తిరిగి స్టార్ట్అయింది. గాయత్రి మాత్రం సినిమాలో లీనమయిపోయింది. అతడు తన ఆలోచనలలో తాను మునిగిపోయాడు.

నిరంతరం అనేక వత్తిడుల మధ్య ఉండే వ్యక్తి, వినోదాలమీద అంతగా కాన్సన్ట్రేషన్ నిలవలేడు.

సినిమా వదిలారు పార్కింగ్ ప్లేస్ లోనుండి కారు తీసుకు వచ్చిందామె ''ఎక్కడికి వెళ్దాం''

''నేను ఇంటికి వెళ్తాను''

''అలాగే! ముందు ఐస్క్రీం తినేసి, తర్వాత ఇంటిముందు డ్రాప్ చేసేస్తాను''

తలూపాడు అతడు. కారు ఐస్క్రీం పార్లర్ ముందు ఆపిందామె. లోపలికి వెళ్ళి రెండు ఐస్క్రీమ్‌లు తీసుకువచ్చింది.

అది అందుకుని నోట్లో పెట్టుకోబోతుంటే, కొద్దిరోజులక్రితం లక్ష్మితో కలసి తను ఐస్క్రీం తినడం గుర్తుకు వచ్చింది. 'ఐస్క్రీం తినడం ఇంకా మానలేదా?' అని ఆమె అడగడం, 'చిన్ననాటి అలవాట్లు, అభిరుచులు పెద్దయ్యాక వదులుకోవడం చాలా కష్టం' అని తను బదులివ్వడం జ్ఞప్తికి వచ్చింది. మనసంతా ఏదోలా అయింది. ఐస్క్రీం తినాలనిపించలేదు.

అతడు ఐస్క్రీం తినబోయి ఆగిపోవడం గమనించింది. ''ఏమిటి? ఏమయింది?'' ప్రశ్నించింది.

''ఏదో గుర్తుకు వచ్చి...'' ఆపేసాడతడు, ఆమె హర్ట్ అవుతుందని.

అతడికి ఏం గుర్తుకు వచ్చి ఉంటుందో ఊహించిందామె ''ప్లీజ్ శ్రీనివాస్!... ప్లీజ్ హేవ్ ఇట్''

అతడు తలాడించాడు. మౌనంగా ఆ ఐస్క్రీం తిన్నాడు.

బిల్లు చెల్లించాక, ఇద్దరూ బయటకు వచ్చారు. కారు స్టార్ట్ చేసిందామె.

అతడిని ఇంటిముందు డ్రాప్ చేసాక ''మళ్ళీ ఎప్పుడు కలుద్దాం?'' చిలిపిగా కళ్ళెగరేస్తూ అడిగింది.

''యూ సిల్లీ'' అనేసి లోపలికి వెళ్లిపోయాడు.

నవ్వుకుంటూ కారు స్టార్ట్‌చేసిందామె.

ఆరోజు ఉదయం అతడు పేపర్ మిల్‌కు ఫోన్ చేసాడు. చతుర్వేది ఫోన్ అందుకున్నాడు.

''పేపర్‌మిల్ పరిస్థితి ఎలా ఉంది?''

''చాలా గగ్గోలుగా ఉంది. ఒకటవతేదీ నుండి మీరు మిల్ మూసెయ్యమన్నారని తెలిసి వర్కర్స్ హడలిపోతున్నారు. వారికి దిక్కుతోచడంలేదు. వారి పొగరుకి ఇది సరయిన శిక్షేనని అనుకుంటున్నాము సార్''

''అన్నట్టు నేను మిల్ మూసే ఆలోచనను డ్రాప్ చేసుకుంటున్నాను. ఈ విషయం వర్కర్స్‌కి చెప్పండి''

ఫోన్ పెట్టేసాడు అతడు. అతడి పెదాల మీద సంతృప్తికరమయిన చిరునవ్వు కదలాడింది. అతడు వెంటనే గాయత్రికి ఫోన్ చేసాడు.

''గాయత్రీ! నేను పేపర్‌మిల్ మూసేసే ఆలోచనను డ్రాప్ చేసుకున్నాను. ఈవిషయం ఇప్పుడే పి.ఓ.కు ఫోన్ చేసి చెప్పాను''

''థాంక్స్!... ఇంత మంచి నిర్ణయం తీసుకున్నందుకు మీకు ఓ మంచి బహుమతి ఇవ్వాలని ఉంది''

''సరే! ఎవరి చేతయినా ఇచ్చి పంపు అందుకుంటాను''

''నోనో! అలా పంపేది కాదా బహుమతి. స్వయంగా నేను వచ్చి ఇవ్వవలసిందే''

అతడికి అర్థమయింది. మౌనంగా ఉండిపోయాడు.

''ఏమిటి మౌనంగా అయిపోయారు... ఆ బహుమతి అక్కర్లేదా?''

క్షణం ఆలోచించి చెప్పాడు. ''అందుకునే

రోజు వస్తే తప్పక అందుకుంటాను''

అవతలివైపు కంఠంలో ఒక్కసారిగా హుషారు. ''బాప్రే! ఈ మాట అన్నది మీరేనా? నాకింకా నమ్మబుద్ధి కావట్లేదు. ఒక్కసారి గిల్లుకోనివ్వండి. అబ్బా! ఇది కలకాదు నిజమే! అంటే! అబ్బాయి ఇంతకాలానికి ఇప్పుడిప్పుడే దారిలో పడుతున్నారన్నమాట... హే భగవాన్! నా ప్రార్థన ఇంతకాలానికి ఆలకించావా? నా పూజలు ఇప్పటికి ఫలించాయా?... సంవత్సరం క్రితం నేను రెండు రూపాయలు పెట్టి కొట్టిన కొబ్బరికాయ వృధాపోలేదు. మూడుసార్లు బిర్లా మందిర్‌కి వెళ్ళడం వలన ప్రయోజనం ఇప్పుడు కనిపించింది...'' ఆమె ఇంకా ఏదేదో మాట్లాడుతోంది. అతడు నవ్వుకుంటూ ఫోన్ పెట్టేసాడు.

రాధమ్మ అతడి దగ్గరకు హార్లిక్స్ పట్టుకువచ్చింది. అతడు నవ్వుతుండడం చూసి ''ఏమిటి బాబూ నవ్వుతున్నావు?'' అని అడిగింది.

''ఏం లేదమ్మా! గాయత్రికి ఫోన్ చేస్తే తనేదో జోక్ చెప్పింది. అది విని నవ్వుకుంటున్నాను''

''చిలిపిపిల్ల'' గ్లాసు కొడుకుకు అందించిందామె.

హార్లిక్స్ తాగాక ''ఆఫీసుకు వెళ్ళొస్తానమ్మా'' అని చెప్పి బయటకు నడిచాడు. కారు తీసుకుని రోడ్డు ఎక్కాడు.

అతడు ఆఫీసు డోర్ తీసుకుని లోపలికి అడుగుపెట్టగానే, అటు చూసి అదిరిపడ్డాడు. ఆశ్చర్యంతో కన్నులు పెద్దవి అయ్యాయి.

తన చెయిర్‌లో కూర్చుని ఏకాగ్రతగా ఫైల్స్ తిరగేస్తోంది గాయత్రి! తలుపు చప్పుడయినా తలెత్తి చూడలేదు.

అతడు ఆమె చెయిర్ దగ్గరగా వెళ్ళి బ్రీఫ్‌కేస్ టేబుల్ మీద పడేసాడు. ''ఏయ్! ఏమిటిది?'' సీరియస్‌గా ప్రశ్నించాడు.

ఆమె మెల్లగా తలెత్తి చూసింది ''ఏమిటేమిటి?! మావారి సీట్లో నేను కూర్చున్నాను. ఆయన కష్టంలో భాగం పంచుకుందామని ఫైల్స్ చూస్తున్నాను''

''మీవారా?! ఆయనెవరు?''

''ఈ సీటులో కూర్చునేవ్యక్తి''

''నేనా?''

''అయిఉండవచ్చు'' సీరియస్‌గానే బదులిచ్చిందామె.

''జోకులు ఆపి, పైకి లే... ఏమిటో ఈ రోజు మహా హుషారుగా ఉన్నావు?''

''మావారు లైన్‌లోకొచ్చారు''

''ఓహో అదా సంగతి!'' అర్థమయినట్టుగా నవ్వాడు. ''ఇక తమరు దయచేయండి. నాకు చాలా పనులున్నాయి''

''నాకు ఉండేది మాత్రం ఒకటే పని''

''ఏమిటది?''

''మిమ్మల్ని పెళ్ళిచేసుకోవడం''

అతడు తలపట్టుకూర్చున్నాడు. ''మంచి పనే! ఆ పని చేసేందుకు ముందుముందు చాలా సమయం ఉంది. ప్రస్తుతం మాత్రం నన్ను డిస్ట్రబ్ చేయకు''

''డిస్ట్రబ్ చేయకుండా ఇక్కడే కూర్చుంటాను- మిమ్మల్ని చూస్తూ''

కాదన్నా ఊరుకోదని, వెళ్ళదనీ అతడికి తెలుసు. అందుకే ''నీ ఖర్మ'' అనేసి తన పనిలో తను లీనమయిపోయాడు. గత కొద్దిరోజులుగా చూడకుండా ఆపేసిన అకౌంట్స్ వెరిఫై చేసుకోసాగాడు. ఆఫీసు పని మధ్య అతడికి మరేదీ గుర్తుకురాదు. టైమ్ కూడా తెలియదు.

తొమ్మిది గంటలకు సీటులో కూర్చున్నవాడు పన్నెండు గంటలకు పని ముగించి పుస్తకాలు పక్కనపెడుతూ ఆ వంక చూస్తే గాయత్రి కన్నులు విప్పార్చి తన వంకే చూడడం కనిపించింది.

ఆమె మోచేతులు రెండూ టేబుల్‌మీద పెట్టింది. రెండు అరచేతులమధ్య ముఖాన్ని ఉంచింది. చూపులు మాత్రం తదేకంగా తన వంకే చూస్తున్నాయి.

గాయత్రి కూర్చున్న ఆ భంగిమ అతడికి ఎంతో నచ్చింది. తనవంకే దీక్షగా చూడడం గుర్తొచ్చి మనసు ద్రవించింది.
లాంటి ఆమె మనస్తత్వానికి ముచ్చ

''ఏమిటీ! నువ్వింకా ఇంటికి పోలేదా?'' విస్మయంగా ప్రశ్నించాడు.

''డిస్టర్బ్ చేయకుండా మిమ్మల్ని చూస్తుంటానంటే ఒప్పుకున్నారుగా''

అతడు పైకి లేచాడు. ఆమె దగ్గరగా నడిచాడు. తల మీద చెయ్యివేసి లాలనగా నిమిరాడు. ''పిచ్చిపిల్లా''

''మరి ఇప్పుడు నేను ఇవ్వాలనుకున్న బహుమతి ఇచ్చెయ్యొచ్చా?'' అమాయకంగా అడిగిందామె.

అతడు తల అడ్డంగా ఆడించాడు. ''కొన్ని రకాల బహుమతులు ఎప్పుడంటే అప్పుడు ఇచ్చేయకూడదు. అలా ఇచ్చేస్తే వాటికి 'విలువ' పోతుంది. ఒక మంచి సందర్భంలో ఇస్తే ఆ అనుభూతి జీవితాంతం గుర్తుండిపోతుంది''

''మరి ఆ సందర్భం ఎప్పుడు?''

''మొదటిరాత్రి''

''ఆఁ!'' నోరు తెరిచిందామె. అతడు కూడా రొమాన్సు గురించి మాట్లాడగలడని తెలిసిన మొదటిక్షణం అదే! అందుకే అంత ఆశ్చర్యం!!

''బాప్‌రే! మీలో ఇంత మార్పు?! నాకే ఆశ్చర్యంగా ఉంది... ఈ మార్పు ఎలా వచ్చిందబ్బా''

'లక్ష్మి డైరీలు చూడటం వలన' అని మాత్రం చెప్పలేదు అతడు. ఆమె చివరికోరిక 'తన పెళ్ళి' అని అతడికి గుర్తుంది. అందుకే మనసును ఆ వైపు డైవర్ట్ చేస్తున్నాడిప్పుడిప్పుడే!

మధ్యాహ్నం ఇంటిదగ్గర నుండి కేరియర్ వచ్చింది. ఇద్దరూ కలసి భోంచేసారు. మరి కాసేపు కూర్చున్నాక గాయత్రి వెళ్ళిపోయింది.

★ ★ ★

ఆరోజు పేపర్ చూస్తుంటే ఒక వార్త అతడిని ఆకర్షించింది.

మరి కొద్దిరోజులలో జరగబోయే ఎన్నికలకు ప్రతి పార్టీ తన అభ్యర్థులను ప్రకటించింది. అందులో ఆంజనేయులునాయుడు పేరు ఉండడం చూసాడు శ్రీనివాస్.

అతడి మదిలో నన్నని బాధ మొదలయింది. ఆంజనేయులు నాయుడు ఒక గూండా, రౌడీ! ఇలాంటివాడు ప్రజానాయకుడయితే...?! సరయిన నాయకత్వం లేకపోతే ఏ దేశమూ అభివృద్ధి లోనికి రాదు. మనదేశం ఈ స్థితిలో ఉందంటే అందుకు అసమర్థనాయకత్వమే కారణం! స్వార్థపరులు నాయకులయితే, జనం వ్యసనంలోనుండి బయటపడతామన్నా పడనివ్వకుండా ఆ మురికికూపంలోనే తోస్తుంటారు. 'మాకు సారా వద్దు' అని మొత్తుకుంటే, పోలీసుల చేతయినా బలవంతంగా అమ్మిస్తారు. సింగిల్ నెంబర్ లాటరీల పేరుతో అమాయకులను వంచిస్తారు. అసలు ఈ స్వార్థపూరితమయిన నాయకత్వమే మారాలి!

'మారాలి... మారాలి!' అని నేను అనుకుంటే లాభంలేదు. అందుకు నేనేం చేయగలను అన్నది ఆలోచించాలి. నా స్థాయికి నేను ఒక గూండా, హంతకుడికి పదవి దక్కకుండా చేసి, ఆ స్థానంలో ఒక నీతిపరుడిని ప్రజానాయకుడిని చేయగలిగితే ఎలా ఉంటుంది?!

ఆ రాత్రంతా ఆలోచించాడు అతడు. అతడికి లక్ష్మి గుర్తుకువచ్చింది. లక్ష్మి మరణానికి కారణం మనసులో మెదిలింది. ఎదో కసి... ఈ సమాజంకోసం ఏదో చేయాలన్న తపన కదలాడాయి.

మర్నాడు ఉదయమే అతడు ఒక పార్టీ నాయకుడిని కలిసాడు. చాలాసేపు తర్జన భర్జనలు జరిగాయి 'కొన్ని' చేతులు మారాయి. తప్పదు! ఈ సమాజాన్ని కొద్దిగానయినా మార్చాలంటే దూరంనుండి కన్నా మనం వారిలో కలసిపోయి మార్పుతీసుకురావడం మంచిది. అందుకే ఆ మాత్రం తలవంచక తప్పదు.

చివరికి ఎలాగయితేనేం సాధించాడు అతడు. ఆంజనేయులు నాయుడికి పోటీగా అధికార పార్టీ తరపున 'అవినాష్' పోటీ చేయబోతున్నాడు.

ఈ వార్త ఫోన్‌లో అవినాష్‌కి చెపితే అతడు అదిరిపోయాడు. ''నేను... నేను రాజకీయాలలోకా?'' అన్నాడు గాభరాగా!

"తప్పదు అవినాష్! ఈ దేశంలో స్వార్థపరులవలన సృష్టించబడుతున్న సమస్యలు కొద్దిగానయినా అరికట్టబడాలంటే నీలాంటివారు ప్రజాజీవితంలోకి రాక తప్పదు... ఒప్పుకో"

అవినాష్ పెద్దగా వత్తిడి చేయకుండానే అంగీకరించాడు. అతడి పెదాలమీద చిరునవ్వు కదలాడింది.

ఈ వార్త సాయంత్రానికి గాయత్రికి చేరింది. ఆమె వెంటనే కారేనుకుని వచ్చేసింది. "ఏమిటీ! మీరు పాలిటిక్స్‌లోకి ఎంటర్ అవుతున్నారా?"

"నేను ప్రవేశించడంలేదు. నా తరఫున అభ్యర్థిని ప్రవేశింపచేస్తున్నాను"

"రెండింటికీ పెద్ద తేడా లేదు" అని ఆగి "ఇంతకీ మీకు పాలిటిక్స్ మీద ఇంత ఇంట్రస్ట్ ఎందుకు కలిగింది?" ప్రశ్నించింది.

"స్వార్థపరులను ప్రజాజీవితానికి కాసింతయినా దూరంలో ఉంచితే, కొన్ని చావులయినా తగ్గుతాయని ఆశ"

"అదెలా?" అర్థంకాక అడిగిందామె.

"ఆంజనేయులునాయుడు ఒకవేళ ఎమ్.ఎల్.ఏ. అయితే, అతడు 'బంద్' నిర్వహించదలచుకుంటే జనాలను భయపెట్టి, పలుకుబడి ఉపయోగించి చేస్తాడు. అప్పుడు లక్ష్మిలాంటివారు మరికొంతమంది ఆహుతులవుతారు. అదే అవినాష్ అయితే ఒకవేళ తమ పార్టీయే బంద్ తలపెట్టినా, ప్రజలను భయపెట్టి మాత్రం ఇబ్బందిపెట్టడు. ఆరోజు ఏది జరిగినా స్వచ్ఛందంగా జరుగుతుందని నా ఆశ"

"పాలిటిక్స్‌లో ఎంటర్ అయినవాడు కొద్దిరోజులు మాత్రమే పతివ్రతలా ఉంటాడు. కొద్దికాలం తర్వాతయినా అవినాష్ అందరిలా మారిపోడని నమ్మకం ఏమిటి?"

"అతడు ఒక సమస్యవలన దగాపడిన వ్యక్తి. అంత సులభంగా మారిపోడని నాకు తెలుసు"

"అలా అయితే ప్రొసీడ్" ఉత్సాహంగా అందామె.

శ్రీనివాస్‌లో వస్తున్న మార్పు ఆమెకు కూడా సంతోషం కలిగిస్తోంది. బిజినెస్ తప్ప మరో లోకమే లేనట్టుండే అతడు సమాజంపట్ల తన బాధ్యతను గుర్తించటమేకాదు, ఒక అమ్మాయి ప్రేమను కూడా తెలుసుకుంటున్నాడు"

"ఎక్కడికి వెళుతున్నారు?"

"ఆఫీసుకు" చెప్పాడు అతడు.

"పదండి! నేనూ వస్తున్నాను"

ఇద్దరూ బయటకు నడిచారు డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు అతడు. కారు రోడ్డెక్కింది. హైదరాబాద్ నగరవీధులలో జనం పలచగా ఉన్నారు. మధ్యాహ్నం ఎండ ఎక్కువగానే ఉంది.

"చెప్పడం మరిచాను- రాత్రంతా కూర్చుని 'బంద్ సమస్య' గురించి ఒక లేఖ వ్రాసాను. ఈరోజు అంకుల్‌కి ఇద్దామనుకుంటున్నాను"

అతడు కాసింత క్యూరియస్‌గా ఆమెవంక చూశాడు. "ఏమని వ్రాశావు?"

"ఈ బంద్ అనేది కొంతమంది స్వార్థపరులు సృష్టించే సమస్య! దీనిని ప్రజలే ఎదుర్కోవాలి. బంద్‌చేసే పార్టీలకు ఓటు వేయమని నిక్కచ్చిగా చెప్పాలి. వీలయితే 'బంద్' చేసే మూకను తరిమికొట్టాలి. ఈ సాకుతో వారు మరోరోజు కూడా 'బంద్' చేయొచ్చు. ఆరోజు కూడా వారిని తరిమికొడితే, భవిష్యత్‌లో వారు 'బంద్' చేయాలంటే 'రిస్క్'తో కూడుకున్న పని అనుకుంటారు. ప్రస్తుతం మాత్రం వారికి బంద్ చేయడం ఒక ఆటలాంటిది. సో! మొత్తం మీద ప్రజలలో మార్పు రావాలి. ప్రజలతోపాటు నాయకులు కూడా ఆలోచించాలి. 'బంద్'వలన దేశంలో ఎంత ప్రొడక్ట్ తగ్గిపోతుంది. జనం ఎంతగా ఇబ్బందులకు గురవుతున్నారో- తెలుసుకోవాలి. ట్రాన్స్‌పోర్టేషన్ ఆగిపోతే ధరలు పెరుగుతాయి. ధరలు పెరిగితే సామాన్యమానవుడు నలిగిపోతాడు. అంతేకాదు, ఇలాంటి సమస్యలున్న దేశంలో ఇతర దేశాలవారు పెట్టుబడి పెట్టేందుకు ముందుకురారు. అలా ఆర్థికప్రగతి కుంటుపడుతుంది. టూరిస్ట్‌లు కూడా తగ్గిపోతారు. దానివలన విదేశీమారకద్రవ్యం తగ్గిపోతుంది.... ఇవన్నీ ప్రతి బాధ్యత కలిగిన పౌరుడు, నాయకుడు ఆలోచించాలి..." గడగడా

పాఠంలా చెప్పింది గాయత్రి. తర్వాత అతడి వంక చూసి "ఎలా ఉంది?" అని ప్రశ్నించింది.

"కొత్తగా విషయాలేం చెప్పలేదు... చాలావరకూ తెలిసిన పరిష్కారాలే"

"కొత్తగా విషయాలు చెప్పేందుకు ఇది సైన్స్‌కాదు. సాధారణంగా సమస్యకు పరిష్కారాలు ఒకటీ, రెండు మాత్రమే ఉంటాయి. పది పరిష్కారాలుండవు. స్థూలంగా ఈ బంద్ సమస్యకు పరిష్కారం ప్రజలలో మార్పురావడం. వారు తిరగబడటం లేదా ఒక నినాదంగా బంద్ చేసే పార్టీలను బహిష్కరించడం అంతే"

మౌనంగా తలాడించాడు అతడు.

ఆఫీసుకు చేరుకున్నారు ఇద్దరూ. కారు పార్కింగ్ ప్లేస్‌లో పెట్టాక బ్రీఫ్‌కేస్ చేతిలోకి తీసుకున్నాడు అతడు. "కమాన్" ముందుకు నడిచాడు.

ఇద్దరూ లిఫ్ట్‌లో ఆఫీస్ ఉండే మూడో ఫ్లోర్‌కి చేరుకున్నారు. అతడు తన ఛాంబర్‌లోకి ప్రవేశించాడు. "కూర్చో" ఆమెకు ఛెయిర్ చూపించి, తన ఛెయిర్‌లో తాను కూర్చున్నాడు. గాయత్రి కూర్చుంది.

శ్రీనివాస్ ఫోన్ అందుకుని రింగ్ చేశాడు. అవతలివ్యక్తి లైన్‌లో కొచ్చాక "అంకుల్ నేను శ్రీనివాస్‌ని. మనం ఇంట్రడ్యూస్ చేసిన శీర్షికకు లేఖలు వచ్చాయా?"

"ఆఁ! వచ్చాయి. ప్రస్తుతం అవే చూస్తున్నాను. వాటిలో మంచివి సెలక్ట్ చేసి మీకు పంపుతాను" చెప్పారాయన.

"ఎంత సమయంలో?"

"మరో రెండు గంటలలో"

"అలాగే" ఫోన్ పెట్టేశాడు అతడు.

శ్రీనివాస్ ఫోన్ పెట్టేశాక గాయత్రి అడిగింది. "అంకుల్‌నుండి లేఖలు వస్తున్నాయా?"

"అవును"

"అయితే వాటిని నేనూ చూస్తాను"

"తప్పకుండా" అనేసి, ఫైల్స్ తిరగేయసాగాడు అతడు. రెండుగంటల తర్వాత ప్రకాశరావుగారి ఆఫీస్‌బాయ్ కవరు తీసుకువచ్చి అతడికి అందించాడు. విప్పి చూస్తే అందులో పాతికవరకూ లేఖలున్నాయి.

శ్రీనివాస్ ఆసక్తిగా వాటిని చదవసాగాడు. గాయత్రి కూడా వాటిని తిరగేయసాగింది.

అతడికి ఆశ్చర్యం కలిగించని విషయం ఏమిటంటే- ఇంచుమించుగా ప్రతి ఉత్తర సారాంశం ఒకటే, 'ప్రజలలో మార్పు రావాలి' వారు తిరగబడాలి. నినదించాలి! అంతే! కాకపోతే చెప్పే విధానంలో మార్పు ఉంది.

శ్రీనివాస్ అయోమయంగా గాయత్రివంక చూశాడు. ప్రతి లేఖలోనూ బంద్ సమస్యకు పరిష్కారం ప్రజలలో మార్పు రావాలనే ఉంది.

"అవును ఈ సమస్యకు కాదు. దేశంలోని ఏ సమస్యకైనా సొల్యూషన్ ఒకటే. ప్రజలలో మార్పు రావాలి. నిజం"

అతడు వెనక్కువాలి దీర్ఘాలోచనలో పడ్డాడు. అతడి కనులముందు అదే దృశ్యం! 'పదిమంది అల్లరిమూకను ఉద్రిక్తులయిన జనం తరిమికొట్టడం'

నిజమే! ఈ సమస్యకు పరిష్కారం అదొక్కటి మాత్రమే.

అతడికి హుషారుగా అనిపించింది.

"నేను ప్రజలలో మార్పు తెచ్చేందుకు కృషిచేస్తాను" మనసులో అనుకున్నాడు శ్రీనివాస్. బట్, ప్రజలలో అంత సులభంగా మార్పు రాదని అతడికీ తెలును. కేవలం ఒకవ్యక్తి సమాజాన్ని మొత్తం మార్చగలిగితే, ఈసరికి గాంధీ, బోసులు ఆ మార్పు ఏనాడో తెచ్చేవారు. అయితే ఒకవ్యక్తి కొంతమందిని ప్రభావితం చేయగలడని మాత్రం తెలును. 'నేనూ కనీసం కొంతమందినయినా ప్రభావితం చేస్తాను'

అతడి ముఖంలో కదలాడే మార్పులను గమనిస్తోంది గాయత్రి. చివరగా అడిగింది. "ఇంతకీ ఈ లేఖలమీద మీ అభిప్రాయం?"

"పాఠకుల అభిప్రాయం సరయినదే- ప్రజలలో మార్పు రావాలి" ఒప్పుకున్నాడు అతడు.

"థాంక్స్! ఇంతకాలానికి నా అభిప్రాయాలలో ఒకదానితో అంగీకారభావం తెలిపారు...

ఇక మరొక్క అభిప్రాయంతో అంగీకారభావం తెలిపితే చాలు. నా జీవితం చాలా ధన్యమయిపోయినట్టు భావిస్తాను''

''ఏమిటా అభిప్రాయం?''

''మగాడికి పెళ్లి తప్పనిసరి అనే అభిప్రాయం''

అతడు మెల్లగా నవ్వాడు. ''నీ ఆ అభిప్రాయంతో కూడా నేను ఏకీభవిస్తున్నాను''

''హెూయ్...'' పెద్దగా అరిచింది గాయత్రి. అది సౌండ్‌ప్రూఫ్ గది కాబట్టి సరిపోయింది. లేకపోతే ఆమె అరుపుకు స్టాఫ్ మొత్తం పరిగెత్తుకొచ్చేవారు.

''ఏయ్! ఏమిటా అరుపు?''

''ఆనందం పట్టలేక!- ఇక నేను పెళ్లి గురించి దిగులుపడనవసరంలేదు. కొద్దిరోజులు పోయాక 'మావారు బంగారుకొండ...' అంటూ పాట పాడుకోవచ్చు. ప్రస్తుతానికి మాత్రం కలల పాటలు పాడుకుంటాను''

''ఏదోలా చెయ్యి. ఇప్పుడు మాత్రం నన్ను విసిగించకు. చెయ్యవలసిన పనులు చాలా ఉన్నాయి''

''నేనూ సహాయం-చేస్తాను'' అతడి పక్కకు వచ్చి నిలబడిందామె.

''నువ్విలా పక్కన నిలబడితే, నేను పనిచేయడం మానేసి- నీకు సమాధానం చెప్పడంతో టైమయిపోతుంది''

''పని కొత్తగా నేర్చుకునేవారికి కాస్తో కూస్తో డౌట్స్ వస్తాయికదా! అవి క్లియర్ చెయ్యాలి మరి''

''ప్రస్తుతానికి నాకు అంత తీరికలేదు. తమరు దయచేస్తే మంచిది''

ఆమె చిలిపిగా అతడి కన్నులలో కన్నులు పెట్టి చూసింది. ''అలాగే వెళ్లిపోతాను నేను- ఒక్క ప్రశ్నకు సమాధానం చెపితే!''

''ఏమిటా ప్రశ్న?''

''మన పెళ్లి ఎప్పుడు?''

అతడు కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా కన్నులు మూసుకున్నాడు. ఆమె టెన్షన్‌గా అతడి ముఖంలోనికి చూస్తోంది.

శ్రీనివాస్ కన్నులు విప్పాడు. ఆ గదిలోని గాలి ఆగిపోయిన భావన!

''మన పెళ్లి... అవినాష్ ఎమ్.ఎల్.ఏ.గా గెలిచినరోజు''

ఆమె పెదవులు బిగపట్టింది ''అవినాష్ ఎమ్.ఎల్.ఏ.గా గెలవడం...'' సాధ్యాసాధ్యాల గురించి మాత్రమే ఆమె ఆలోచించసాగింది. కొద్దిక్షణాల తర్వాత ''ఆల్‌రైట్! అలాగే'' ఒప్పుకోలుగా తలాడించి, బయటకు నడిచిందామె. మరుక్షణం స్ప్రింగ్‌డోర్ తెరచుకుంది. ఆమె వెళ్లిపోయింది. స్ప్రింగ్‌డోర్ మెల్లగా మూసుకోసాగింది- ఆమెను గురించిన అతడి ఆలోచనల్లానే!

అతడు ఆమె గురించి అరనిమిషం ఆలోచించాక, తిరిగి తన పనిలో మునిగిపోయాడు. ఇప్పుడు తనముందు చాలా పెద్ద లక్ష్యం ఉందని అతడికి తెలుసు.

'అవినాష్‌ని ఎమ్.ఎల్.ఏ.గా గెలిపించుకోవడం అనుకున్నంత సులభమయిన విషయం కాదని' అతడూహించాడు.

అది వాస్తవం కూడా!

ఆంజనేయులునాయుడిమీద హత్యాప్రయత్నం చేయబోయారన్న సానుభూతి ప్రజలలో ఉంది. అది అతడికి ప్లస్‌పాయింట్.

'లక్ష్మి 'బంద్'రోజున ఆ పార్టీ కార్యకర్తల దౌర్జన్యానికి బలయిందన్న వాస్తవం కూడా ప్రజల మనసులలో ఉంది. అది అవినాష్ గెలుపుకు తోడ్పడుతుంది.

ఆంజనేయులునాయుడు గూండా, రౌడీ చాలా హత్యలు చేయించినవాడు. ఇలాంటి 'కిల్లర్స్' మీద కూడా జనాలకు క్రేజ్ పెరుగుతూ ఉంది.

అయితే నీతి, నిజాయితీలను అభిమానించే గుణం కూడా ప్రజలలో పూర్తిగా పోలేదు. ముఖ్యంగా మహిళలలో మంచితనంమీద అభిమానం అలాగే ఉంది.

అన్నింటికన్నా ముఖ్యంగా అవినాష్ అధికార పార్టీ అభ్యర్థి! ప్రస్తుతం ఆ పార్టీ గాలి బలంగా ఉంది. పైపెచ్చు ఎన్నికలలో ప్రధానంగా పనిచేసేది డబ్బు. శ్రీనివాస్ ఆ విషయంలో మనసు చంపుకున్నాడు. ఎలక్షన్స్‌లో డబ్బు ఉపయోగించకూడదని తెలిసి కూడా

తన లక్ష్యం సాధించడం కోసం ఆత్మవంచన తప్పదనుకున్నాడు. అందుకే ఎంత డబ్బయినా ప్రవహింపచేసేందుకు సిద్ధపడ్డాడు.

అవినాష్ మంచివాడు చదువుకున్నవాడు. నీతి- నిజాయితీలపట్ల నమ్మకం కలిగినవాడు. ముఖ్యంగా- ఇంతవరకూ రాజకీయ దుర్గంధం వంటికి అంటనివాడు.

ఈ కారణాలన్నీ విశ్లేషిస్తే పోటీ చాలా గట్టిగా ఉంటుందని అర్థమయిపోయింది.

శ్రీనివాస్ తను ఆ చోటుకు వెళ్లకూడదనుకున్నాడు. హైదరాబాద్‌లో ఉండే కథను నడిపించాలని నిశ్చయించుకున్నాడు.

గాయత్రి మాత్రం తన మకాం మార్చేసింది. అవినాష్ గెలుపు తన జీవిత సమస్యగా తీసుకుంది. శ్రీనివాస్ తమ పెళ్లి విషయం అవినాష్ గెలుపుతో ముడిపెట్టాడు. కాబట్టి- శ్రమ పడక తప్పదనుకుంది

అవినాష్ కూడా చాలా శ్రమపడసాగాడు. ప్రాక్టీస్ కూడా మానుకుని, ఇంటింటికీ తిరగసాగాడు. ఆంజనేయులునాయుడి దుర్మార్గం గురించి వివరించి చెపుతున్నాడు.

గాయత్రి తన ప్రచారం ఓ కొత్త పద్ధతిలో మొదలెట్టింది. 'బంద్' సమస్యను ప్రముఖంగా తీసుకుంది. ఆంజనేయులునాయుడి పార్టీ టౌన్‌లో ఎన్నిసార్లు బంద్ నిర్వహించిందో లెక్క చెప్పింది. అలాంటి బంద్‌లవలన జనం ఎటువంటి ఇబ్బందులు పడతారో వివరించింది. సామాన్య మానవుల మనుగడ ఇలాంటి కారణాలవలనే కష్టమవుతోందన్నది. ఆంజనేయులునాయుడి పార్టీ చేసిన బంద్ వలననే అవినాష్ భార్య- ఒక మంచి డాక్టర్ మరణించిందని రుజువుచేసింది. ప్రజల మనసులను మార్చడానికి 'సెంటిమెంట్'ను మించిన ఆయుధం లేదు.

ఈ సెంటిమెంట్ బాగా పనిచేసింది. 'బంద్' సమస్య జనాలను బాగా కదిలించింది. మనం ఏదయినా చెప్పొచ్చు- కాని దానిని అవతలివారి మనసులలో హత్తుకునేలా చెప్పగలగాలి. మనం చెప్పే సమస్యను గురించిన ఒక ఊహాచిత్రం వినేవారి మనసులో ఏర్పడాలి. అప్పుడు నువ్వు చేసిన పనికి సార్థకత కలుగుతుంది. అవతలివారి మనసులలో 'చలనం' మొదలవుతుంది. ఈ టెక్నిక్‌ని బాగా ఉపయోగించింది గాయత్రి. ఆ ప్రయత్నం చాలావరకూ సఫలం అయింది.

పోలింగ్ తేదీ దగ్గరపడింది. అందరి మనసులలో టెన్షన్!

ఇరువర్గాల వ్యక్తులు బాగా తిరుగుతున్నారు. ప్రముఖులు మీటింగ్‌లు పెట్టి మాట్లాడుతున్నారు.

ఆమధ్యకాలంలో అవినాష్ ఒకసారి శ్రీనివాస్‌కి ఫోన్ చేశాడు.

"శ్రీనివాస్! నువ్వోసారి ఇక్కడికి వస్తే బాగుంటుంది"

"ఎందుకు?"

నువ్వొచ్చి నిలబడితే ఇంకా కొంతమంది జనం నాకు ఓటు వేస్తారు. మీ మిల్‌లోని కార్మికుల ఓట్లన్నీ నాకే పడతాయి. నాకు కొండంత అండగా అనిపిస్తుంది"

"అవసరంలేదు... నేను రానవసరంలేదు. నా ప్రతినిధిగా గాయత్రి అక్కడ పరిస్థితులన్నీ మనకు అనుకూలంగా మారుస్తూ ఉంది. నేను లేనిలోటు ఆమె ద్వారా తీరుతుంది. మీకు భయం అవసరంలేదు. మీరు తప్పక గెలుస్తారు"

"అసలు... అసలు మీరిక్కడికి ఎందుకు రారు?"

అతడు మాట్లాడలేదు. మనసులో మాత్రం అనుకున్నాడు. 'నేను ఆ చోటుకు వస్తే లక్ష్మి స్మృతులు నన్ను బాధపెడతాయి. నా ప్రశాంతత చెదిరిపోతుంది'

"ఆల్‌రైట్! మీరెందుకు రారో అర్థమయింది" అంటూ ఫోన్ పెట్టేశాడు అవినాష్.

మరోరోజు గాయత్రినుండి ఫోన్.

"ఎలా ఉన్నారు మీరు?"

"బాగున్నాను... అక్కడ విశేషాలు ఏమిటి? అవినాష్ గెలుపు గురించి చెప్పు"

"నాకు అనిపిస్తుంది- అవినాష్ తప్పక గెలుస్తాడు. ప్రజలలో చాలా మార్పు వచ్చేసింది. వారు సమస్యల పట్ల బాగా విసిగిపోయి ఉన్నారు. సమస్యలు లేని భారతదేశా

న్ని కోరుకుంటున్నారీ ప్రజలు''

''అలా జరిగితే మనకన్నా సంతోషించేవారు ఎవరూ ఉండరు''

''మీకు సంతోషం మాత్రమే కాబోలు, బట్ నాకిది జీవిత సమస్యకదా?''

ఆమె బాధ అర్థమయింది అతడికి. మాట వరసకు అన్నాడేగానీ, అవినాష్ గెలుపుకూ తమ పెళ్లికి లింక్‌లేదు. అప్పటికేదో తప్పించుకునేందుకలా అన్నాడు. కాని అది లక్ష్యంగా ఆమె అవినాష్ గెలుపుకోసం కష్టపడుతుంటే 'ఒక మంచిపనికోసం కష్టపడుతున్నట్టు'గా భావించుకుని సంతృప్తిపడుతున్నాడు. ఫోన్ పెట్టేశాడు అతడు.

అక్కడ-

ఆంజనేయులునాయుడు కూడా తన గెలుపుకోసం చాలా కష్టపడుతున్నాడు. అధికార పార్టీ అవినాష్‌కి పోటీగా నిలబెట్టిందంటే మొదట అతడు నవ్వుకున్నాడు. రాజకీయాలలో ఏమాత్రం అనుభవంలేని ఒక కుర్ర డాక్టర్ తనముందు ఏమి నిలబడబోతాడులే అని భావించాడు. అయితే, అవినాష్ వెనక జె.యస్. ఉన్నాడని తెలిసినప్పుడు మాత్రం కొద్దిగా ఆలోచించాడు. ఆ వ్యాపారవేత్త అతిగొప్ప తెలివితేటలు కలవాడని తెలుసు. బమ్మిని, తిమ్మిని చేయగల నేర్పు కలవాడు. కొద్దిగా భయం వేసింది అతడికి. అంతలోనే తనకు తాను సర్దిచెప్పుకున్నాడు. జె.యస్. బిజినెస్‌లో గొప్పవాడే కావచ్చు. కాని బిజినెస్ ట్రిక్కులు రాజకీయంలో పనిచేయవుకదా! పైగా హత్యా ప్రయత్నంవలన తనమీద జనాలకు సానుభూతి ఉంది.

అయితే- అవతలిపక్షం ప్రచారం చూసి కంగుతిన్నాడు అతడు. లక్ష్మి అనే డాక్టర్ మరణానికి కారణం తనేనట! తమ పార్టీ కార్యకర్తలు చేసిన బంద్‌వలనే అవినాష్ భార్య మరణించిందట. 'సానుభూతి' కన్నా కూడా సెంటిమెంట్ గొప్పది. దాని ప్రభావం ప్రజలమీద చాలా ఉంటుంది. ప్రజలు అవినాష్‌మీద అభిమానం చూపించడం గుర్తించాడు అతడు.

అంతేకాదు, చిచ్చరపిడుగులాంటి ఓ అమ్మాయి బంద్ సమస్యను ప్రముఖంగా తీసుకువచ్చి, తమ పార్టీ ఎన్నిసార్లు బంద్‌చేసి ఎంతమందిని బలిగొన్నదో సంఖ్యలు చెప్తుంటే జనం నోళ్లు తెరచుకుని వింటున్నారట. ఒక సమస్యపట్ల జనం ఇంతగా స్పందించగలరన్నది అతడి జీవితంలో మొదటిసారిగా చూస్తున్నాడు. ఇది సాధ్యమని మరొక స్థితిలో అయివుంటే అతడు నమ్మిఉండి ఉండేవాడుకాదు. ప్రత్యక్షంగా చూడడంతో రియలైజ్ అయ్యాడు. బట్, అప్పటికే ఆలస్యమయింది. మేమిక బంద్‌లు చేయమని చెప్పినా జనాలు ఒప్పుకోరు. తను ఓటమి అంచుకు చేరుకున్నాడు. ఇక దేవుడిదే భారం!

పోలింగ్ జరిగింది.

ఆరోజు- గెలుపుకోసం ఎన్ని అక్రమపద్ధతులు ఉపయోగించవచ్చో, అన్ని అక్రమ పద్ధతులూ ఉపయోగించాడు ఆంజనేయులునాయుడు. అయితే అతడు అందించిన డబ్బు, సారాలకన్నా కూడా గాయత్రి అనే అమ్మాయి లక్ష్మి చావును బుర్రకథగా చెప్పడం జనం మనసులలో కదలాడుతోంది.

జనం ఓట్లు వేసేశారు.

రిజల్ట్స్ మరో రెండు రోజులలో అనౌన్స్ చేస్తారు.

అందరి మనసులూ టెన్షన్స్‌తో కలవరపడుతున్నాయి. గెలుపు, ఓటములు మనిషి జీవిత పథాన్ని నిర్దేశిస్తాయి.

ఆంజనేయులునాయుడు గెలిస్తే అరాచకము ఎక్కువవుతుంది. అందుకే అతడు గెలవకూడదు.

శ్రీనివాస్ ఫోన్‌ముందే కూర్చుని ఉన్నాడు. ఎప్పటికప్పుడు రిజల్ట్స్ గురించిన సమాచారం సేకరిస్తున్నాడు.

పోలింగ్ జరిగిపోయాక తన బాధ్యత తీరిపోయినట్టుగా ఫీల్ అయిందామె. అందుకే హైదరాబాద్ తిరిగి వచ్చేసింది.

కౌంటింగ్ ప్రారంభమయింది. గాయత్రి కూడా శ్రీనివాస్ ఆఫీసుకు చేరింది.

రెండువేలు మెజారిటీ ఆంజనేయులునాయుడిది- మొదటిరౌండ్‌లో!

అతడు ఊపిరి బిగపట్టాడు. గాయత్రి

ముఖం వాడిపోయింది.

రెండో రౌండ్‌లో అవినాష్ వెయ్యిఓట్ల మెజారిటీ సాధించాడు.

ఆమె ముఖంలో పోయిన కళ తిరిగి వచ్చేసింది. అతడి పెదాలమీద దరహాసం!

మూడోరౌండ్ కౌంటింగ్ మొదలయింది. అతడు రింగ్ అయ్యే ఫోన్‌కోసమే అదిరే గుండెలతో ఎదురుచూస్తున్నాడు.

ఫోన్ రింగ్ అయింది. అతడికి వార్త అందింది. 'మూడో రౌండ్‌లో అవినాష్ పదిహేనువేల మెజారిటీ సాధించాడు.

ఆ తర్వాత అవినాష్‌కి ఎదురే లేకపోయింది.

''అవినాష్ గెలిచాడు''

ఆ వార్త శ్రీనివాస్‌ని ఎంతగా సంతోషపెట్టిందంటే, అతడు తన ఛెయిర్‌లోనుండి లేచి వెళ్లి గాయత్రి నడుము చుట్టూ చేతులు వేసి పైకెత్తాడు. ఆమెను గిరగిరా తిప్పాడు.

గాయత్రి మనసునిండా ఉత్సాహం! కష్టానికి సరయిన ఫలితం అత్యద్భుత ఆనందాన్ని ఇస్తుంది. ఆ ఆనందాన్ని ఇంటిలోనివారికి కూడా చెప్పాలని బయట పరుగెత్తిందామె.

శ్రీనివాస్ ఛెయిర్ దగ్గరగా ఉండే విండోకర్టన్ తొలగించాడు. అద్దాలకిటికీలోనుండి బయట ప్రపంచం స్పష్టంగా కనిపిస్తోంది.

ఆకాశంలో అప్పటివరకూ నల్లనిమబ్బులు కదలాడుతున్నాయి. అప్పుడే... ఆ క్షణమే మబ్బులలోనుండి ఓ నీటిముత్యం నేలకు జారింది.

అది- ఆ దృశ్యం ... లక్ష్మి ఆత్మ ఆనందబాష్పాలు రాలుస్తున్నట్టుగా అనిపించింది అతడికి.

క్షణాలలో చినుకు చినుకు కలసి వర్షం మొదలయింది.

ఆ వర్షం చూస్తుంటే అతడికి చెప్పలేనంత ఆనందం కలిగింది. తను వెళ్లి ఆ వర్షంలో తడుస్తూ చిన్నపిల్లాడిలా గెంతాలనిపించింది.

కాని వెళ్లలేదు. అచోటే నిలబడి వర్షాన్ని తాదాత్మ్యతతో చూడసాగాడు. లోకం మరచిపోయాడు.

ఆ వర్షంలో తనూ, లక్ష్మి నడిచి వెళుతున్నట్టు, అడ్డుగా ఉన్న గొడుగును పైకి ఎగరేసినట్టు, తడిసి ముద్దయి పరిగెడుతున్నట్టు... అన్నీ ఊహలే! వాస్తవానికన్నా ఊహే మనిషికి ఎక్కువ ఆనందాన్ని ఇస్తుంది.

అలా ఊహలలో ఎంతసేపు నిలబడిపోయాడో తెలియదు.

తేరుకుని చూస్తే బయట వర్షం ఆగిపోయి ఉంది. ఆకాశం ప్రశాంతంగా ఉంది.

లక్ష్మి ఆత్మ కూడా ఇప్పుడిలాగే ప్రశాంతంగా ఉండి ఉంటుందనుకున్నాడు అతడు.

ఆ ఆలోచన అతడికి ఎంతో సంతృప్తిని కలిగించింది.



**ఆ**ఫీసులో ఫైల్స్ తిరగేసుకుంటున్నాడు అతడు.

ఫోన్ రింగ్ అయితే రిసీవర్ చేతిలోనికి తీసుకున్నాడు. ఫోన్ అవినాష్ దగ్గరనుండి ''హలో అవినాష్! ఎలా ఉంది కొత్త బాధ్యత?''

''బరువుగా ఉంది'' నవ్వాడు అతడు.

''ఏమిటి విశేషం?''

''ఏముంది! రేపు వారంలో శాసనసభ సమావేశాలు మొదలవుతాయి. నేను హైదరాబాదు రావాలి''

''వచ్చేసెయ్యి. మా ఇంటిలోనే ఉందువు''

''ఎందుకు?- మా ఎమ్మెల్యే క్వార్టర్స్ ఉన్నాయికదా!''

''ఓ.కె.''

"ఉంటాను" అవినాష్ ఫోన్ పెట్టేశాడు. అతడు కూడా రిసీవర్ హుక్‌మీద ఉంచాడు. సరిగ్గా అదే క్షణం గాయత్రి తలుపు తీసుకుని లోపలికివస్తూ కనిపించింది. ఆమె ముఖం చాలా సీరియస్‌గా ఉంది. అతడు కనుబొమలు ముడిచాడు.

గాయత్రి వచ్చి అతడి ఎదురుసీట్లో కూర్చుంది. "ఏమిటి గాయత్రీ ఏమయింది?"

"మిమ్మల్ని ఓ విషయం సీరియస్‌గా అడగాలని వచ్చాను"

"ఏమిటో అడుగు"

"అవినాష్ గెలిచాక మన పెళ్లి అన్నావు. అవినాష్ ఎమ్.ఎల్.ఏ అయ్యి ఇప్పటికి రెండు నెలలయింది. ఇప్పటివరకూ ఆ ప్రసక్తే తీసుకురాలేదు మీరు"

అతడికి నవ్వు రాబోయింది. అతికష్టంమీద ఆపుకున్నాడు.

"మేము మగపెళ్లివారం. అలాంటి ప్రసక్తి ఆడపెళ్లివారే తీసుకురావాలి"

ఆమె అతడివంక అరసెకనుపాటు ఓరగా చూసింది. వెంటనే ఎప్పటిలాగే సీరియస్‌గా, "ప్రసక్తి తీసుకురావడం సరే! మగపెళ్లివారికి ఇంకా ఏమయినా సమస్యలు మిగిలిఉన్నాయేమో! తర్వాత అడిగాక ఆ సమస్యల లిస్టు ఏకరువుపెడితే కష్టం"

"ప్రస్తుతానికి మాకు అలాంటి సమస్యలు ఏవీలేవు. కాకపోతే..." ఆగాడు.

"కాకపోతే?" అదుర్దాగా ప్రశ్నించిందామె.

"అమ్మాయి నచ్చాలి. కట్నకానుకలు మాట్లాడుకోవాలి... అంతే"

ఆమె పెదవులు బిగపట్టింది.

"అమ్మాయి నచ్చలేదా?"

అతడు ఛెయిర్‌లోనుండి పైకి లేచాడు. ఫొటోగ్రాఫర్ మోడల్‌ని పరిశీలించినట్టుగా ఆమెను చూస్తూ "అందం పర్వాలేదు. మనసు కూడా మంచిదే! చదువూ, గుణం అన్నీ ఓ.కే. కానీ..."

"ఊఁ! కానీ..."

"చిలిపితనం కొద్దిగా తగ్గించుకుంటే బాగుంటుంది"

"పెళ్లయ్యాక ఆడపిల్లలోని చిలిపితనం అదే పోతుంది. ఉరకల గోదావరి, కొద్దిదూరం సాగాక గంభీర జీవనది అవుతుంది. తెలుసుకోండి..." అనేసి వేగంగా బయటకు వెళ్లిపోయింది- నవ్వుకుంటూ.

పావుగంట తర్వాత అనంతరాజుగారి దగ్గర నుండి ఫోన్ వచ్చింది. "శ్రీనివాస్ అమ్మాయి ఏదో చెప్పింది... పెళ్లి విషయం గురించి..."

"అవును అంకుల్! నేను గాయత్రిని పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాను"

"చాలా మంచిది బాబూ" ఆయన కంఠం జీరగా పలికింది. పొంగే ఆనందం అణచుకోవడంవలన వచ్చిన జీర అది.

ఆయన వెంటనే రాధమ్మ దగ్గరకు వెళ్లాడు. కాసేపు అవీ ఇవీ మాట్లాడాక అసలు విషయంలోనికి వచ్చాడు.

"రాధమ్మా! మేము గాయత్రిని శ్రీనివాస్‌కి ఇవ్వాలనుకుంటున్నాం. దీనిమీద నీ అభిప్రాయం..."

"మంచిదే. అన్నయ్యగారూ! కాని వాడు పెళ్లంటే వద్దంటున్నాడే" నిట్టూర్చిందామె.

"లేదమ్మా! వచ్చేముందు ఫోన్ చేశాను. అబ్బాయి ఈ పెళ్లికి ఒప్పుకున్నాడు"

ఆమె ముఖం చాటంతయింది. "నిజమా అన్నయ్యగారూ" అంది ఆశ్చర్యంగా.

"అవునమ్మా" బదులిచ్చారాయన.

ఆవిడ తన చెవులను తానే నమ్మలేకపోయింది. శ్రీనివాస్‌కి ఈ జన్మలో పెళ్లికాదని ఎప్పుడో నిశ్చయించేసుకుంది. ఇప్పుడీ వార్త ఆమెను ఆనందంలో ముంచేసింది.

"అయితే మంచిరోజు చూసి ముహూర్తాలు పెట్టేసుకుందాం"

"అలాగేనమ్మా"

ఆ తర్వాత కార్యక్రమాలు చాలా త్వరగా జరిగిపోయాయి. మంచిరోజు చూసి ముహూర్తాలు నిశ్చయించుకున్నారు. ఆ కార్యక్రమానికి అవినాష్ కూడా అటెండ్ అయ్యాడు. "ఇంతకాలానికి మీరు ఓ ఇంటివారు కాబోతున్నారు. అడ్వాన్స్ కంగ్రాచ్యులేషన్స్"

''థాంక్యూ''

ముహూర్తాలు కూడా చాలా దగ్గరలోనే కుదిరాయి.

అనంతరాజుగారికి గాయత్రి ఒక్కగానొక్క కూతురు. అందువలననే ఈ పెళ్లి ఘనంగా చెయ్యాలనుకున్నారు. అందులోనూ ఇరుపక్కలా బంధుమిత్రవర్గం చాలా ఎక్కువగా ఉంది.

పెద్ద ఫంక్షన్ హాలును మాట్లాడారాయన. పెండ్లిపత్రికలు ఖరీదయినవి ప్రింట్ చేయించారు. శ్రీనివాస్‌వైపు పెద్దలు ఎవరూ లేరు. ఇరువైపులా బాధ్యతలు తను మోయవలసిందే. అన్ని కార్యక్రమాలకు ఏర్పాట్లు తనే చూస్తున్నారు. పాపం పార్వతమ్మ ఈ సమయంలో భర్తకు చేదోడుగా ఉండలేకపోయానని, తన అనారోగ్యాన్ని తిట్టుకోసాగింది.

ఒకరోజు గాయత్రి, శ్రీనివాస్‌లు కలసివెళ్లి పెళ్లి బట్టలు కొనుక్కున్నారు. గాయత్రి ముఖంలో మునుపెన్నడూ కనుపించని కొత్తకళ చూశాడు శ్రీనివాస్. అది పెళ్లికళ అని అర్థమయింది అతడికి.

అవినాష్ హైదరాబాద్‌లోనే ఉండిపోయాడు. శ్రీనివాస్ పెళ్లయ్యేంతవరకూ చేదోడు వాదోడుగా ఉండాలన్న తన నిర్ణయాన్ని రాధమ్మకు తెలియచేస్తే ఆమె సంతోషపడింది.

పెళ్లిపనులు చాలా త్వరగా జరుగుతున్నాయి.

శ్రీనివాస్ లక్ష్మిని వీలయినంతవరకూ మనసులోనికి రానీకుండా జాగ్రత్త పడుతున్నాడు. పగలంతా పనులమధ్య తన ప్రయత్నం ఫలించినా, ఏ నిశిరాత్రివేళో మెలుకువ వస్తే లక్ష్మి ఆలోచనలతో తల బద్దలయ్యేది. లక్ష్మి తనకు ఇక కనిపించదనుకుంటే, గుండెలలో బాధ సుడులు తిరిగేది. తొలిప్రేమ మనసులో ఇంత గాఢంగా ఉంటుందా? అనిపించేది. అతడికి లక్ష్మి కూతురుని చూడాలనిపించేది. కాని ఆ పాప ఉనికి తనకు అనుక్షణం లక్ష్మినే గుర్తుకుతెస్తుందని ఆ ఆలోచనను పక్కన పెట్టేవాడు.

అయితే, ఇప్పుడు అర్ధరాత్రివేళ మెలుకువ వచ్చినా, అంతకుముందులా ఒంటరితనం తోచేదికాదు. గాయత్రి తనకు తోడు ఉండబోతుందన్న ఆలోచన మానసికధైర్యాన్ని కలిగించేది.

రేపు గాయత్రి తన జీవితంలో ప్రవేశించాక, లక్ష్మి తాలూకూ ఆలోచనలు చాలావరకూ తగ్గిపోతాయని అతడికి తెలుసు. కాలం చాలా గాయాలను మాన్పుతుంది.

అన్నింటికన్నా అతడికి ఆనందాన్ని కలిగించే విషయం- అవినాష్ తనను అర్థంచేసుకోవడం! లక్ష్మిని అపార్థం చేసుకోకపోవడం! అతడిప్పటికీ తననో శ్రేయోభిలాషిలా భావించి గౌరవించడం, తన ఇంటిలో ఒక మనిషిలా కలసిపోవడం ఆనందాన్ని పెంచింది.

ముహూర్తంరోజు దగ్గరయింది.

అతడు అవినాష్‌ని దగ్గర తీసుకుని కావలసినవారికి పెండ్లిపత్రికలు పంచాడు.

పెళ్లిరోజు దగ్గరయ్యేకొద్దీ గాయత్రి దూరంగా మెలగసాగింది. ప్రతి ఆడపిల్లా పెళ్లికి ముందు ఆ మాత్రం సిగ్గుపడుతుందని అతడికి తెలుసు.

పెళ్లిరోజు-

చాలామంది వచ్చారు. శ్రీనివాస్ బిజినెస్ సర్కిల్‌లోనివారు, అతడి ఆఫీస్ స్టాఫ్, కొత్తగా పరిచయం అయిన రాజకీయనాయకులు, మిత్రులు పెద్దసంఖ్యలోనే వచ్చారు. అనంతరాజుగారికి కూడా పెద్ద సర్కిలే ఉంది. ఇక గాయత్రి మిత్రబృందమయితే ఆమెను ఆటపట్టిస్తూ, జోక్‌లు కట్ చేస్తున్నారు.

పెళ్లిమండపం విద్యుత్‌దీపాలతో గొప్పగా అలంకరించారు.

పెళ్లికొడుకుగా తయారయిన శ్రీనివాస్‌ని చూసి అవినాష్ ''బాప్‌రే! ఈ వేషంలో నువ్వు మగాళ్లకే ముద్దొస్తున్నావు'' అంటూ కామెంట్ చేశాడు.

నవ్వి ఊరకుండిపోయాడు శ్రీనివాస్.

ప్రకాశరావు అతడి దగ్గరకొచ్చి 'బంద్' గురించిన శీర్షికలో నెక్స్టు ఏ సమస్యను ప్రకటిద్దాం?' అని అడిగాడు.

అవినాష్ ఆయనవంక సీరియస్‌గా చూసి ''అయ్యా! ఇది పెండ్లిపందిరి. పత్రికాఫీసు

సచిత్ర విచిత్రం



# నోరూరించిన 'సంస్కృతీ సంగమం'

సముద్రంలో అలవోకగా తేలుతూ వస్తున్న అతి పెద్ద అనాస పండుని, అరటి పండుని చూసి తీరం దగ్గర కులాసాగా కబుర్లు చెప్పుకుంటున్న ప్రజలు ఆనందంతో గంతులు వేశారు. 50, 60 మంది సునాయాసంగా ఆ పళ్లని తలో ముక్కా తినచ్చని అంచనావేశారు. కానీ తీరా దగ్గరకొచ్చాక అందులోంచి మనుషులు దిగడం ప్రారంభించారు. ఆ తరవాత తెలిసిందేమంటే అది రెండు దేశాల మధ్య నడిచిన సాంస్కృతిక అవగాహన వేడుక అని. అరటిపండు పడవ కాఫ్స్‌హార్బర్‌నుంచి బయలుదేరితే, అనాసపండు క్వీన్స్‌లాండ్‌కి చెందింది. ఈ వేడుక బ్రిస్‌బేన్‌లో బ్రిస్‌బీదీవివద్ద జరిగింది.

కాదు. ఇప్పుడు మీరు దేశసమస్యలూ- పరిష్కారాలకన్నా బెడ్‌రూమ్ సమస్యలూ- పరిష్కారాలు లేదా కొత్త దంపతులు నేర్చుకోవలసిన విషయాలు, పద్ధతులు గురించి మాట్లాడండి. మా శ్రీనివాస్‌కి ఇప్పుడు అవసరమయినవి అవే'' అన్నాడు.

ప్రకాశరావుగారు కూడా హాయిగా నవ్వేశారు.

వధూవరులను పీటలమీద కూర్చోబెట్టారు. పురోహితులు మంత్రాలు చదువుతున్నాడు. మంగళవాద్యాలు మ్రోగుతున్నాయి.

గాయత్రి ఓరగా అతడివంక చూసింది. ఏదో గొప్ప విజయం సాధించానన్న సంతృప్తి ఆమె కన్నులలో కనిపిస్తోంది.

మంగళవాద్యాల మోత ఎక్కువయింది. పురోహితులు 'మాంగల్యం తంతునానేనా...' చదువుతున్నాడు.

శ్రీనివాస్ గాయత్రి మెడలో మంగళసూత్రం కట్టాడు.

అందరూ అక్షింతలు చల్లారు.

పురోహితులు వారిని మండపం బయటకు తీసుకువచ్చి ఆకాశంవంక చూపాడు ''అదిగో అరుంధతి నక్షత్రం''

శ్రీనివాస్ ఆ వంక చూశాడు. అక్కడ ఏ నక్షత్రం కనిపించలేదు. కాని లక్ష్మి నవ్వుతూ కనిపించింది ఆచోట.

ఆమె చిరునవ్వు నవ్వుతోంది.

అతడు కన్నులు మూసుకున్నాడు. పై నుండి లక్ష్మి అక్షింతలువేసి ఆదరిస్తున్నట్టుగా భావన కలిగింది అతడిలో.

★ ★ ★

తెల్లదనం ఆ గదిలో ఎటు చూసినా!

తెల్లని వాల్‌పెయింట్, తెల్లని ట్యూబ్‌లైట్ కాంతి, బెడ్‌మీద పరచిన దుప్పటి తెల్లనిది, పక్కనే ఉన్న టేబుల్‌మీది పాలు తెలుపు, పక్కమీద చల్లిన మల్లెలు తెలుపు... అతడు కట్టుకున్న బట్టలు కూడా తెలుపే!

శోభనంగదిలో తెల్లదనానికి ఎందుకింత ప్రాముఖ్యం!

తలుపు చప్పుడయింది. బయట కలకలం!

''జాగ్రత్త గాయత్రి!... మీ వారిని బెదరకొట్టకు''

''గాయత్రీ! నువ్వు బెదిరిపోకు''

''ఛీపోండి'' స్నేహితురాళ్లను కసురుకుంటోందామె మెల్లగా.

అతడు మనసులోనే నవ్వుకున్నాడు.

గాయత్రిని లోపలికి నెట్టి తలుపులు వేశారు.

అతడు కళ్లెత్తి చూశాడు. అప్పటివరకూ బెడ్‌మీద పడుకుని ఉన్న వ్యక్తి బెడ్‌దిగి ఆమె దగ్గరగా నడిచాడు. తలుపుకు లోపల గొళ్లెంవేశాడు. ఆమె భుజాలమీద చేతులువేసి బెడ్ దగ్గరకు నడిపించుకు వెళ్లాడు. ఆమెను బెడ్ మీద కూర్చోబెట్టాడు. తను పక్కనే కూర్చున్నాడు. ఆమె చేతిలోని పాలగ్లాసు తీసి టేబుల్ మీద పెట్టాడు.

''ఏమిటీ వింత? నన్ను పెళ్లి చేసుకుంటావా లేదా అని నిలదీసే అమ్మాయి కూడా ఈరోజు సిగ్గుపడుతుంది కాబోలు''

ఆమె ముఖం మరింత కిందికి దిగింది.

''ఆమధ్య నాకేదో బహుమతి ఇస్తానన్నావు. ఇక మన మధ్య ఏ అడ్డూలేదు. ఇవ్వదలచుకున్న బహుమతులన్నీ వరసగా ఇచ్చేయొచ్చు''

అతడి ప్రతిమాటా ఆమెను సిగ్గులమొగ్గను చేస్తోంది.

శ్రీనివాస్ ఆమె చుబుకం పట్టి తలపైకెత్తాడు. ఇద్దరి కన్నులూ కలుసుకున్నాయి ''ఏమిటింత సిగ్గు?''

''అందుకే ఆడపిల్ల ఈరాత్రి కోసం ప్రతి బహుమతినీ దాచుకోవాలి. ఈ రాత్రి గడిచే ప్రతిక్షణం దంపతులు మనసులో చిరకాలం ఉండిపోతుంది. తెలుసా?''

ఆమె మౌనంగా ఉంది.

''ఓ.కే. మాటలు తర్వాత ముందు బహుమతిల సంగతి కానివ్వు''

''నాకు... నాకు సిగ్గేస్తోంది''

''అయితే, ఆ బహుమతి నేను ఇవ్వనా?''

ఆమె మౌనంగా ఉంది. కొన్ని సమయాలలో మౌనం ఆనందకరమయిన సూచన కాబోలు.

అతడు ముందుకు వంగాడు. ఆమె కన్ను

లు మూసుకుంది. ఆ ఆనందం జీవితాంతం మనసులో ముద్రింపచేసుకోవాలనే ప్రయత్నం కాబోలు.

శ్రీనివాస్ ఆమె బుగ్గలను రెండు చేతులతో పొదివి పట్టుకున్నాడు. మొదటగా ఆమె నుదుటను పెదవులతో అద్ది చెప్పాడు. ''ఇది... నన్ను ప్రేమించినందుకు'' ఆ తర్వాత కొద్దిగా కిందికి జారాడు. ఆమె మూసిన రెండు కనురెప్పలనూ అధరాలతో హత్తుకున్నాడు. ''ఇది... నన్నింతకాలం కంటికిరెప్పలా చూసుకున్నందుకు''

మెల్లగా బుగ్గలను తాకాడు, ''ఇది నా కష్టాలలో పాలువంచుకున్నందుకు'' చివరగా అతడి పెదవులు ఆమె పెదవులతో కలిసాయి... మొదటి ముద్దు అనుభవం! మనసులో తీపి కదలిక! వళ్ళంతా హాయిగా... చుట్టూ మరేమీ గుర్తుకురానట్టు, ఈ లోకంలో తామిద్దరే ఉండిపోయినట్టు... ప్రకృతి మొత్తం స్థంభించిపోయినట్టు... ఆమె కన్నులు అరమోడ్పులయ్యాయి. శరీరం పులకరించిపోయింది.

పెదవుల నుండి పెదవులు విడివడ్డాక అతడు చెప్పాడు, ''ఇది ఎందుకో తెలుసా?... నువ్వు నా జీవిత భాగస్వామివి అయినందుకు''

నిజం! ఈ అనుభూతి తనకు జీవితాంతం గుర్తుండిపోతుంది.

శ్రీనివాస్ ఆమెను తన కౌగిలిలోనికి తీసుకున్నాడు. మెడ వంపులో సుతారంగా ముద్దుపెట్టుకున్నాడు. ఆనందం అంటే ఇదేనా? 'స్వర్గం ఎక్కడో కాదు, ఇక్కడే ఉందా? గాఢ పరిష్వంగంలో క్షణాలు మరిచిపోతే, యుగాలు గడిచినా తెలియదేమో!

స్త్రీ పురుషుల తనువులు ఏకం అవడంతో ఆ భగవంతుడు ఎంత ఆనందాన్ని దాచి అందించాడు.

వారిద్దరూ బెడ్ మీదకు వాలారు, పక్కమీద మల్లెలు మురిసిపోయాయి, తమ జీవితానికి సార్థకత కలిగిందని అనుకున్నాయి.

ట్యూబ్‌లైట్ మాత్రం సిగ్గుతో కన్నులు మూసుకుంది. బెడ్‌లైట్ దొంగచూపులు చూడసాగింది. కిటికీ పక్క నైట్‌క్వీన్ మొక్క గాలికి కదలాడసాగింది- అతడి చేతులలోని ఆమె తనువులా!

గాలి బరువెక్కింది!

అలసిసొలసిన శరీరాలు నిద్రలోనికి జారాయి.

మరో గంట గడిచాక అతడికి హఠాత్తుగా మెలుకువ వచ్చింది.

చుట్టూ చీకటి... భయంకరమయిన చీకటి!

ఒంటరితనం... తనకు ఎవరూ లేరన్న బాధాకరమయిన ఫీలింగ్ 'నేను ఎందుకు బతుకుతున్నాను' అన్న ప్రశ్న! మనశ్శాంతి లేదన్న దిగులు... తన చుట్టూ స్థబ్దత! జీవితంలో అతి ముఖ్యమయినదేదో పోగొట్టుకున్నట్టు...

అతడి చెయ్యి కొద్దిగా కదిలింది. మరో మెత్తని శరీరం తగిలింది.

చప్పున తలతిప్పి చూసాడు అతడు.

గాయత్రి!

అప్పుడు... అప్పుడు గుర్తుకు వచ్చింది అతడికి! గాయత్రి తన పక్కనే ఉంది. ఇది తమ మొదటి రాత్రి!

ఎందుకో మెలుకువ వచ్చి కన్నులు విప్పిన గాయత్రికి అతడు మేలుకుని ఉండడం తెలిసింది. ఆమె అతడికి మరింత దగ్గరగా జరిగింది.

''ఎందుకు లేచారు?''

''మెలుకువ వచ్చింది అంతే''

ఆమె అతడి మీద చెయ్యివేసింది, ''ప్రశాంతంగా నిద్రపోండి''

''ప్రవాహం వాలులో, కాలగతిని కొట్టుకుపోతున్నవాడికి ఏదో ఆధారం దొరికినట్టు అతడు ఆమె చెయ్యి పట్టుకున్నాడు. గట్టిగా కన్నులు మూసుకున్నాడు''

ఏదో ప్రశాంతత!

ఇప్పుడు ఆ చీకటి తనను భయపెట్టడం లేదు. ఒంటరితనపు ఫీలింగ్ బాధపెట్టడం లేదు.

నిశ్చింత!

ఏ వెలితీ లేని భావన!

అతడు నిశ్చింతగా నిద్రపోయాడు.

★ ★ ★

కాల గమనంలో నాలుగునెలలు గడిచాయి.

ఒకరోజు అవినాష్ నుండి లెటర్ వచ్చింది. దాంతోపాటే ఇన్విటేషన్ కార్డ్ కూడా...

శ్రీనివాస్ లెటర్ విప్పాడు. అతడి చూపులు అక్షరాల వెంట పరిగెత్తాయి.

డియర్ శ్రీనివాస్!

ఈ లెటర్‌తోపాటే పాప నామకరణోత్సవం కార్డ్ కూడా పంపుతున్నాను. అయితే ఈ లెటర్ రాయడంలోని అసలు విషయం...

లక్ష్మి డైరీలు చదవడం వలన నీకు తెలిసే ఉండి ఉంటుంది- ఆమె నీ నుండి రెండు కోరింది. ఒకటి నీ పెళ్ళి! ఆ కోరికను తీర్చావు. ఇక ఆమె రెండో కోరిక పాపకు నీ చేతనే పేరు పెట్టించడం. లక్ష్మికి మిగిలిపోయిన ఆ రెండో కోరిక నువ్విప్పుడు తీర్చాలి!

పాప మీద నాకేం అర్హత ఉంది అనకు. అర్హతల విషయం పక్కన పెడితే అది ఒక మరణించిన వ్యక్తి కోరిక! మరణించినవారి కోరిక తీర్చడం మన ధర్మం!

పాపకు పేరు పెట్టబోయేది ఎనిమిదో తారీఖు. ఈ లెటర్ నీకు ఏడో తారీఖు చేరుతుందనుకుంటున్నాను. వెంటనే ఫోన్ చేసి చెపితే ఆ పేరే నిర్ణయిస్తాము.

గిల్టీఫీలింగ్ వద్దు. నేను మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను. ప్లీజ్...

అతడు లెటర్ చదివి కోటు జేబులో వేసుకున్నాడు. కొద్దిక్షణాలపాటు స్తబ్దుగా సోఫాలోనే కూర్చుండిపోయాడు.

గాయత్రి అటుగా వచ్చింది. అతడు అదోలా ఉండడం గమనించింది. అతడి వెనుకగా వచ్చి జుట్టు సరిచేస్తూ లాలనగా అడిగింది "ఏమిటలా ఉన్నారు?"

అతడు కళ్ళెత్తి ఆమె ముఖంలోనికి చూసాడు. క్షణం తటపటాయించాక చెప్పాడు "అవినాష్ నుండి లెటర్ వచ్చింది"

"ఏమిటట?" ఆసక్తిగా అడిగిందామె.

"వాళ్ళు పాపకు పేరు పెట్టబోతున్నారట. లక్ష్మి కోరిక ఆ పాపకు, నా చేతనే పేరు సెలక్ట్ చేయించాలని"

"అయితే అందుకు ఇంతసేపు ఆలోచించడం ఎందుకు? మీ మనసులో ఏదయినా పేరు ఉంటే అతడికి ఫోన్ చేసి చెప్పండి"

"అంతేనంటావా?"

"అంతే" అని ఆగి తర్వాత ప్రశ్నించిది "ఇంతకీ మీ మనసులో ఏదయినా పేరు కదలాడుతుందా?"

తలూపాడు శ్రీనివాస్

"ఆ పేరు ఏమిటో చెప్పండి"

చెప్పాడు అతడు.

ఆమె కొద్ది క్షణాలు మౌనంగా ఉన్నాక చెప్పింది, "మరి వెళ్ళి అవినాష్‌గారికి ఫోన్ చేయండి"

అతడు లేచి వెళ్ళి రిసీవర్ చేతిలోనికి తీసుకున్నాడు. నంబర్ డయల్‌చేసాడు. అవతలివైపు అవినాష్ లైన్‌లోనికి వచ్చాక "నేనూ శ్రీనివాస్‌ని" అన్నాడు.

"శ్రీనివాస్! మీ ఫోన్ కోసమే ఎదురుచూస్తున్నాను"

అతడు ఏం మాట్లాడాలో అర్థంకాక మౌనంగా ఉండిపోయాడు.

అవినాష్ అడిగాడు, "చెప్పండి శ్రీనివాస్! పాపకు ఏదయినా పేరు చెప్పండి"

అతడు పెదవి విప్పాడు. "పాపకు... పాపకు ఏ పేరు పెడతారంటే..."

"ఊఁ! ఏం పేరో చెప్పండి"

"సుప్రజ"

చెప్పేసి ఫోన్ పెట్టేసాడు అతడు.

రెండు అడుగులు వేసాక గాయత్రి అతడికి అడ్డుగా నిలబడింది.

"ఏమిటి?" ప్రశ్నించాడు అతడు.

ఆమె అతడి వంక సీరియస్‌గా చూస్తూ, "లక్ష్మి అక్కయ్య కూతురికి ఒక మంచి పేరు సెలక్ట్ చేసి చెప్పారు. మరి మనకు పుట్టబోయే పాపాయికి ఏం పేరు పెట్టాలనుకుంటున్నారు?" అడిగింది.

"మనకు పుట్టబోయే పాపాయా?" అతడు అయోమయంగా ఆమె వంక చూసాడు.



"అవును మనకు పుట్టబోయే పాపాయే!" చెప్పిందామె.

"మనకు పుట్టబోయే పాపాయి... ఇప్పుడు కాదు కదా!"

"ఇప్పుడు కాకపోతే మరో ఆరు నెలలు..."

"ఆరునెలలకు కదా!..." అని యధాలా పంగా అని అప్పుడే ఏదో లైటు వెలిగి "ఆరునెలలకా?" అన్నాడు ఆశ్చర్యంగా, ఆనంధంగా!

ఆమె కళ్లు నవ్వుతున్నాయి. చూపులు ఉదరభాగంవంక తిరిగాయి. మెల్లగా తలాడించిందామె- ఔనన్నట్టుగా!

గాయత్రి మాటలు అర్థమయిన మరుక్షణం, అతడు ఆమెను రెండు చేతులలో పైకెత్తి గిరగిరా తిప్పాడు. ఆమెకు కళ్లు తిరిగేంతవరకూ తిప్పాడు. "ఇక ఆపండి బాబోయ్" అని అరిచిందామె.

శ్రీనివాస్ ఆమెను కిందికి దించాడు. ఆనందం కొద్దిగా తగ్గాక, ఆమె మరోసారి ప్రశ్నించింది. "చెప్పండి! మనకు పుట్టబోయే పాపాయికి ఏం పేరు పెడదాం"

అతడు ఆమె కన్నులలోనికి చూసాడు. గాలి నిర్మలత్వాన్ని ఆపాదించుకుంది. "చెప్పాలా?" అన్నాడు.

"చెప్పండి"

"ఒప్పుకుంటావా?"

"మీ మనసుకు నచ్చిన ఏ పేరయినా మనస్ఫూర్తిగా ఒప్పుకుంటాను" అతడి మనసులోని పేరు ఆమె మదిలో మెదలాడింది.

"చెప్తున్నాను"

"చెప్పండి"

అతడు తన మనసులోని ఆ పేరు చెప్పాడు.

ఆమె ఊహ తప్పుకాలేదు.

★

# 'చతుర' ప్రపంచం

## పిల్లిగారి ఆత్మత్యాగం

ఓ సైనికుడిగారికి ఒక పెంపుడు పిల్లి ఉండేది. నల్లగా ఉండే ఆ పిల్లి అంటే అతనికి ప్రాణం. వీలు చిక్కినప్పుడల్లా దానితో ఆడుకుంటూ కాలం గడిపేవాడాయన. నిత్యం తనకు పెట్టే ఆహారంలో సగభాగం దానికి పెడ్తూ దాన్నెంతో ముద్దుగా చూసుకునేవాడు.

ఒకనాడు 'మార్చింగ్'కి రమ్మని పై అధికారులనుంచి తాఖీదు అందడంతో హడావిడిగా బయలుదేరాడతను. కానీ అతని పెంపుడు మార్జాలం అతని కాళ్ళకు చుట్టుకుని ఎంతకూ వదలదే! ఓపిగ్గా ఎంత సేపు నచ్చచెప్పినా అది వదలక పోవడంతో విసుగెత్తి ఓ కర్రతో నాలుగు వడ్డించి విసవిసా బయటకుపోయాడతను.

అలా వెళ్ళిన మనిషి అయిదురోజుల తర్వాత తన విధులన్నీ పూర్తి చేసుకుని ఇంటి దారి పట్టాడు. కాలినడకన అడవి మార్గం గుండా వస్తున్న అతనికి దారిలో ఓ చోట ఓ గుడారం కన్పించింది. అందులో ఎవ్వరూ లేరుగానీ ఓ టేబుల్ ఉంది. దాని మీద నోరూరించే ఆహారం ఉంది. అసలే ఆకలిమీద ఉన్నాడేమో మన సైనికుడుగారు 'ఓ పట్టుపట్టేద్దాం' అని ముందుకు కదిలారు. అంతలో ఉన్నట్లుండి అక్కడ ప్రత్యక్షం అయింది అతని పెంపుడు పిల్లి. సైనికుడుగారికి ఆనందం కల్గింది.

"సారీరా... నీ మొండితనంతో మొన్న అనవసరంగా దెబ్బలు తిన్నావ్. ఆకలిదంచేస్తోంది పదపద ఇద్దరం ఆ టేబుల్ మీది ఫుడ్డులాగించేద్దాం'' అంటూ ముందుకు అడుగేశారు. కానీ అందుకు ఇష్టంలేనట్లుగా అతన్ని కదలనివ్వలేదు పిల్లి. సైనికుడు గారికి కోపం



ముంచుకొచ్చింది. పిల్లి వంక చూసి కళ్లెర్ర చేశారు.

ఇక ఈ మనిషిని ఆపలేం అనుకుందో ఏమో పిల్లి అమాంతం వెళ్లి ఆ టేబుల్ మీదికి దూకేసింది. అంతే! పెద్ద విస్ఫోటం... పిల్లి తునాతునకలైపోయింది. అది శత్రువులు ఏర్పాటు చేసిన శిబిరం అని ఆ తర్వాత బయటపడింది. టేబుల్ మీద బాంబుని అమర్చిదాని క్రిందే పెద్ద గొయ్యి తవ్వుకొని అందులో మాటువేసి ఉన్నారు శత్రుసైనికులు. అయితే పిల్లి దూకడంతో ఆ బాంబు సరాసరి వారున్న గోతిలోనే పడి వారి ప్రాణాలు తీసింది. ఆత్మత్యాగంతో యజమాని ప్రాణాల్ని కాపాడ్డమేగాక, శత్రుసైనికుల్ని కూడా మట్టుపెట్టిన ఆ పిల్లి తెలివికి తెగువకు ప్రపంచం మొత్తం అచ్చెరువందింది. ఇది రెండవ ప్రపంచయుద్ధకాలంలో బర్మా సరిహద్దుల్లో జరిగిన సంఘటన.

## శ్రామికుల రాజ్యంలో...

"ఏం నాయనా? ఇది నీ తాతగారి బస్సనుకున్నావా? టికెట్ తీసుకోవేం?" అంటూ మన బస్ కండక్టర్లు అక్కడక్కడా పాసింజర్లని దులిపేస్తుండడం మనకేం కొత్తకాదు. సిటీ బస్సుల్లో ప్రయాణించేవారికి ఇలాంటి దృశ్యాలు చిరపరిచితాలే! కానీ కలకత్తాలోని వ్యవహారం మనకి




పూర్తి భిన్నంగా ఉంటుంది. అక్కడ 'లెఫ్ట్ పార్టీ' పాలనలో ఉందనేమో, పాసింజర్లని చూసి అక్కడి కండక్టర్లే భయపడ్తుంటారట. టికెట్ తీసుకోని వాళ్లని కూడా "బాబ్బాబు! నీకు పుణ్యం ఉంటుంది. టికెట్టుతీసుకో బాబూ" అని బతిమాల్తారే తప్ప ధాష్టీకం చెలాయించలేరట. ఎందుకంటే ఆ ధాష్టీకం ఏదో పాసింజర్లే చేస్తుంటారు. "ఏం తొందర ఆగలేవా?" అనో "నేను టిక్కెట్ తీయను నీ తాతతో చెప్పుకోపో" అనో కండక్టర్ని విదిలించి పారేస్తారు వారు.

సిటీబస్‌లేగాదు ట్రామ్‌లు, మెట్రో రైల్వేలోనూ ఇదే పరిస్థితి. పోనీ ఆ టికెట్ ఏమైనా చాలా ఖరీదా అంటే అదేం లేదు. అదిఒక రూపాయికిమించి ఉండదు. అయినా దాన్ని వెచ్చించడానికే వాళ్లు పిసినారితనం ప్రదర్శిస్తారు. అంతేకాదు టికెట్ తీసుకునేవాణ్ణి శుద్ధ చవటాయి క్రిందలెక్క గడ్తారటవాళ్ళు.

అక్కడి ఆటో డ్రైవర్లు, టాక్సీ డ్రైవర్లూ మన వాళ్లకేం తీసిపోరు. తక్కువ దూరాలలోనున్న గమ్యాలకి వాళ్లు చచ్చినారారు. అంతేకాదు మనుషులు చేతులతో లాక్కుపోయే పాతకాలం రిక్షాలూ అక్కడ ఇంకా దర్శనమిస్తుంటాయి.

# బుజ్జి విమానంలో పెద్ద సాహసి

గమ్మత్తుగా వుండే ఓ బుజ్జివిమానంమీద బ్రిటన్నుండి న్యూఢిల్లీకి 23 రోజులలో ప్రయాణించిన ఘనత విజయభట్ సింఘానియాకే దక్కింది. ప్రపంచం మొత్తం అతని సాహసకృత్యం చూసి జేజేలు పలికింది. అంతేకాదు అతని పేరు గిన్నిస్ బుక్‌లోకి కూడా ఎక్కిపోయింది.




సింఘానియా పయనించిన ఆ బుజ్జివిమానం బరువు 150 కిలోలకన్నా ఎక్కువ లేదు. గట్టిగా గాలివీస్తే కొట్టుకుపోయేలా ఉంటుందది. ఇంజన్ హార్స్‌పవర్ కూడా కేవలం 500 సి.సి.లు మాత్రమే. పెట్రోలు టాంకులో 125 లీటర్లకన్నా ఎక్కువ పెట్రోలు పట్టదు. అంచేత అవసరమైనప్పుడల్లా క్రిందకుదిగి పెట్రోలు పోయించుకునేవాడతను. గరిష్ఠవేగం విషయానికి వస్తే అది గంటకు కేవలం 70 కిలోమీటర్లే! మరో విచిత్రం ఏమంటే ముందువైపు ఉంటే దారి కన్పించదని ఆ విమానానికి ప్రొపెల్లర్లు వెనుకవైపున బిగించారు. ప్యారాచూట్ సౌకర్యంగానీ, దిక్సూచి సౌకర్యాలుగానీ అసలు లేనేలేవు.

ఆటబొమ్మలాటి ఆ విమానంలో 12,000 అడుగుల ఎత్తున రోజుకు 285 కిలోమీటర్ల చొప్పున ప్రయాణించాడు సింఘానియా. ఆ సాహసయాత్రలో సవాలక్ష అనుభవాలు అతనికి ఎదురయ్యాయి. ఆల్ప్స్ పర్వతశ్రేణి మీదుగా ప్రయాణించేటప్పుడు అక్కడి ఉష్ణోగ్రత 'జీరో' (౦) కన్నా తక్కువ కావడంతో విపరీతమైన చలికి, సౌదీఅరేబియా ఎడారులపైగా పోయేటప్పుడు భయంకరమైన వేడికి గురయ్యాడు. మధ్యధరాసముద్రంపై ప్రయాణించే సమయంలో పెట్రోలుటాంకుకి చిల్లిపడి కారడం మొదలెట్టింది. అది చూసి ప్రాణాలపై ఆశ వదులుకొన్నాడు సింఘానియా. ఎలాగైతేనేం? అడుగడుగునా ఆపదలని ఎదుర్కొంటూ తన లక్ష్యాన్ని నెరవేర్చుకోగలిగాడతను.

## ప్రాణదానం చేసిన డిటెక్టివ్ నవల

ఇన్‌ఫర్మేటివ్ నవలలపేరుతో తెలుగులో ఇటీవల విమానాలలోని వసతుల గురించి, గుర్రప్పందాల విశేషాల గురించి, మోడలింగ్ తారల జీవితాల గురించి... ఇలా ఇంకా ఎన్నెన్నో రకాల సబ్జక్టులమీద రకరకాల నవలలు కుప్పలు, తెప్పలుగా విడుదలవుతున్నాయి. మానవాళికి ఇవెంత ఉపయుక్తంగా ఉంటున్నాయన్నది సదరు రచయితలూ, వారి అభిమాన పాఠకులూ మాత్రమే తేల్చిచెప్పగల విషయం. అయితే కేవలం డిటెక్టివ్ కథారచయిత్రిగా పేరెన్నికగన్న అగాథాక్రిస్టీ రాసిన ఓ డిటెక్టివ్ నవల ఆమధ్య ఓ నిండుప్రాణాన్ని కాపాడింది.

ఎలాగంటే-

గల్ఫ్‌కు చెందిన ఓ బుడతడు అంతుచిక్కని ఓ మొండివ్యాధితో బాధపడ్తుంటే లండన్‌లోని హామర్‌స్మిత్ హాస్పిటల్‌లో చేర్పించారు. ఎన్నిరకాల పరీక్షలు చేసినా వ్యాధి ఏమిటన్నది నిర్ధారణ కాలేదు. వ్యాధిని నిర్ధారిస్తేగదా చికిత్సనారంభించేది? పిల్లవాడి పరిస్థితి క్రమేణా వికటిస్తోంది. ఆదశలో మార్షామిట్‌లాండ్ అనే నర్సుకు ఓ సంగతి ఫ్లాష్‌లా గుర్తుకొచ్చింది. అగాథాక్రిస్టీ రాసిన 'ది పేల్‌హార్స్' నవలలోని ఓ పాత్రకు కూడా ఇలాంటి జబ్బే చేస్తుంది. అతి ప్రయాసమీద నవలలోని డాక్టర్ పాత్ర ఆ రోగాన్ని 'థాలియం పోయిజనింగ్'గా నిర్ధారించి అందుకు తగిన మందులు వాడుతుంది. ఆవిధంగా అందులోని రోగి రక్షించబడ్తాడు. ప్రస్తుతం ఈ కుర్రవాడి రోగలక్షణాలు కూడా ఆ నవలలో వర్ణించిన రోగ లక్షణాలనే పోలి ఉన్నాయి గనుక దీన్ని 'థాలియం పోయిజనింగ్'గా ఎందుకు భావించకూడదు అనుకుందామె. అనుకోవడమేగాదు, డాక్టర్లకీ విషయాలన్నీ విప్పిచెప్పి, అతి కష్టంమీద వారిని ఒప్పించి, అందుకు తగ్గ పరీక్షలు చేయించింది. పరీక్షలలో ఆమె అనుమానం కరెక్టేనని ఆ జబ్బు 'థాలియం పోయిజనింగే'నని ధ్రువపడింది. ఇంకేముంది? రోగమేదో తెల్సిపోవడంతో చికిత్స మొదలవడం, కుర్రవాడు పదిరోజులు తిరిగేలోపే మృత్యుముఖంనించి బయటపడ్డం జరిగిపోయింది.



# విషగుళిక పై సమీక్షలు

మే నెల 'చతుర'లో ప్రచురితమైన పంతుల జోగారావ్ నవల 'విషగుళిక'పై మాకందిన సమీక్షలలో ఉత్తమమైన ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## 'అభినందనీయం'

*(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)*

ఈనాడు విద్యారంగమే అస్తవ్యస్తంగా ఉంది. శివుడు గరళాన్ని కంఠంలో ఇముడ్చుకున్నట్లు ఈ రంగంలో కాలుష్యాన్ని బయటకు కక్కలేక, లోపల ఇముడ్చులేక ఎందరో నిజాయితీపరు లు బాధపడుతున్నారు. రచయిత పంతుల జోగారావుగారు ధైర్యం చేసి ఈ సమస్యను ఇతివృత్తంగా తీసుకొని నవల రాయడం అభి నందించదగిన విషయం.

నిరుద్యోగిగా ఉండిపోవలసిన 'విద్యాసా గర్', 'పాండ్యా'లాంటి నిజాయితీగల జా యంట్ కలక్టర్ దయవలన ఉపాధ్యాయుడ య్యాడు. ఎన్నో కలలతో, ఇంకెన్నో ఆశయాలతో వేడి రక్తపు ఆవేశంతో ఆ మండలానికి వెళ్ళిన అతడికి తారసపడిన మండల విద్యాధికారి జుగుప్సాకరమైన ప్రవర్తన నిజంగా బాధించే విషయమే. అధికారులను ఆశ్రయించి కొంద రు మాష్టర్లు ఎలా పబ్బం గడుపుకుంటున్నారో రచయిత చక్కగా వివరించారు. అయితే చె డుతోపాటు ఏ రంగంలోనైనా, అంతో ఇంతో మంచి కూడా ఉంటూనే ఉంది. అసలు విద్యా సాగర్ పాత్ర నిర్మాణంలోనే చాలా లోపాలు ఉన్నాయి. అనారోగ్యంగా ఉన్నప్పుడు సరే ఆరో గ్యం చిక్కాక కూడా అతడు పులిపుట్టు వెళ్ళా లని అనుకోకపోవడం నిజంగా బాధపడేవి షయం. పద్మ హితబోధ చేసేవరకు విధి నిర్వహణకు పూనుకోకపోవడం అతని వ్యక్తిత్వా నికే మచ్చ. నీటిమీద రాతలవంటివి అతని ఆశయాలని అనుకునేలా ప్రవర్తించాడతను.

'పులిపుట్టు' వెళ్ళిన అతడు గిరిజనులలో విద్యాదీపం వెలిగించి, వాళ్ళ దృష్టిలో ఆకాశ మంత ఎదిగాడు. దానితో తృప్తిపడక నాగరిక ప్రపంచానికి దూరమయ్యాననీ, చదివిన చదు వుకు తగిన ఉద్యోగం రాలేదనీ మధనపడటం బాగుండలేదు. ఆశయాలకు తగిన గొప్ప మన ను లేక తనకు బ్రహ్మరథం పట్టే పులిపుట్టు ప్రజలకు దూరమై పట్నం వచ్చిపడ్డాడు. అత డి సమస్యకి అది వ్యక్తిగత పరిష్కారం కావచ్చు గాని, విద్యావ్యవస్థకు తలవంపే.

అలాగే యం.ఇ.ఓ.ని మరీ బాధ్యతారహితు నిగా చిత్రీకరించారు. ఏ వ్యక్తీ స్వతహాగా చెడ్డవాడు కాడు. పరిస్థితులు వారిని విధినిర్వ హణకు దూరం చేస్తున్నాయి! 'లంచాలు', 'మందు' తమ స్వార్థం కొరకు అధికారులకు ఉపాధ్యాయులు అంటగడితే వారు రుచి మరి గిన పులులై అచ్యుతరావులౌతున్నారు. మరి ఉపాధ్యాయ సంఘాలేం చేస్తున్నట్లు?

రచయిత పరీక్షావిధానం, ఇన్విజిలేషన్ మొ దలగునవి ఎన్నో అలా ముట్టుకుని ఇలా వదిలేశారు. స్ట్రిక్ట్‌గా ఉన్న వాళ్ళందరూ కస్తూరి రావులాగ బలైపోవడంలేదు. ఎక్కడో, ఎప్పుడో, ఏదో జరిగిందని ఇన్విజిలేటర్లు లూజ్‌గా ఉండటం సమంజసమా? సక్రమంగా వృత్తిని నిర్వహించాలనుకునేవారికి నిజాయితీతోపాటు గుండెధైర్యం కూడా కావాలి. ఇంతకీ రచయిత సమస్యలను భూతద్దంలో చూపించారేగాని పరిష్కారమార్గం ఎక్కడా సూచనప్రాయంగా కూడా ధ్వనింపచేయలేదు. సమాజానికి ఆద ర్శాలు వల్లించే విద్యాసాగర్‌లు కాదు, ఆచ రించేవారు కావాలి. నిజాయితీపరులైన ఉద్యో

గస్తులను సమాజం ఎప్పుడూ గౌరవిస్తూనే ఉంటుంది. కాలగర్భంలో నిలిచేది అట్టివారే.

-టి. సూర్యనారాయణమూర్తి
పెదబొండపల్లి.

## 'హెచ్చరిక'

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

విద్యావ్యవస్థలో అవినీతి అధికారులు ఉండడంవల్లనే విద్యారంగం వ్యాపారంగా తయారైందనడానికీ, పులిపుట్టులాంటి ఎన్నో గ్రామాల ప్రజలు నిరక్షరాస్యులవడానికీ, అచ్యుతరావులాంటి లంచగొండి అధికారులవల్లనే నిరక్షరాస్యత పెరిగిపోయిందనడానికీ 'విషగుళిక' నిదర్శనం.

పులిపుట్టు గ్రామం గురించి ఎంత భయం చెప్పినా వినకుండా ప్రాణాలకు తెగించి తన విధి తను నిర్వర్తిస్తానని వెళ్ళి తన సృజనాత్మక ఆలోచనలను కదిలించి ఆగ్రామాన్ని విద్యలో ఒక మెట్టు ఎక్కించాడు. అంతలో అతనికి స్వార్థపూరిత ఆలోచనలు మొదలై తను పైకి ఎదగాలని, ప్రమోషను వచ్చి లెక్చరర్ కావాలని అనిపించటం ప్రారంభించింది.ఎలిమెంటరీ స్కూల్‌లో ఉద్యోగం చేయడం చిన్నతనంగా భావించడంతో అంతవరకు ఆలోచించిన సృజనాత్మక ఆలోచనలు బూడిదలో పోసిన పన్నీరులా అయిపోయాయి. ప్రజల గురించి ఆలోచించినవాడు 'ప్రజలకు మేలు చేయాలనుకున్నవాడు డబ్బు, హోదా, చిన్నతనం అనేవి ఆలోచించడం మూర్ఖత్వం. మధ్యమధ్య తన ఆలోచనలకు విరుద్ధమైన సంఘటనలుగాని, వ్యక్తులుగాని ఎదురైనపుడు స్పందిస్తున్నాడేగాని ఆచరణ మాత్రం శూన్యం. తను ట్రాన్స్‌ఫరై హైస్కూల్‌కువచ్చి పద్మతో కలిసి తిరుగుతూ పద్మను తనకనుకూలంగా మార్చుకొని కృళ్ళి, కృశించి, భ్రష్టుపట్టిపోయిన ఆ స్కూల్‌ను తీర్చిదిద్ది ఆ స్కూల్‌కు ఆదర్శమూర్తులవుతారని ఆశించినా అలా జరగలేదు. నాణేనికి బొరుసు మాత్రమే కాదు బొమ్మకూడా వుంటుందని నిరూపిస్తాడని అనుకొన్నాను కాని కథ రాను రాను నీరుగారినట్టనిపించింది.

నేటి సమాజంలో ఇప్పటికీ అవినీతి, లంచగొండితనానికి అలవాటుపడిన త్రాగుబోతు అధికారులు లేకపోలేదు. అలాంటి అధికారులకు అచ్యుతరావు సస్పెన్షన్ ఒక హెచ్చరికగా వుపయోగపడుతుంది.

-కె.అరుణ
సైదాపూర్

## 'అమృత గుళిక'

*(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

సమాజాభ్యున్నతికి తోడ్పడే భావి పౌరులను తయారుచేసేవాడే నిజమైన ఉపాధ్యాయుడు. ఒక డాక్టరు తప్పు చేస్తే ఒక వ్యక్తి మరణించవచ్చు. కాని ఒక ఉపాధ్యాయుడు తప్పుచేస్తే ఆ ప్రభావం సమాజం అంతటిమీద ఉంటుంది. ఉపాధ్యాయ వృత్తిని ఎంతో ఉన్నతమైనదిగా భావించి, ఎంచుకొని ఆ వృత్తిలో ప్రవేశించిన విద్యాసాగర్‌కు మండల విద్యాధికారి నుండి ఎదురయిన అనుభవం బాధాకరం! అయితే తోటి ఉపాధ్యాయుడు జానకేశ్వరరావుద్వారా లభించిన స్నేహం అదంతా మరిచిపోయేట్లు చేసింది. మారుమూలనున్న పులిపుట్టు గ్రామ ప్రజల నిష్కల్మష ప్రేమానురాగాలు అతనిని కట్టిపడవేశాయి.

నేడు సమాజంలో ఏ రంగాన్ని చూసినా అవన్నీ భ్రష్టుపట్టిపోయే ఉన్నాయి. అవినీతి, లంచగొండితనం ఎయిడ్స్ వ్యాధిలా వ్యాపించాయి. కొద్దో గొప్పో నైతిక విలువలున్న విద్యారంగం కూడా వృత్తిపట్ల గౌరవంలేని వారివల్లా, అవినీతి అధికారులవల్లా పతనం అయిపోతోంది. దీనికి ప్రత్యక్ష సాక్ష్యం సర్కారీ దవాఖానాల్లాంటి ప్రభుత్వ పాఠశాలలే! ప్రతి ఏటా ఏ కొందరో ఉత్తమ ఉపాధ్యాయులుగా గౌరవ పురస్కారం అందుకోవటం తప్ప జనరల్‌గా ఉపాధ్యాయులు ఏ మేరకు ఉత్తమ పౌరులుగా విద్యార్థులను తీర్చిదిద్దగలుగుతున్నారన్నది ప్రశ్నార్థకమే. జీతాలు తీసుకొని వృత్తిధర్మం నిర్వర్తించని ఉపాధ్యాయులకంటే బ్రతుకుతెరువుకోసం ట్యూషన్లు చెప్పి, ఉత్తమ సంస్కార భావాలుగల నారాయణలాంటి వ్యక్తిని తీర్చిది

ద్దిన విద్యాసాగర్ తల్లి నిజమైన ఉత్తమ ఉపాధ్యాయురాలు. నేడు విద్యారంగంలో యువతరం ప్రవేశిస్తున్నా ఉన్నతాశయాలు మాత్రం శూన్యం.

విద్యారంగంలోని లోటుపాట్లను విశ్లేషిస్తూ రాసిన ఈ నవల విషగుళిక కాదు, అమృత గుళిక.

-పి.వి.దుర్గాప్రసాద్,
హుజూర్‌నగర్

## 'బొమ్మ-బొరుసు'

*(నాలుగవ బహుమతి రూ. 25/- పొందిన సమీక్ష)*

అభివృద్ధి పథాన్నధిరోహించవలసిన విద్యావ్యవస్థ జారుడు మెట్ల మీదుగా అధోగతిలోకి జారిపోడానికి గల కారణాలను వివరణాత్మకంగా, విశ్లేషణాత్మకంగా వివరించిన మంచి రచన 'విషగుళిక'.

మారుమూల కొండ ప్రాంతాలలో సహితం స్కూళ్లు పెట్టి ఉపాధ్యాయులను నియమిస్తోంది ప్రభుత్వం. అయినా అభివృద్ధి మార్గంవైపు విద్యావ్యవస్థని మళ్లించడానికి కృషి చేయవలసిన అచ్యుతరావువంటి ఆఫీసర్లు చీడపురుగులుగా వాటిని నిష్ప్రయోజనకరంగా తయారు చేస్తున్నారు.

అర్హతకు తగిన ఉద్యోగం దొరకకపోవడం, చాలీచాలని జీతాలు, బోధనేతర బాధ్యతలను కూడా నిర్వర్తించవలసి రావడం వంటివి సహజంగా మనిషిని ఎంత ఫ్రస్ట్రేషన్‌కి గురి చేస్తాయో, ఎలాంటి హిపోక్రాట్‌గా మారుస్తాయో అచ్యుతరావు, తెలుగు మేష్టారు నరసింహారావు వంటి పాత్రలు తెలియజేస్తాయి.

విద్యాసాగర్ పాత్రతో చెప్పించినట్లు నాణేనికి బొమ్మతోపాటు బొరుసూ ఉంటుందని బురదలో పుట్టిన పద్మంలాంటి సార్థక నామధేయురాలు పద్మ, సత్యం మాష్టారూ చూపుతారు.

రేపటి తరం నిర్వీర్యం కాకూడదని తపించి పరీక్షలలో కఠినంగా ప్రవర్తించినందుకు రౌడీల బారిన పడి, సమాజం దృష్టిలో ఓడిపోయి, నక్సలైట్‌గా మారి, పోలీసుల తూటాలకు రాలిపోయిన కస్తూరిరావు టీచర్ పరీక్షా విధానంలోని అవకతవకలను ఎత్తి చూపే ఓ మచ్చుతునక.

బడి కూడా గుడిలాంటిదేనని భావించి దాని అభివృద్ధికి పాటుబడే దాతలు, వృత్తినే దైవంగా భావిస్తూ బలహీనతలను, అవరోధాలను అధిగమించి ఒక కొత్త తరాన్ని తయారు చేయాలనే ఆశయంతో నిరంతరం శ్రమించే విద్యాసాగర్, జానకేశ్వర్, సత్యం లాంటి ఉద్యోగులూ విద్యావ్యవస్థ అనే మహావృక్షం మూడు పువ్వులూ, ఆరు కాయలుగా వర్ధిల్లడానికి నేడు ఎంతో అవసరం.

మొత్తం మీద ఒక మంచి నవలని చదివామన్న తృప్తిని మిగిల్చిందీ నెల 'చతుర' నవల.

-పత్రాయని సుధారాణి
మద్రాసు

## 'మండుతున్న సమస్య'

*(అయిదవ బహుమతి రూ. 25/- పొందిన సమీక్ష)*

అన్ని ధరలతోపాటు ఆకాశానికెగిరిపోతూ 'విద్య' అనేది కూడా ధనిక వర్గాలకు మాత్రమే అందుబాటులో వుండే వస్తువైపోతోందీనాడు! 'గురుర్బ్రహ్మా... గురుర్విష్ణుః...'అన్న స్థాయి నుంచి 'ఆకాశంబు నుండి శంభునిశిరంబు, అందుండి..' అన్న చందంగా అతి నికృష్ట స్థానానికి దిగజారింది గురువు యొక్క స్థానం. ఈ సమాజ నిర్మాణంలో గురువుదే ప్రముఖ పాత్ర అనడం ఏ మాత్రం సత్య దూరంకాదు. అతి ఖరీదు చదువులుగా మారిన కాన్వెంటు విద్యను ప్రక్కకు పెట్టి ప్రభుత్వ విద్యాసంస్థలు, విద్యాధికారుల కార్యాలయాల స్థితిగతుల గురించి ఆలోచిస్తే పంతుల జోగారావ్‌గారి 'విషగుళిక' నవలలోని ప్రత్యక్షరమూ నిజం... నిజం... అనకతప్పదు. తప్పెవరిదని ఆలోచిస్తే ఇది చెట్టముందా... విత్తుముందా? అనే సమస్యలాంటిదే. ఈ సంస్థల పతనానికి గల కారణాల్ని, విద్యాలయాల్లో తత్సంబంధిత కార్యాలయాల్లో జరుగుతున్న అక్రమాలను, లోపభూయిష్ట విధానాలను విపులంగా చర్చించారీ నవలలో.

కానీ, ఆదర్శ ఉపాధ్యాయునిగా రూపొందా

లని కలలుగన్న విద్యాసాగర్‌ని వుదాత్తమైన పాత్రగా నిలబెట్టడంలో విఫలమయ్యారు. ఎంతో తహతహతో పులిపుట్టు వెళ్లిన విద్యాసాగర్ అక్కడి ప్రజానీకంతో అనుబంధాన్ని పెంచుకొని వారి అభ్యున్నతికి దోహదకారి కావల్సింది పోయి ఎప్పుడెప్పుడు ప్రమోషన్ వస్తుందా అని ఎదురు చూడ్డంతోనే సరిపోయింది. ఎన్నుకున్న ఇతివృత్తానికి తగిన ప్రతి నాయకునిగా ఒక మండల విద్యాధికారి పాత్రను సృష్టించిన రచయిత ఆ పాత్రను ఢీకొనగల్గిన నాయకునిగా విద్యాసాగర్‌ను తీర్చిదిద్దలేకపోయారు. అలానే ఆదర్శభావాలు కలిగిన ఉపాధ్యాయులు సత్యం, జానకేశ్వరరావుల పాత్రలకు ఎలాంటి ప్రయోజనాన్ని కల్గించలేకపోయారు. నవలలో గుర్తింపు పొందవలసి, ఏ ప్రాధాన్యతా లేక మిగిలిపోయిన మరొక పాత్ర పద్మ. సమాజానికి పట్టిన చీడ పురుగులాంటి అచ్యుతరావు కూతురు...

పాత్రల ప్రాధాన్యతను ప్రక్కన పెడితే నేటి సమాజంలో మండుతున్న సమస్యల్లో ఒకటైన విద్యావిధానం గురించి తెలియజెప్పడంలో రచయిత కృతకృత్యులయ్యారు. అందుకు అభినందనలు తెల్పక తప్పదు!!

-వి.యస్.యన్.మూర్తి
తణుకు

## 'అవినీతి రంగం'

*(ఆరవ బహుమతి రూ. 25/- పొందిన సమీక్ష)*

న్యాయవాద, వైద్య, ఉపాధ్యాయ వృత్తులు సమాజంలో గౌరవ ప్రదమైనవనీ, వీటిలో మొదటి రెండూ నైతికంగా దిగజారి పోగా, ఉపాధ్యాయ వృత్తి కొంతవరకు స్వచ్ఛందంగా వుందనీ కొన్నేళ్ల క్రితం నేటి రాష్ట్రపతి శంకర్‌దయాళ్‌శర్మగారు ఒక సభలో అన్నారు.

కానీ పంతుల జోగారావ్‌గారి 'విషగుళిక' నవల చదివిన తర్వాత ఉపాధ్యాయులలో, విద్యారంగంలో కూడా ఎంత స్వార్థపరత్వం, అవినీతి పేరుకుపోయిందో తేటతెల్లమౌతుంది. బిడ్డకు జన్మ నిచ్చేది తల్లికాగా, ఆ జన్మను సార్థకం చేసే గురుబ్రహ్మగా తరతరాలనుండి సమాజంలో ఉన్నత స్థానాన్ని గౌరవాన్ని పొందిన ఉపాధ్యాయుడే నేడు విద్యార్థులకు చిట్టీలు అందించి పరీక్షలలో అక్రమాలకు పాల్పడుతున్నాడంటే ఎంతో బాధ కల్గుతుంది. ఒకప్పటి బతకలేని బడిపంతులు నేడు బతకనేర్చిన బడిపంతులయ్యాడా? ఉపాధ్యాయ సంఘాలు జీతభత్యాలు, సెలవులు, ఇంక్రిమెంట్ల కొరకు పోరాడతాయే తప్ప, విద్యా ప్రమాణాల కొరకు కాదు.

ఈ నవలలోని అచ్యుతరావులాంటి విద్యాశాఖాధికారులు నేడు కోకొల్లలు. అధికార మనస్తత్వాన్ని చక్కగా చిత్రించారు రచయిత. కానీ అచ్యుతరావు మరణిస్తే సానుభూతిని చూపించడం, అతని కూతురు పద్మకు అంత ప్రాముఖ్యమివ్వడం ఎందుకో అర్థం కాదు. విద్యాసాగర్ సైన్స్ టీచర్ అయివుండి కూడా తన చెల్లెలు శాంతి వరుసగా నాలుగేళ్ళు టెన్త్‌లో సైన్స్‌లో తప్పుతూ వుంటే ఏమీ చేయలేకపోయాడు. కానీ పద్మ కాస్త మందలించగానే శాంతి బాగా చదివి పరీక్ష రాయడం విడ్డూరంగా వుంది.

అటవీప్రాంతపు 'పులిపుట్టు' గ్రామానికి పని గట్టుకుని విద్యాసాగర్ సాహసించి వెళ్లినప్పుడు అక్కడ అతడేదో సాధిస్తాడనీ, కథంతా పులిపుట్టు గ్రామంలోనే నడుస్తుందనీ ఊహించుకొన్న పాఠకులకు నిరాశే మిగులుతుంది. ఏడాది తిరిగేసరికి అతడూ ఒక సగటు ఉపాధ్యాయుడిలానే తప్ప పాఠకుల ముందు ఆదర్శ ఉపాధ్యాయుడిగా నిలబడలేకపోయాడు.

కథాకథనంలోను, ముగింపులోను ఇంకా కొంత ప్రతిభను చూపించినట్లయితే బాగుండేది. మొత్తానికి ఈ నెల చతుర వైవిధ్యమున్న నవలను అందించిందని చెప్పవచ్చు.

-ఎస్.ప్రతాప్‌రెడ్డి
హుజూర్‌నగర్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

CHATURA Telugu Monthly Hyderabad—500 482 Regd. No. H/H